**This Life of King Edward, vii.**

is respecfully dedicated

To

Rao Bahadoor Govind Doss Chathurbhuja Doss

for the kind sympathy he shows to the

men of Telugu Lettrs.

శ్రీ

రాధాకృష్ణ పరబ్రహ్మణేనమః.

—oo✿oo—

క. ఇలవెలఁది మోమునెల నిడు
చెలువపుఁ గెంబొట్టనంగ సిరులను బేర్మిన్
వెలిసెడిచెన్నపురంబునఁ
గల రలఘూర్జరులు వర్తకకళాప్రౌఢుల్. I

తే. వారిలో ఖాను దాసాహ్వయార్యుఁ డమల
సత్యమార్గమునఁ గలిమిఁ జాలఁ గూర్చి
దానధర్మైకనిరతుఁడై దైవభక్తి
బాల కృష్ణుని సేవించి పడసె ముక్తి. 2

క. అతనికిఁ గుశాలుదాసుఁడు
వితరణ గుణశాలి సాధువిప్రుల నెలమిన్
సతతముఁ బ్రోచెడిపుత్త్రుఁడు
కుతుకంబెదఁ బెనఁగొనంగఁ గూర్మి జనించెన్. 3

ఉ. వెన్నునినంజతమ్ములను వీడనిబత్తిని గొందతామరన్
సన్నుతి సేసి సజ్జనుల సర్వవిధంబుల నాదరించి య
త్యున్నతగౌరవస్థితుల నొందిచతుర్భుజదాసు పుత్త్రునిన్
గన్నకుశాలుదాసునకు ధాత్రితలమం దొరు లెన్న సాటియే?

తే. శ్రీచతుర్భుజదాసుండు శ్రీలఁ బెంచి
కలిమిఁ దనకుద్దిలేఁడని పలుక జనులు
బీదసాదల హరిప్రీతి నాదరించి
కీర్తి కౌముది వెలయంగఁ గృష్ణుఁ జేరె. 5

క. వానికి నిర్వురు తనయులు
మానధనుల్ పాపభీత మానసులు ధరన్
సూనృతవాక్య ధురీణులు
జానక జన్మించి రధిక గౌరవ మెసగన్. 6

క. గిరిధరగోవిందాహ్వా యు
లరుదార విభూతి మెఱయ నంచితవిద్యల్
కరమర్థి నేర్చి పెద్దలఁ
బరితృప్తులఁ జేతు రిలను భవ్యశ్రీలన్. 7

తే. గీ. అన్న గిరిధరు ననిశంబు నధికప్రీతి
జానకీరాము లక్ష్మణస్వామి గొల్చు
భంగి సేవించి శ్రీకృష్ణుపాదకమల
మధువుఁ గ్రోలుగోవిందుఁడు మహితభక్తి. 8

తే. గీ. ఆంధ్రభాషావధూటి సనారతంబు
గౌరవించుట కెదఁ గోరిఁ గవుల బుధుల
నాదరించుచు బీదల మోద మెసఁగఁ
మనుచు గోవిందుఁ బ్రోచెడి మాధవుండు. 9

తే. గీ. నేల నైదవభాగంబు నేలినట్టి
శ్రీమ దెడ్వర్డుచరితంబు హృద్యసరణి
నాంధ్రభాషను గూర్చితి నందు మయ్యా
దాని గోవింద నీకీర్తి ధరణి వెలుఁగ.



# విన్నపము.

ప్రపంచములోఁ బంచమాంశమునకు నధీశ్వరుం డైన యెడ్వర్డుచరితమును నేను తేటతెలుఁగున వ్రాసి, నాచే వ్రాయఁబడు మహాపురుష జీవితములలో ద్వితీయ గుచ్ఛముగఁ జేర్చితి. శ్రీ మద్విక్టోరియా యొక్కయు నాయనభర్త అగు నాల్బర్టు ప్రభువుయొక్కయు చరిత్రంబులును, ఇంకఁ గొందఱు ఎడ్వర్డునుగూర్చి వ్రాసినగ్రంథములును సాహాయ్యముగఁ గైకొని, నే నీ యెడ్వర్డుచరితంబు వ్రాసితి. కాఁబట్టి నేను ఆచరిత్ర గ్రంథకారులయెడ మిక్కిలి కృతజ్ఞత కలవాఁడనై యున్నాఁడ. నే నీగ్రంథమును ముద్రించుటలో జ్యోతిష్మతీ ముద్రాక్షరాధికారులును, సంస్కృతాంధ్రంబులయందు సాహిత్య చక్రవర్తులును, కవిసింహులును, అస్మద్గురువర్యులును, అయిన బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలు గారును, శ్రీపచ్చయప్ప కళాశాలాంధ్రపండితులైన శ్రీమాన్ పర్ణశాల నృసింహాచార్యులును, నాకుమిక్కిలి తోడుపడిరి. నేను వీరికిఁ గృతజ్ఞతాపూర్వక వందనముల నర్పింపుచు ముద్రణచిత్తుకాగితములను దిద్దిన మ-రా-రా-శ్రీ, ఓ. వై. దొరసామయ్య గారికి నానెనరు నూపుచు, విద్వజ్జనులును, విద్యాధికారులును, పాఠశాలలయందుం

నాంధ్రపండితులును, సకల మహాసీయులును, ఆంధ్రభాషాభిమానులును, నాకుఁ దగినసాయము సేసి, ఇట్టి గ్రంథముల రచించుటకు నన్ని తెఱంగులఁ దోడ్పడుదు రని నమ్ము.

చెన్నపురి.
సాధారణనామ సం. ము.
ఫాల్గుణశుద్ధ 3 శుక్రవారము.
3-3-౧౧.

సర్వజనుల విధేయుఁడు.

యస్. వి. రంగాచార్యులు.

# CONTENTS.

# విషయసూచిక.



## మొదటి అధ్యాయము.



## రెండవ అధ్యాయము.



## మూఁడవ అధ్యాయము.



## నాలవ అధ్యాయము.



## అయిదవ అధ్యాయము.



## ఆఱవ అధ్యాయము.

## ఏడవ అధ్యాయము.



## ఎనిమిదవ అధ్యాయము.



## తొమ్మిదియవ అధ్యాయము.



## పదియవ అధ్యాయము.



## పదునొకండవ అధ్యాయము.



---

| పుట. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 125. | నివసించుటకు—ఏర్పడెను. | భీదలు నివసించుటకు—ఏర్పడెను. |

శ్రీ

# సప్తమైడ్వర్డు చరిత్రము.

## మొదటి అధ్యాయము.

### వంశచరిత్రము.

శ్రీ యయిదవ జార్జి ఈకాలమున నింగ్లండు స్కాట్లండు అయిర్లండు కన్నడా ఆస్ట్రేలియా హిందూదేశము మున్నగు రాజ్యములను పాలించు చున్నాఁడు. ఈయనతండ్రి యేడవ యెడ్వర్డు. ఇతఁడు పైనఁ బేర్కొనిన రాజ్యములను జార్జికిఁ బూర్వమున నేలెను. ఈ యెడ్వర్డునకు ముందు నాతని తల్లి శ్రీ విక్టోరియామహారాజ్ఞి యాదేశములను బరిపాలించెను. ఈ యమకు ముందు నింగ్లండు స్కాట్లండు మొద లగురాష్ట్రముల నేలుచుండినవారి చారిత్రమును ఇంచుక చెప్పి యావల నేడవయెడ్వర్డు చరిత్రమును అభివర్ణించెద.

రమారమి రెండువేలేండ్లకుముందు రోమనుపురిపౌరులు ఇంగ్లండును పాలించిరి. వారి వెనుక జర్మని దేశస్థులు బ్రిటనను రాజ్యమునకు వచ్చి దానిని ఆక్రమించుకొని దానికి నింగ్లండని పేరిడిరి. వారీయింగ్లండున నివసించుటచే వారికి

నింగ్లీషువా రని పేరు వచ్చెను. వా రింగ్లీషు భాషను మాటాడిరి. వా రాదేశమునఁ జిన్నచిన్న రాజ్యములకుఁ బ్రభువు లై ఆయారాజ్యములను బాలించు చుండిరి. వారు రోమను పురినుండి ఇంగ్లండునకు వచ్చినక్రైస్తవ మతబోధకుల బోధనలను విని క్రైస్తవ మతము నవలంబించిరి.

ఈ యింగ్లీషువారు ఇంగ్లండునఁ జిన్నచిన్న రాజ్యములకు నధిపతు లై యుండినపుడు ఆయిరోపాలో నుండుడెన్మార్కు రాజ్యమునుండి కొందఱు ఇంగ్లండునకుఁ జనుదెంచి కొంచెకొంచెముగ దాని నాక్రమించుకొని పాలింపసాగిరి. వారిలో ముఖ్యులు ఆల్ఫ్రెడ్డనుగొప్పరాజును, ఎడ్గరును, కాన్యూట్ ప్రభువును, ము న్నగువారు. వీరిదౌరతనమున నింగ్లం డొక యొడయనికి లోఁబడి యుండెను.

నార్మనుదేశస్థు లింగ్లండునకు వచ్చి డేనుల నోడించి యింగ్లండు నాక్రమించుకొని యేలఁ దొడఁగిరి. వారిలో మిక్కిలిబలము కలవాఁడు విల్లియము. అతఁడు ఇంగ్లండురాజ్యము తనకు రావలయు నని గొప్పసేనను గూర్చుకొని యింగ్లండునకు నేతెంచి యందు రాజ్యము సేయుచుండినహారొల్డును జంపి యారాష్ట్రమును స్వాధీనము సేసికొని పాలింపసాగెను. ఈవిల్లియమువెనుక రెండవవిల్లియము, మొదటిహెన్రి, స్టీఫను అనువార లింగ్లండు నేలిరి. వీరిపాలనలో నింగ్లండు కొంచెముగ మంచిస్థితికి వచ్చెను.

మొదటిహెన్రి ప్రభువునకు మటిలాయందు జననము నొందినరెండవహెన్రి ఇంగ్లండునకు నేలిక అయ్యెను. అతని దొరతనమున నింగ్లండు కొంతవృద్ధికి వచ్చెను. అతనికి మొదటిరిచ్చర్డును జానునాతఁడు ననునిరువురు కొడుకు లుండిరి. కాని రిచ్చర్డునకు సంతతి లేనందున నాతనితమ్ముఁడు జాను రాజ్యమునకు వచ్చెను. ఇతనికాలమున నింగ్లండుజనుల కోరికప్రకారము దేశపురాజు దొరతనము సేయుటకు నారంభించెను. అనఁగా అప్పుడు రాజునకు కలనిరంకుశాధికారము ముగిసెను. జనులకు నీహక్కు ఇతనికి ముందు లేదు. జానుప్రభువునకు మూఁడవ హెన్రియు నాతనికి మొదటియెడ్వర్డును ఆయనకు రెండవ యెడ్వర్డును అతనికి మూఁడవయెడ్వర్డును బుట్టి యింగ్లండు నేలిరి.

మూఁడవయెడ్వర్డు ఇంగ్లండును ఏఁబదియేండ్లు పాలించెను. అతనికి రెండవరిచ్చర్డు పుట్టెను. ఈరిచ్చర్డు దేశము నిరువదిరెండేండ్లేలి మిక్కిలిదుష్టుఁ డైనందున నితనితమ్మునికొడుకు నాలవహెన్రి, వానిని జంపి యింగ్లండుదీవికి నధిపతి యాయెను. ఈహెన్రి లంకాస్ట్రియను వంశస్థులలో మొదటివాఁడు. అతఁ డింగ్లండునకు పదిరెండేండ్లేలెను. అతనియనంతరమున నైదవ హెన్రియు నాతనివెనుక నాఱవహెన్రియును రాజ్యమునకు వచ్చిరి. కాని నాలవయెడ్వర్డు ఆఱవహెన్రీని దఱిమి తాను రాజ్యము నాక్రమించుకొని ప్రభుత్వము సేయఁగడంగెను.

హేన్రి ఫ్రాన్సురాజ్యమునకు వెళ్లి యచ్చటఁ జాలినంతసేనను జేర్చుకొని యింగ్లండునకు వచ్చి నాలవయెడ్వర్డును బాఱఁదోలి సింహాసనమును బడసెను. అయిన నేమి? ఎడ్వర్డు రహస్యమున నాఱవహేన్రిని జంపించి తాను సింహాసనమును బొందెను. ఈయెడ్వర్డునకు నైదవయెడ్వర్డును, రిచ్చర్డును, అనుకుమారు లిద్ద ఱుండిరి. వారు వానివెనుక రాజ్యమునకు రానర్హులై యుండిరి. కాని వారు మిక్కిలి పసికూన లైనందున జనులు వారిపినతండ్రి యగుమూఁడవరిచ్చర్డును వారిమాఱుగ నింగ్లండును బాలింప నియమించిరి. అతఁడు మిగులక్రూరుఁడును, దురాశాబద్ధుఁడును, అయి యుండినందున నాచిఱుతలను జెఱసాలలో నుంచి యచ్చట రహస్యముగ వారిఁ జంపించెను. ఈ మూఁడవరిచ్చర్డు నోరులేనిపసికూనలను జంపించినందున,జనులు వానియెడఁ గోపము కలవారై వానిని ద్వేషించి యుండిరి. ఇంతలో నేడవహేన్రి మూఁడవరిచ్చర్డును యుద్ధంబున మట్టుపెట్టి తాను రాజ్యమును బొందెను.

ఈ యేడవహేన్రి ట్యూడరువంశస్థులలో మొదటివాఁడు. ఇతనికి నార్థరు, ఎనిమిదవహేన్రి, అను నిద్దఱు కుమారులును మార్గరెట్టు అనుకొమార్తయును బుట్టిరి. వారిలో నార్థరు స్వర్గస్థుఁ డయ్యె. ఎనిమిదవహేన్రి తన తండ్రివెనుకఁ దాను రాజ్యమునకు వచ్చెను. మార్గరెట్టు స్కాట్లండు భూస్వామి యగు నాలవజేమ్సును వివాహ మాడెను. ఎనిమిదియవ

హెన్రికాథరైను, అనిబొలియను, జేన్ సేమూరు, అను ముగ్వురు పూఁబోడులను వివాహమాడి వారియందు వరుసగ మేరి, ఎలిజబెత్తు, అను కోమారితలను, ఆఱవ యెడ్వర్డు అను కుమారుని బడసెను. వెనుక ఆఱవ యెడ్వర్డు ఇంగ్లండునకు నోడయఁ డయ్యె. అతనికి బిడ్డలు లేనందున నాతని తోఁబుట్టువులలోఁ బెద్ద దగుమేరి రాజ్యలక్ష్మిని జేఁబట్టెను. ఆవనిత నిరపరాధు లగుప్రాటస్టెంటుకైస్తవులఁజంపించినందున బహుక్రూరురా లని పేరు పొందెను. ఈయమకు పిమ్మట నెలిజబెత్తు ఇంగ్లండును బాలించెను. ఈరాణి పెండ్లియాడకయే పరలోకగతురా లయ్యె. ఈమెకాలమున నింగ్లండు మహోన్నత పదవికి వచ్చెను. ఇంగ్లండునుండి హిందూదేశమున వ్యాపారము సేసికొనుటకుఁ దూర్పిండియా వర్తకపుసంఘమునకు ననుజ్ఞ నిచ్చినది ఈ యెలిజబెత్తను రాణియే సుమీ! ట్యూడరువంశస్థు లీమెతో నంతమొందిరి.

ఎలిజబెత్తు వెనుక స్టూవర్టువంశస్థు లింగ్లండునకును స్కాట్లండునకును బ్రభువు లైరి. వారిలోఁ జేమ్సు ప్రథముఁడు. ఇతని యనంతరము మొదటి చార్లసు. జను లీతనిఁ జంపి, తామే రాజులేకుండ ఇంగ్లండును బాలించిరి. కాని వారిలో మేటి క్రాంవెల్. అతని వెనుక అంతగొప్ప శూరుఁడు లేనందున జనులు మొదటిచార్లెస్ పెద్దకుమారుని రెండవఛార్లెసును బిలిచి యీరాజ్యమును బాలింపు మని ప్రార్థించిరి. అతఁడు

వారి వేడుకోలునకు నియ్యకొని నెమ్మదిగ నింగ్లండును బాలింపఁ బూనెను. అతని యనంతర మాతని తమ్ముఁడు రెండవ జేమ్సు రాజ్యమును బాలించెను. అతనికి మేరి, యాని అను నిద్దఱు కుమార్తె లుండిరి. అతని పిమ్మట నా మేరి తనమేన యత్తకుమారుఁ డగుమూఁడవవిల్లియమును బెండ్లియాడెను. ఆయిద్దఱకు శిశువులు లేరు. "యాని" అను నాయమ యింగ్లండును బాలించెను. కాని ఆరాణికి సుతులు లేనందున మొదటి జేమ్సు మనుమరాలి కొడుకు మొదటిజార్జి యింగ్లండునకుఁ బ్రభువాయెను.

ఈ జార్జి హానోవరు వంశస్థులలో మొదటి వాఁడు. ఇతఁడు పదుమూఁడేండ్లు ఇంగ్లండును బాలించెను. ఇతని యనంతరము రెండవజార్జి రాజ్యమునకు వచ్చెను. ఇతని కాలమున హిందూదేశమున బంగాళారాజ్యమును క్లైవు 1757 సం.న జయించెను. ఆంగ్లేయ దొరతన మది మొదలుకొని హిందూదేశమున బాగుగఁ జెల్లుచు నున్నది. రెండవజార్జి వెనుక మూఁడవ జార్జి ఇంగ్లండునకు స్వామి యై యఱువదియేండ్లు రాజ్యము సేసి కీర్తిశేషుఁ డయ్యె. ఇతని కాలమున నాంగ్లేయులు అమెరికాలోని సంయుక్త రాష్ట్రములను (United States) గోలుపోయిరి; ఇంగ్లండువ్యాపారమును జేతివృత్తులలోను మేటి యయ్యె; అయిరోపాఖండంబున నెపోలియ నను బలపరాక్రమశేముషీమంతుండు వాటర్లూయుద్ధమున నోడెను. నాలవజార్జి రాజ్యమునకు వచ్చి

పదిసంవత్సరములుమాత్రము రాష్ట్రమును పాలించెను. అతని కాలమున నీటియావిరిబలమున నావలును, రైలు బండ్లును నడవఁ దొడంగెను. అతనికి బిడ్డలు లేరు. అతనితమ్ముఁడు నాలవ విల్లియము ఇంగ్లండునకు 1830 సం. న అధిపతి యాయెను. అతఁడు ఏడేండ్లు రాజ్య మేలెను. అతని దొరతనమున బానిస వర్తకము తుదముట్టెను. అతనికి కొడుకులుగాని కొమార్తెలు లుగాని లేనందున ఆతని తమ్మునికొమార్త యగు శ్రీవిక్టోరియా మహారాజ్ఞి పదునెనిమిదియవయేఁట రాజ్యమునకు వచ్చెను.



1837

## రెండవ అధ్యాయము.

### ఎడ్వర్డు పుట్టుక.

శ్రీ విక్టోరియా మహారాజ్ఞి కెంటురాజ్యముయొక్క ప్రభువునకు జన్మించె. ఈ కెంటుభూస్వామి భార్యయును, శ్రీ విక్టోరియారాణికిఁ దల్లియును అయినసాధ్వికి సాక్సుకోబర్గు గోతా (Saxe Coburg Gotha) అను రాజ్యమునకు నెడ యఁడు సమానోదరుఁడు, అతని రెండవకుమారుఁడు, ప్రిన్సు ఆల్బర్టనునాతఁడు తనకు మేనయత్తకొమార్త యగువిక్టోరియా మహారాణిని వివాహ మాడెను. విక్టోరియా తన మేనమామ కుమారుని వరియించి పెండ్లి చేసికొనె ననిభావము. ఇంగ్లం

డుజను లీయిద్దఱియందు నింగ్లండునకు నొడయఁడు విక్టోరియారాణి తొలిచూలా లైనపుడు పుట్టు నని మిక్కిలికోరిరి. కాని వారియభిలాష పరిపూర్తికాలేదు. విక్టోరియాఆల్బర్టును జేఁబట్టినకొలఁదినెలలకే గర్భవతియై ఆఁడుబిడ్డ నొకదానిం గనెను. విక్టోరియా మగబిడ్డను గను నని మిక్కిలి కాంక్షతో నెదురు చూచు చుండిన జనులు "తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును." అను లోకోక్తి నిజ మని డెందంబుల నమ్మి రెండవతడవ నాకాంత గర్భమైనపు డైనను పురుషశిశువు పుట్టఁడా యని యెదురు చూడసాగిరి.

పదునెనిమిదివందల నలువదియొకసంవత్సరంబున మేనెలలో విక్టోరియామహారాణి ద్వితీయగర్భమును ధరించె నని జను లుప్పొంగఁ గడంగిరి. కొందఱీ తడవయైనను మగబిడ్డ పుట్టఁడా అని తలఁచిరి. మఱికొందఱు "ఆఁడువారికి గర్భము వచ్చుట యొక గండము. పురుష శిశువైన నేమి? ఆఁడు బిడ్డైన నేమి? ఆఁడునిసువు చేదా? ఏమి? పురుషునిమోసినరీతి నాఁడు బిడ్డను దొమ్మిదినెలలు ఆసాధ్వి మోయలేదా? ఎవరైననేమి? ఆమహారాణికి సుఖప్రసవమై రెండుతలలు వేఱుపడి భూమిని జీవముతోనుండి మనల నేలుట యే కొఁడుకును గని నంతభాగ్యము." అనిరి. వెండియుఁ గొంద ఱా యమ్మ యాగండము తప్పించుకొని బ్రతుకుటయే తమ కేలనిరి. ఇట్లుల ననేకు లనేకభంగులఁ జెప్పుకొను చుండిరి.

ఇంతలో నామహారాణికిఁ దొమ్మిదినెలలు సంపూర్ణము లయ్యె. కాని ఆదేవేరి యిసుమంతయైనను శ్రమము నెందక నడుము బలిసి దేహము భారముతోనుండినను అటు నిటుఁ దిరుగాడుచు నే ఉండె. 1841-వ సంవత్సరమున నవంబరునెల 8-వ తేది నాఁ డాయిల్లాలు సంపూర్ణ గర్భభారమున బకింగ్ హాముసంతిపురవుటుద్యానవనమున నుదయంబునఁ గొంతకాలము నడిచెను; నాఁటి మధ్యాహ్నంబున నాయమ బండిలోఁ గొంతదూరము సికారి పోయెను. సాయంకాలమునఁ దనయింట నడిచినవిందు నారగించి, యచటికి విచ్చేసినవారితోఁ గొంత కాలము ముచ్చట లాడుకొను చుండి సుఖనిద్రఁ జెందెను.

ఇంతలోఁ గోడి కూసెను. తూర్పుదెసఁ జుక్క పొడమె. పిట్టలు చెట్టులతుదను కిలకిలా రవములు సేయఁ దొడంగెను. చీఁకటులు మూలమూలలఁ బరుగిడఁ జొచ్చెను. అరుణోదయ మయ్యె. ఉదయాద్రిని మిత్త్రుండు పొడమెను. వందిమాగధులు విక్టోరియారాణిని నిదురలేపుటకు గానము సేసిరి. ఆతరుణీ మణియును కొంచె మలసటతో లేచి భగవంతుని ధ్యానించి, యుదయకార్యముల నెరవేర్చి యప్పు డప్పుడు నడుము కళుకన్ని నొప్పి సూపినను దాని నంతగ గమనింపక వేదన లేని దాని కైవడి రోచకార్యములను విచారించు చుండెను. కాని రానురాను ఆబాధ మఱింత వృద్ధి చెందెను. ఆయిల్లాలు మిక్కిలి యోర్పుతో నావేదన ననుభవించు చుండెను. ఉదయ

మున నెనిమిదిగంటల కాగృహిణి ప్రసవవేదన చెందుచుండె నని ఆసాధ్వి తల్లిగారికిని, ఇంకను రాజబంధువులకును, మంత్రులకును, సేనానాయకులకును, కాంటెబర్బెరి ఆర్చిబిషపు, లండను బిషపు, మున్నగువారికి వార్త వెళ్లెను.

ఈ శుభవార్త లండను పురమంతట నల్లుకొనెను. మహారాణి బకింగుహాముమందిరంబున నొప్పులు పొందుచుండెను. ఒకొరొకరుగ నలుగడలనుండి పెక్కురు వచ్చుచుండిరి. రాణి గృహకృత్యముల విచారించుప్రభువు, మొదట వచ్చెను. ఆపలం బ్రధానమంత్రి సర్ రాబర్టుపీలును, రాణితల్లియును, లండనుబిషపును, డ్యూక్ ఆఫ్ వెలింగ్టను మున్నగుదొడ్డవారేతెంచిరి. రాణి భర్త ప్రిన్సు ఆల్బర్టును, డాక్టరులాకాక్కును, దాది లిల్లియును, రాణి కొడుకును గనినకాలంబున నాయమ దగ్గఱ నుండిరి. అచ్చట గుంపు చేరిన నాయమబాధ మఱింత హెచ్చు నని తలంచి ఆల్బర్టు రాచకుమారుం డేరిని జేర నియ్యక రాణిసమీపంబున నుండె. 1841 - వ సంవత్సరమున నవంబరు నెల 9-వ తేదిని ఉదయమునం బదునొకండుగంటలగుటకుం బండ్రెండు నిమిషములకు ముందు రాణి శుభలగ్నంబున మగ శిశువును గనెను. అప్పుడు రాణి తల్లి పురుటి గదికిం బ్రక్కగొట్టున నుండెను. పురిటిగదికి నెదుట నుండుగదిలో వైద్యులనేకులు రాణిగారికి మందు లొసంగుటకు సర్వసిద్ధులై యుండిరి. ప్రధానులును, సేనానాయకులును, మతగురువర్యులును, ము

న్నగువారు క్రిక్కిఱిసి గుంపులు చేరి యుండిరి. రాణికి పురుష శిశువు పుట్టఁగానే, డాక్టరు లాకాకు సర్ జేమ్సు క్లార్కుతో నామేలిమాట నెఱుకపఱిచెను. అతఁడు మంత్రులకు నా శుభ వార్త తెలియఁజేసెను. వా రందఱు నానందాబ్ధిని మునిఁగిరి. దాది రాణిగారితల్లికి నాశిశువును జూపెను. ఆవల నా మంత్ర సానిబిడ్డను దనకేలను గొని ప్రిన్సు ఆల్బర్టు నను జ్ఞను గైకొని యచ్చట గుమి కూడిన గొప్పవారందఱకు నా బిడ్డను జూపెను. అందఱును ఆ రాచబిడ్డను గాంచి తమకుఁ బ్రభువు పుట్టె గదా యని మనంబున సంతోషించిరి.

మంత్రు లింతలో నాశుభవార్తను లండనుపురి గలయఁ జల్లిరి. ఆయుధ శాలలయందలి పిరంగులు ఇంగ్లండునకు నొడ యఁడు పుట్టె నని తెల్పెను. గుడులలో వ్రేలాడుగంటలు మ్రోగె. కోటలపైఁ బతాకలు, తల లెత్తియాడసాగెను. బకింగుహాము భవనము చుట్టు ననేకులు గుంపులుగూడి రాణికి మగశిశువు పుట్టెనని పలుకుచుండిరి. వేయేల? నాఁ డాపురవరంబున "ఓసి అక్క! మనరాణి చిన్న మగనిసువును గన్నఁదఁట? పోయి చూతము రారమ్మ." అనునారీమణులును, "ఓయి! నేఁడు మనతోఁ గూడి యాడుటకు రాణికి నొకపురుష శిసువుపుట్టెనాఁ డేఁట! వానితో మనము గోలీలు బొంగరములు బాగుగ నాడుకొనవచ్చునోయి? ఆబిడ్డను చూచి వత్తము. రండి." అని పలికికొనుబాలకులును, "ఎన్నాళ్ల కెన్నాళ్లకు

ఇంగ్లండు రాణికిఁ గొడుకుపుట్టుట? మన కేమికొఱఁత? దేవుఁడా బిడ్డకుఁ జిరాయు వ్రసంగి రక్షించుఁగాత !" అనునట్టి జనంబు లనేకు లుండిరి.

లండను నగర మింతకుఁ బూర్వము నిదుర పోవుచుండినరీతి నుండెను. ఇంద్రజాలమహిమచే నాపురవరము కనురెప్ప పాటుకాలములో నిదుర మేలు కొనినటులఁ గనుపట్టె. క్షణకాలములో శ్రీవిక్టోరియా కొడుకుఁ గనె నను శుభవార్త పట్టణము కలయ నల్లుకొనెను. ఉద్యానవనములయందలి సేనలును, గోపురశిఖరము లందలి పరివారమును పిరంగులను గాల్చిరి. కోటబురుజులపైఁ బతాకలు వెలుంగఁ దొడంగెను. క్రైస్తవ దేవాలయములలో గంటల మ్రోఁత నింగిముట్టఁ జెలంగెను. పురమునందలి ప్రజలు శ్రీమంతులును, బీదలును, పెద్దలును, చిన్నలును, వేనవేలమంది గుంపులుగూడి బకింగుహాముభవనము చుట్టుఁ జేరి బాలరాజబింబమును గనులార వీక్షింపఁ గౌతూహలాయత్తచిత్తులై యుండిరి. వారు బకింగుహాము నగరునకు నెదుట,

"శ్రీరాణిగారు నేఁటియుదయమునఁ బదిగింటలపైని నలువదియొనిమదినిమిషము 'లప్పు డొకరాకొమరునిఁ గనిరి. శ్రీ రాణిగారును రాచబిడ్డఁడును మంచియారోగ్యస్థితి నున్నారు.

"జేమ్సుక్లార్కు, యం. డి.

"చార్లస్ లాకాక్, యం. డి.

"రాబర్ట్ ఫెర్గూసన్, యం. డి.
"రిచర్డ్ బాల్డన్.
"బకింగుహాముసౌధము.

1851 సం. ము. నవంబరునెల తే 9 ది మంగళవారము ఉదయము పదునొకండునరగంటలు."

అని పెద్దయక్షరములు వ్రాసిన ప్రకటన పత్త్రికను గాంచి రాచకూనను జూడ వీలు లేనందునఁ దమతమపొందు పట్లకు వెళ్లిరి.

ప్రీవికౌన్సిలు సభాసభ్యులు శ్రీరాణిగారు బాలెంతయై యుండుటచే నాదేవేరిప్రాణనాథుఁడు "ఆల్బర్టు" ప్రభువుయొక్కయాజమాన్యమునఁ గూడి, శ్రీవిక్టోరియారాణిగారు సుఖప్రసవమైనందులకు భగవంతునకు గృతజ్ఞతాపూర్వకవందనముల నర్పింపవలయు ననియు నానందనములు కలవచనములు శ్రీకాంటెర్బెరి ఆర్చిబిషపు వ్రాయవలయు ననియును, 1841 సం. నవంబరునెల తే 14 ది ఆదివారమున నింగ్లండులోఁ గ్రైస్తవదేవాలయము లన్నింటియందును ఆయాగుడులయధికారులు తమతమ గుడులలో నావాక్యావళినిఁ బఠింపవలయు ననియుఁ దీర్మానించిరి. కాంటెర్బెరి ఆర్చిబిషపు ఇట్టులఁ బలికెను.

"భూతదయాత్మస్వరూపుఁడైన ఓ దేవా! మాతండ్రీ! నీదయవలన లోకమున జనులు వృద్ధి యగుచున్నారు. కరుణామృతము లొలుకునీకటాక్షవీక్షణములచే స్త్రీలకుఁ బ్రసవసమ

యమునఁ బొరయునాపదనుండి శ్రీరాణిని గాపాడి యాదేవి కడుపున నొకపుత్త్రుఁడు పుట్టునటుల దయచేసి మమ్మిఁక నేలు జనిని మాకునందఁ జేసితివి. ఇంతవఱకు నాదేవిని రక్షించిన భంగి నింకపై నారాణిని గాపాడుదు వని మేము నిన్నుఁ బ్రార్థించు చున్నాము. ఆదేవేరికి బలము లేనివేళ మంచిసత్తువ నొసంగి సౌఖ్య మొదవఁ జేయుము. ఇప్పుడు మారాచబిడ్డనియాత్మనుఁ గాని శరీరమునకుఁగాని కీడుపొరయకుండునటులఁ గాపాడుము. ఆబాలుఁడు పెరుఁగను బెరుఁగను సుజ్ఞానము పొదలఁ జేయుము. ఈప్రాటస్టెంటుమతాచారములను, మాదేశస్థులను, ప్రపంచమును, గాపాడునీవు నీమేలిగొనములు గలవానిఁగ నారాచబిడ్డని నొనర్పుము. మిక్కిలి ప్రేమతో మారాణిని, ఆయమ కాంతుఁ డగునాల్బర్టుప్రభువును, ప్రాపంచికసౌఖ్యముల నన్నిటిని నిరంతరాయముగ ననుభవించు నటుల దయచేసి, నిష్కళంక మైనదియును, అచలమైనదియును, అయిన కీర్తికౌముదిని వారిద్దఱు పొందునటుల ననుగ్రహింపుము. నీ హృదయమునందలి కరుణామృతము, నీ ప్రజలచిత్తంబునఁ బ్రవహింపఁ జేయుము; ఏవేళ విడువక నీయాజ్ఞలను నిర్వర్తింపఁ జేయుటకును, మే మందఱమును సోదరభావముతో మెలఁగుటకును, మారాజును నిండుప్రేముడిని గౌరవించుటకును, మాకు ననుజ్ఞనిమ్ము. నీ విటుల మాకు దయచేసి కలుగఁజేసిన నీ యాజ్ఞలను నీ యెడ భయభక్తులతో శిరసావహించి చేయు,

మాపుట్టువు సాఫల్యము నొందును. మాప్రభు వైనయేసునాథుని సాయమున మీపాదసేవకుఁ డుట్టతుదను మేము రాఁగలము. తథాస్తు" ఈభావగర్భిత మైనవాక్యముల సారాంశము శీఘ్రము ననే ఫలించెను. రాణియును, శిశువును,ఆరోగ్యవంతులై దినదిన మున వర్ధిల్లుచుండిరి. నాఁటి సాయంసమయమున గుడులలోను, రాజవీథులయందును, లెక్కకు మిక్కిలి యైనదీపములు వెలుంగ సాగెను.జనులు రాత్రియంతయు నిదుర వోవక వీథులలో గ్రుమ్మరుచుండిరి. ఎక్కడఁజూచిన గుంపు.ఎవ్వరు మాట్లాడినను రాణి బిడ్డనివృత్తాంతమే. కాని వేఱొండుసంగతియే లేదు. నాటక శాలలయందు నాట్యమునాడువారు "భగవంతుఁడు రాణిని రక్షించుఁగాత!" అని పాడిరి. లండనుపురిపౌరులందఱును నాఁటిరాత్రి రాకొమారుఁ డారోగ్యవంతుఁడై దేవుని కృపవలన బ్రతుకుం గాక అని కోరిరి.

మఱునాఁ డుదయమున లండనుటైమ్సు పంచ్ మొద లగువార్తాపత్రికలు రాణి చిన్నకుమారుని బలువిధముల దీవించెను.

శ్రీవిక్టోరియా మహారాజ్ఞికి పుత్త్రుఁడు పుట్టె ననుశుభ వార్త యనేకరాజ్యములకు నేఁగెను. అందలి జనులు దమ యనురాగమును భక్తివిశ్వాసములను దెలుపుచు రాచబిడ్డఁడు చిరంజీవియై మంచిమనుగడఁ గనవలయు నని కోరుచుఁ దమయా నందమును పలురీతుల వెలిఁ బుచ్చిరి.

శ్రీవిక్టోరియా మహారాజ్ఞికిలోఁబడిన రాజ్యములయం దెల్లయెడల సుమంగలులు రాణిబిడ్డని "చిరంజీవ" అని మంగళంబులఁ బాడిరి. శ్రీరాణికి సీమంతపుత్త్రుఁడు పుట్టెనని సెయింటుజార్జిచేపలున జననమరణలేఖలు పుస్తకమున దాఖలు చేయఁబడెను.

ఇంగ్లండురాజు పెద్దకొడుకును కారన్వాలుప్రభు వనియును(Duke of Cornwall) రోత్సేరాజ్యమునకు నొడయఁడనియును (Duke of Rothesay) కారిక్ప్రభు వనియును (Earl of Carrick) మొదలగుబిరుదు లలంకరించెను. కాని * "ప్రిన్సాఫ్వేల్సు" అనుబిరుదు నాతఁడు తాను పుట్టిననెలదినము లైనపిదపఁ బొందెను.

రాణియును మంత్రులును మొదలగుగొప్పవారు తొలినెలయంతయును రాచబిడ్డని కారన్వాల్ ప్రభు వని పేర్కొనసాగిరి. ఆకూన పెద్దవెన్నముద్దవలె దినదిన ప్రవర్ధమానయగు చుండెను. శ్రీరాణియును రాకూనయును రానురాను

---

* మొదట ఎడ్వర్డు 1282-వ సంవత్సరమున ఇంగ్లండునఁ జేరని "వేల్సు" రాజ్యభాగమును గెలిచి స్వాధీనము సేసికొని, తమకు రాజు లేఁడని వగచు చుండిన వేల్సుజనులకు, "నా పెద్దకొడుకు ఎడ్వర్డు మీ దేశపు రాచబిడ్డఁడు." అని చెప్పఁగా వారు రెండవయెడ్వర్డును "ప్రిన్సుఆఫ్ వేల్సు" అని పేర్కొనిరి. అనఁగా వేల్సు రాజ్యముయొక్క రాచకొమారుఁడు. అది మొదలు ఇంగ్లండు నేలు నేని పెద్దకొడుకుమాత్రము "ప్రిన్సుఆఫ్ వేల్సు" అని చెప్పఁబడుచుండును.

ఆరోగ్యవంతు లగుచుండిరి.

ఎడ్వర్డు "ప్రిన్స్ ఆఫ్ వేల్సు" అనుబిరుదు నొందుట.

లండనుపురము జనబాహుళ్యముచే ననారోగ్యకర మైన దని వైద్యులు సెప్పినందున శ్రీ విక్టోరియారాయును, భర్తయగు నాల్బర్టుప్రభువును, తమ బిడ్డలను వెంట నిడుకొని మిక్కిలి యారోగ్యప్రదేశ మైనవింజిరునగరున నివసింప 1841 సం. న డిసంబరు నెల 6 వ తేదిని వెళ్లిరి. అచ్చటఁ దల్లియును, శిశువులును, క్రమముగ నారోగ్యవంతు లైరి. ఆతావునకు నేతెంచినరెండవదినమున ననేకసామంతప్రభువులయెదుట, శ్రీ విక్టోరియామహారాజ్ఞి తనసీమంతపుత్త్రునకు "ప్రిన్స్ ఆఫ్ వేల్సు" అను బిరుదు నొసంగె. మొదటి ఎడ్వర్డు ఇంగ్లండును పాలించె. అతఁడు "వేల్సు" అనురాజ్యభాగమును జయించి, తనరాజ్యముతో దానిఁ జేర్చుకొని, ఇంగ్లండు ఱేనికిఁబుట్టు పెద్దకుమారుఁడు "వేల్సు రాజ్యభాగమునకు యువరాజు," అయి యుండు నని శాసించె. ఆయనచట్ట ప్రకార మప్పటినుంచి యిప్పటివఱకు నా యువరాజపదము ఇంగ్లండురాజు జ్యేష్ఠపుత్త్రునకు లభించు చున్నది. ఇప్పుడు నడేవిధమున నెడ్వర్డు 1841 సం. న డిసంబరు నెల8 వ తేదిని వేల్సు రాజ్యభాగమునకు యౌవనరాజ్యపట్ట భద్రుఁడయ్యె.

శ్రీ యెడ్వర్డునకు జ్ఞానస్నానము జరుగుట.

1842 సంవత్సరమున ఎడ్వర్డునకు జ్ఞానస్నానము జరు

గవలసి యుండెను. అతని తల్లితండ్రులును, ప్రధానవర్గంబులును, కాంటెర్బెరి ఆర్చిబిషప్ మున్నగుమతాచార్యులును, మొదలగుగొప్పవారు చేరి జనవరి నెల 25 వ తేది మంగళవారమున ఎడ్వర్డునకు జ్ఞానస్నానము జరుగ వలయు నని నిశ్చయించిరి. వా రామహోత్సవము వేడుకను మిగుల వైభవమున నొనర్పవలయు నని కోరిరి. రాణిగారును, ఆయమప్రాణమిత్రుఁడగునాల్బర్టు దొరగారును, ఎడ్వర్డునకు జ్ఞానస్నానమును నామకరణమును, ముందు రాచబిడ్డలకు రాజాంతఃపురమందిరంబున జరుగునటులగాక సర్వసాధారణముగ నందఱుబిడ్డలకును జ్ఞానస్నానము నడుచువిధంబున దేవాలయంబున నడుపవలసినదని తీర్పు సేసి, తమతీర్పును మంత్రులకు నెఱుకపఱిచిరి. వారును కాంటెర్బెరి ఆర్చిబిషపుతో నాలోచించి రాణిగారి మాట యుక్తియుక్తముగ నున్న దని యెంచి యాదేవి మనోభీష్టప్రకారము వర్తింప నిశ్చయించుకొనిరి.

రాణిగారు ఆమహోత్సవమును జూచుటకు రమ్మని అయిరోపాలోని దొరలకు పలుజాబులు వ్రాయించెను. ఇంగ్లండునందలి జనులు దమరాణి ముద్దు నిసువునకు నామకరణము జరుగు నని కౌతూహలు లై బాలరాజబింబమును దర్శింప నువ్విళ్లూరు చుండిరి. విదేశములనుండి భూపాలకు లనేకు లింగ్లండునకు విచ్చేసిరి. వారివారి పదవులకుఁ దగినరీతిని విడిదులమరి యుండెను. రాణిగారును ఆయనుభర్తయును తమయిం

టికి వచ్చినయతిథులకు స్వాగతం బొసంగి, వారిని పలుతెఱం గుల గారవించిరి. ఆ భూధవులలో జర్మనిచక్రవర్తి పరమ ముఖ్యుండు. ఆయన రాణికుమారునకు నామకరణము సేయ నియమితుఁడై యుండె.

1842 సంవత్సరము జనవరి నెల 25 వ తేదిని లండనున గరవరముసౌభాగ్య గరిమ నెంతని వర్ణింప నగు? నాఁడెచ్చటఁ జూచినను జను లనేకులు గూడి "నేఁడు రాణి పుత్త్రునకు నామకరణ మఁట. రాజులును, రాణులును, రాజబంధువులును ప్రధానులును మున్నగువారు మిగుల వైభవంబున నశ్వంబులఁ బూన్చిన శకటంబులపై లండనుపుర వీథుల నూరేఁగుదు రఁట! అతిమనోజ్ఞమైనచూపు. ఆహా! నేఁడుగదా మనము నోచిన నోము లన్నియు సఫలము లగుట" అని గుజగుజలు సల్పు చుండిరి. లండనుపురి వీథు లతిరమణీయంబుగ నలంకృతంబై యుండె. నానావిధములైనపచ్చనితోరణములు రాజ ద్వారంబులఁ గట్టఁబడెను. పౌరులు తామనేకరీతుల సిం గారించుకొని మేడలపై రాజపరివారమును జూడ నిలుచుం డిరి. వీథులకు నిరువైపుల ననేకులు నిలిచి యుండిరి. మఱికొందఱు ప్రాకారంబుల నెక్కి వానిమీఁదఁ గూర్చుండిరి. ఇంకఁ గొందఱు వృక్షశాఖాగ్రంబుల నెక్కి, వారందఱు బాలరాజవదనమును జూడ మిక్కిలికోరినవారై రాజాం తఃపురము చాయ నే దృష్టి సారించి చూచు చుండిరి.

రాణికుమారునకు నామకరణము నాఁడు మధ్యాహ్నమున ఒకఘంటకు నడువవలసి యుండెను. సెయింట్ జార్జి చేపలు భవన మతిరమ్యంబై యలంకరింపఁబడి యుండెను. కాంటెర్బెరి ఆర్చిబిషప్ ముందు నందుఁ బ్రవేశించి తన పీఠము నలంకరించి యుండె. అతని వెంబడించి మతగురువు లనేకులు విచ్చేసి వారివారికి నేర్పఱిచినయాసనములపైఁ గూర్చుండిరి. విదేశ రాజులును, చక్రవర్తులును, రాణితల్లిగారును, మున్నగువారు వరుసగఁ జనుదెంచిరి. అవలఁ బ్రష్యారాజు విల్లియము ఏతెంచెను. అతనివెనుక రాణియును, ఆమె భర్తయును, బిడ్డఁ దమ నొడి నిడుకొని సెయింట్ జార్జి చేపలు గుడికి నరుదెంచిరి. వారును దమయాసనముల నలంకరించిరి.

సెయింటు జేమ్సు చేపలు నిశ్శబ్దంబుగి నుండె. కాంటెర్బెరి ఆర్చిబిషపు లేచెను. అతని హస్తపల్లవంబున రాణిదాదిరాకొమారు నునిచెను. ఆ మతగురువు ప్రష్యాచక్రవర్తిని బిలిచి చిఱుతని పేరు వచింపు మని వేఁడెను. ఆ పుడమిఱేఁడు "ఆల్బర్టు ఎడ్వర్డు" అని గంభీరస్వనంబున స్పష్టముగ నందఱయెదుటఁ బలికెను. మతాచార్యుఁ డంత "ఆల్బర్టు ఎడ్వర్డునకు జ్ఞానస్నానము నాచరించు చున్నాను." అని తన యెదుట నుండినబంగరు కలశంబుల జలమును రాకొమరుని మోమునెలపైఁ బ్రోక్షించెను. మంగళస్వనములు నింగిముట్టఁ జెలఁగె. పిరంగులు సేనలసంతోషమును దెలుపుచుండె ననురీతిని గుభా

ల్‌గుభాల్ అని మ్రోగెను. గుడులలో ఘంటలు వాఁగెను. అనేకులు పెక్కురీతులఁ జప్పట్లు తట్టి, తమ సంతోషమును తెల్పిరి. మతగురు పీఠెఱుంగున రాకొమారునకు జ్ఞానస్నాన మాచరించెను. నాఁటి సాయంకాలమున విదేశములయం దుండి విచ్చేసిన రాజబంధువులును, రాణీమంత్రులును, మతాచార్యులును, మొదలగువారు రాణిగారు చేసినవిందు నారగించి, తమతమ వీడులకు వేంచేసిరి.

### ఎడ్వర్డును లేడి లిటిల్టన్ పెంచుట.

ఎచ్చటనైనను శ్రీమంతులలో లేక లేక పుత్త్రుఁడు పుట్టి పుట్టకముందే వాని తల్లిదండ్రులు వానికిఁ బలుపలుకుల నేర్పుటకుఁ గోరుచుందురు. శ్రీమహాచక్రవర్తిని బిడ్డని విద్యావిషయమై వేఱుగ వచింపవలయునా? శ్రీరాణిగారును, ఆయమభర్తయును, తమసీమంతపుత్త్రుఁ బెంచుటకును, అతనికిఁ దగినవిద్యాబుద్ధులను గఱపుటకు నన్నులైనయుపాధ్యాయుని వెదకుటకు నారంభించిరి. రాణి రాచకార్యము లొనర్పవలసి యుండె. ఆ యిల్లాలు దనబిడ్డలను బెంచుటకుఁ జాలినంత కాలము లేదు. పుట్టినబిడ్డఁడు సామాన్యులకుఁ బుట్ట లేదు. అతఁడు ప్రపంచములోఁ బంచమాంశమునకు నేలికయగునట్టివాఁడు. అట్టివాఁడు దుష్టులపొత్తునఁ జేరక, మెలఁకువఁ బెరుఁగవలసి యుండె. ఆంగ్లేయదేశాచారవ్యవహారము లాతఁడు బాగుగ నెఱుంగవలసియుండె. వారి మతస్వభావ

మిట్టి దని ఆతఁడు నేర్వవలసియుండె. ఇంతియకాదు. అతఁడు రాజనీతియును, సమస్తశాస్త్రములను, నౌకాశాస్త్రమును, విలువిద్యయును, ఎఱుఁగవలసియుండె. ఇన్ని శాస్త్రములు, దెలిసినపండితుఁడు రాణికి లభించునా? లోకములో నిన్నియు నొక్కనికిఁ దెలియునా? ఆఱునెలలబాలుఁ డిన్నివిద్యల నేర్చుకొనఁ గలఁడా? రాణిగా రివన్నియు దీర్ఘముగ భర్తతోను మంత్రులలోఁ బ్రధానుఁ డైనమెల్బోర్న్ ప్రభువుతోను, తన నాథునకు నంతరంగ మిత్రుఁ డైనస్టాకుమరుతోను, బాగుగ నాలోచించి, రాకొమరుఁ డైదేండ్లవాఁ డగుదాఁక వానిని బెంచుటకు మంచితెలివితేటలు కలదానిని నియమించుట లెస్స అని తీర్పుచేసె. అనేకు లాయుద్యోగమునకు దరఖాస్తులను బంపిరి. కాని వారిలో లిటల్టన్ ప్రభువు భార్యామణియును, రెండవ స్పెన్సర్ ప్రభువు పుత్రికయును, అయిన "లేడి లిటిల్టన్" అను చేడియను తన బిడ్డలను సాకుటకు విక్టోరియా మహారాణి తనహృదయేశు సమ్మతిని బొంది నియమించెను.

1842 సం. న ఏప్రెలు నెలలో నారాచబోట్టెఁ బెంచుటకు నాలిట్టిల్టను దాదిగ నమర్చి, ఆహోదాలోఁ దొమ్మిదేండ్లుండి, 1852 సం న ఈ యుద్యోగమును వదిలి, 1870 సం. న దీర్ఘనిద్రఁ జెందె. ఈ తొమ్మిదేండ్లలో నానారీమణి రాణిగారి బిడ్డలను పోకిరుల డాయం బోనీక మిగుల జాగరూకతతో వారిని సాకి,

శ్రీవిక్టోరియాఆల్బర్టుల మనస్సు కెక్కునటుల వర్తించి, వారి మెప్పు వడసెను. ఆచిఱుతలును, ఆముసలిది తమ్మువదలి వెళ్లు టను ఒల్లక కన్నీరు వరదలై ప్రవహింప నేడ్చిరి. కానిఆవృద్ధు రాలు వార్ధకదశలోఁ బాటుపడ లేక విశ్రాంతి వొందఁ గోరి, రాచబిడ్డలకు దాదియై ఉంట మానుకొనెను.

సారవంత మగునేల సదా మంచిపంట నిచ్చుచుండును. లోకములో మంచి దంపతు లని ఏయాలుమగలఁ జెప్పవచ్చు ను? గృహస్థునకుఁ దగినయిల్లాలును, ఇల్లాలికిఁ దగిన గృహస్థుఁడును, చేరి, యన్యోన్యప్రీతిని మెలఁగి యేఁటేఁటఁ గాక పోయినను రెండేండ్ల కొకతడవయైన నొక బిడ్డను గనుచుఁ గన్నబిడ్డలు సురక్షితముగఁ జిరాయువులై యుంటఁ గాంచి సంతసించుచు నుందు రేని వారి దాంపత్య మన్ని విధములఁ బాగ డఁదగినది. ద్రవ్యమున్న నేమి? లేకున్న నేమి? ద్రవ్యము శా శ్వతమా? బీదఱికము శాశ్వతమా? మనమెప్పటికిఁ జిరజీవు లమై యుండువారమా? బీద సంసార మైనను లే దని మగని నల యింపక అతఁడు దెచ్చినదానిని గుట్టుగ నంబలిగనో సంకటిగనో కాఁచి చేసి వానికి నిడి తాను కుడిచి బిడ్డలను గనుచు మనుగడఁ గాంచునదియే మంచి యిల్లాలు.

విక్టోరియా రాజ్ఞి భర్తయగునాల్బర్టును పరదేశమునుండి తనయింటిలోఁ గడుపుకూటికై యిల్లంట్రముండఁ జనుదెంచిన మగనికైనడిఁ దలఁపక ఆప్రభువుఁ బ్రేమించి ఆయనమనోరథ

ప్రకారము తా నేవేళ వర్తించుచు నాతనిసుఖ మే తనసుఖ మని తలంచి, మిక్కిలి కూర్మితో నాతనియెడఁ బ్రవర్తించు చుండెను. 1843 సం. న విక్టోరియామహారాజ్ఞి క్రమ్మఱ గర్భవతి యై యేప్రెలు నెలలో నొక యాఁడుబిడ్డను గనెను. ఆమెపేరు ప్రిన్సెస్ అల్లైస్. రాణి పెద్దకూఁతురును, పెద్ద కొడుకును, లిటిల్టన్ దొరసాని స్వాధీనమున "విండజరు" గ్రామంబుననుండిరి. కాని యా రాజదంపతులు తమ ప్రియశిశువులఁ జూడక యుండ నొల్లక విండజరులో నుండినకూఁతుఁ గొడుకుఁ బిలువ నంప వారును లిటిల్టన్ దొరసాని వెంటఁ దమతల్లికడకు నేతెంచిరి. ఆమహారాణి రాచకార్యము లెన్ని యుండినను, లిటిల్టన్దాది యెంత గారాబముతో దననిసువులఁ బెంచు చుండినను, తాను స్వయముగ వారిని విచారింపక యుండిన దెప్పుడును లేదు. ఆదేవేరి తనభర్తతో రాచకార్యముల నిర్వర్తించుకొనుచుఁ దనబిడ్డల యాటపాటలను గాంచి యానందసౌఖ్యంబులఁ బొరయుచు నుండెను.

లండను నగరమున నావిక్టోరియా మహారాణి భర్తతోను తనబిడ్డలతోను కాలము సుఖముగ గడుపు చుండెను. 1844సం. న ఆల్బర్టుప్రభువు తండ్రిపరలోకగతుఁ డయ్యె. రాణితండ్రిమరణమున కై వగచెడితనప్రాణసఖుని ఊరడించి యతని దుఃఖము శాంతిల్లఁ జేసెను. అప్పు డప్పు డనేక రాజ్యముల యందుండి హాస్యగాండ్రును, నర్తకులును, పాటకులును పెక్కు

మంది రాణి యాస్థానమంటపంబునకు వచ్చివారివారి విద్యలను రాణికిని, ఆయమబిడ్డలకును, కనఁబఱిచి, వారి నానందాబ్ధిని నోలలాడించి, వారివలన బహువిధభూషణంబులఁ బొంది తమ తమ పొందుపట్లకు నేఁగు చుండిరి. ఉన్నట్టుండి యాయేఁట రుష్యాచక్రవర్తి నికలసు హా సనునాతఁడు లండనుపురికి నేతెంచెను. శ్రీరాణియును మంత్రులును ఆయనను బహుభంగుల గౌరవించిరి. ఆ పుడమిదొరయును రాణి నిసువులఁ గాంచి, వారి నెత్తుకొని, ముద్దాడి, అచ్చటఁ గొన్నిదినము లుండి పిదపఁ దనరాజ్యమునకుమఱలెను. 1844సం. న ఆగస్టు నెలలో శ్రీమహారాణి రెండవకొమారుఁ గనెను. జనులు రాణికి నాల్గుమందిబిడ్డలు దైవకృపాకటాక్షంబునఁ బుట్టి వర్ధిల్లుచుండి రని ప్రమోదభరితచిత్తులైరి. రాణియును భర్తయును ఆ పుట్టిన రాకొమారునకు "ఆల్బర్టుఅర్నెస్టు" అని పేరు పెట్టిరి. ఆబిడ్డఁడును దినదిన ప్రవర్ధమానుఁడగుచుండెను. రాణియును ఆయమహృదయేశ్వరుఁడును బిడ్డలును కొన్నిదినములు లండనునగరమునను, విండరు మందిరంబునను, మఱికొన్నిరోజులు ఆస్బోర ననునంతఃపురమునను మొదలగుచోటుల విశ్రాంతిఁ జెందుచు నుండిరి.

1846 సం. న శ్రీమహారాణి మఱియొక యాఁడుశిశువును గనెను. దానిపేరు హెలీ. ఆనలనెడ్వర్డు తన తల్లిదండ్రులతోఁ బడవలోఁ గారక్ వాలునకు నేఁగెను. అచ్చట ప్రజలు వానిని జూచి సంతసించిరి. రాణివెంట నతఁడు తిరిగి తనవీటికి నరు

దెంచి, యింటఁ గొన్నిరోజు లుండెను. ఆతని తల్లిదండ్రులు తమబిడ్డల నెచ్చటికిఁ బంపక, తమకడ నే ఉంచుకొని, వారిని గాంచి, తత్సుఖము పొందుచుండిరి.

1847 సం. న ఆగస్టునెలలో శ్రీ విక్టోరియారాణి భర్తృసమేతయై, పెద్దకొడుకును, పెద్దకూఁతును వెంట నిడుకొని స్కాట్లండుదేశమునకు వెళ్లెను. ఎడ్వర్డురాక స్కాచు జనులకు నానందదాయకమై యుండెను. వా రాతనిఁ జూడఁ గోరుచుండిరి. రాణియును, ఆదేవేరిప్రాణసఖుఁడును, బిడ్డలను, మిల్ఫోర్డుహావన్ రేవునఁ జేరఁగనే, అచ్చటి జనులు పెక్కుమంది ఎడ్వర్డును వీక్షింప గుంపులుగూడి వచ్చిరి. రాణి తనకొడుకులను వారికిఁ జూపెను. అచ్చటనుండి ఇంగ్లండు నేలిక శిశువులతోడను ప్రాణేశుతోడను స్కాట్లండు పశ్చిమ ప్రదేశమంతయుఁ గ్రుమ్మరి యచ్చట వినోదంబులం జూచి ప్రమోదభరితచిత్తయై తనయింటికిఁ జనుదెంచెను. 1848 సం. న రాణి వేఱొకయాఁడుశిశువును గనెను. దానికి ప్రిన్సులూయి అనుపేరు.

ఎడ్వర్డు విద్యను నేర్వ ప్రారంభించుట.

ఎడ్వర్డునకు నైదేండ్లు నిండెను. ఆతని తల్లితండ్రులు నా బాలునకుఁ జదువు నేర్పవలయు నని నిష్కర్షిచేసిరి. కాని యెట్టి విద్య నా బాలునకు గఱపవలయునో వారికిఁ దెలియక కొంత కాలము వారు తహతహపడు చుండిరి. ఇంతలో బారన్ స్టాకు మరును, ఆక్సుఫోర్డుబిషపును, జేమ్సుక్లార్కును మొదలతో నా

రాజదంపతు లాలోచించి, వారుచెప్పినపద్ధతులఁ దమతనయు నకు సకలవిద్యలను నేర్ప సమర్థుఁడగుపండితుని హెన్రిబెర్చి అను నుపాధ్యాయుని నియమించిరి. అతఁడు నీతికోవిదుఁడు అతఁడు ఎడ్వర్డునకు సకలశాస్త్రంబుల నేర్ప సమర్థుఁడు. ఎడ్వర్డాయు పాధ్యాయుని వలనఁ జదువు నేర్వ నారంభించెను.

రాణియును ఆయమహారాజహృదయేశుండును ప్రధానులును మున్నగు దొడ్డవారు ఎడ్వర్డు చిత్తరువులు వ్రాయుటను, గాన కళను, అస్త్రవిద్యను, ఈవిద్య ఆవిద్య అని లేక సమస్త విద్య లను నేర్చుకొనవలయునని శాసించిరి. అన్ని విద్యలలో నిపు ణుఁడు లభించుట దుర్లభము. బిర్చు ఆంగ్లేయభాషా ప్రవీణుఁడు. అతనికి నితరశాస్త్రము లంతగఁ దెలియవు. ఆతఁడు ఎడ్వర్డునకు నేవేళ నంగలవిద్య నేర్పు చుండినను, అప్పు డప్పుడు నాతనికి వాచకధాటియును, చిత్తరువు వ్రాయుట, మొద లగువి ద్యల నేర్పుటకు ఆ విద్యలయందుఁ బ్రవీణు లైన పండితులను మంత్రులు నియమించిరి. వారు రాకొమరునకు నియమితకాల ములందుఁ దాము నేర్చినవిద్యలను నేర్పు చుండిరి. రాణి తన ముద్దుకొమారుఁడు క్రైస్తవమతస్వభావము నెఱుంగక ఉపే క్షించునేమో అని ఆదివారములయందు నాబాలునకు క్రైస్తవ మతగ్రంథంబుల నేర్పు చుండెను. ఎడ్వర్డు ఏయేకాలంబుల ఏ యేగ్రంథంబుల నేర్చి చింతన సేయవలయునో ఆయాకాలంబుల నొజ్జలు నియమించుపాఠంబుల ననుదినంబునను తప్పక భయ

భక్తులతో నేర్చుకొని, నేర్చుకొన్న దానిని మఱవక వర్తించుచు, దన్నుఁ గన్న వారికిని తా నికపైఁ బాలింపఁ బోవుజనులకును అల్లారుముద్దుగఁ బ్రవర్తించు చుండెను.

### ఎడ్వర్డు అయిర్లండుదీవికి వెళ్లుట.

ఎడ్వర్డు పుట్టి యేఁడేండ్లాయెను. అతఁడు గురువులవలన విద్యలను గ్రహించు చుండె. రాణి మంత్రులతోఁ దనకు మారుని అయిర్లండుదీవికిఁ బిలుచుకొని వెళ్లి అచ్చటిజనులకుఁ నెడ్వర్డును జూపవలయు నని కోరెను. మంత్రు లాయమ మనోరథ మీడేరునటుల ప్రయాణసన్నాహములఁ గావించిరి. 1849 సం. న ఆగస్టునెలలో రాణియును ఆల్బర్టు ప్రభువును, వారిబిడ్డలును, అయిర్లండులంకకుఁ బయన మైరి. వారివెంట నాయుధపాణు లైన భటవర్గము చనెను. ప్రయాణము లెస్సగ జరిగెను. వారు క్షేమముగ నైర్లండు చేరిరి. అచ్చట నైరిషు జనులు దృఢానురాగు లై వారి పడవికిఁ దగినరీతిని వారిని సంభావించిరి. అంత రాణియును ఆల్బర్టును తమబిడ్డలను వెంట నిడుకొని క్వీన్సుటౌనును, డబ్లిన్ పురికిని, పోయిరి. అయిర్లండు దీవికి నీ"డబ్లిను"పురి రాజధాని. త్రోవలో నెచ్చట గాంచి నను జనులు రాణి తనయునిముఖకమలమును వీక్షించుటకు మోము లెత్తి రాజమార్గంబుల నిరుకెలంకులఁ గిక్కిఱిసి యుండిరి. రాణి వారిభావంబుల నెఱింగి, తనకుమారు నెత్తి చూపెను. వా రాతనిఁ జూచి సంతసించిరి. అప్పుడాపురమున

రాజమార్గంబులఁ బచ్చని తోరణంబులచే నలంకరింపఁబడి యుండె. అచ్చట నెల్లెడలఁ జూచినను వేనవేలుజనులు గుంపులు గూడి ఎడ్వర్డు రాకవలనఁ దమకుఁ గలిగినసంతసమును ముచ్చటించుకొను చుండిరి. ఎడ్వర్డు వారిదీవెనల నందుకొనుచుఁ దల్లిదండ్రులతోడను, సోదరులతోడను, తనతల్లిప్రతినిధిగారి యింట బస సేసి అచ్చట నుండునుద్యానవనంబులను, ట్రినిటి సర్వకళాశాలను, మున్నగుచోటులను గాంచి హర్షించెను. రాణి ఆపురిపౌరులకు విందు నొనర్చి యొకనాఁ డాపురి రాజమార్గంబుల నాపౌరులు సంతృప్తి జెందఁ దనకొడుకు నందఱు వీక్షించురీతి నాతని దనముందు నిడుకొని యూరేఁగెను. ఎడ్వర్డాపురిని విడిచి తలిదండ్రులును, తోఁబుట్టువులును, తన వెంట రా స్వరాజ్యమునకు నేతెంచెను. రాణి తనతనయునకు "అరల్ ఆఫ్ డబ్లిన్" అనుబిరుదు నొసంగె. ఎడ్వర్డీరీతిని బాల్యదశలో నే తనజనుల నప్పుడప్పుడు వారివారితావులకుఁ జనుదెంచి చూచు చుండుట చే నాతఁడు ప్రభు వైనపిమ్మట వారాతనియెడ దృఢానురాగము కలవారై వర్తిల్లిరి.

1849 సం. న అక్టోబరునెలలో రాణికిఁ దట్టమ్మవారు వోసెను. అప్పుడు "కోల్ యక్స్చేంజ్" అనుభవనము క్రొత్తగఁగట్టఁబడియుండె. అదేవేరి దానిఁ దెరువ వలసి యుండెను. కాని ఆయమ తట్టమ్మవారిచే బాధపడు చుండినందున నాదేవేరి తనకుమారుఁ డెడ్వర్డాపని సేయుటకు నర్హుఁ డని యెంచి ఆతని

తండ్రివెంట నాతనిని కోల్ యక్స్చేంజ్ భవనము దెరువఁ బంపెను. లండను నగరవాసు లాకొమరుని వీక్షింప రాజమార్గంబుల నిరుకెలంకుల గుంపులుగూడి యుండిరి. అతఁడు తనతండ్రివెంట నామందిరంబు సమీపించెను. ఆల్బర్టు ప్రభువు తనకుమారుని ముందు నిలువఁ బెట్టి యాతనిచే నాభవనంబును దెఱపించెను.

ఒకనాఁడు రాణి తనబిడ్డలతో ఆస్బోరననుభవనంబున నుండెను. ఉద్యానవనంబున నుండుపక్షుల వేఁటాడుకోరికతో నెడ్వర్డుఆయుధపాణు లైన యనుచరులు వెంట రానావనంబునఁ గ్రుమ్మరు చుండెను. అతఁ డేయాయుధమును గొనిపోలేదు. అతని యనుచరులుమాత్రము పక్షులను గాల్చుచుండిరి. ఎడ్వర్డు పసివాఁ డైనందున చెట్టునుండి క్రిందఁబడి మరణావస్థలో నుండినపక్షి నొకదాని నెత్తుకొనివచ్చుటకు ముందుఁ బరుగిడెను. కానింగుప్రభు వీబిడ్డఁ దాని దాపునకు వెళ్లినది యెఱుంగక తుపాకు గుఱిపెట్టి కాల్చెను. ఇంతలో నెడ్వర్డునకు నపాయము కలుగు నని యెంచి యొకశూరుఁడు దానికడ్డముగ నిలిచెను. ఆ కాల్చినతుపాకి వానిచొక్కానుఁ జించుకొని పోయెను. కాని ఎడ్వర్డున కెంతమాత్రము కీడు రాలేదు. రాణియును, ఆల్బర్టుప్రభువును, ప్రభువు కానింగును, మున్నగువారు ఎడ్వర్డు ప్రాణాపాయమైన దెబ్బవలనఁ దప్పించుకొనె నని సంతసిల్లి వానిప్రాణమును గాపాడిన వానికిఁ దగినబహుమతుల నొసంగిరి.

లండనుపురంబున నుండు "హైడ్ పార్కు" అనునుద్యానవనము మిక్కిలివిశాల మై రమణీయ మైనపచ్చనిచెట్లచే నిబిడీకృతం బై ఉండును. ఆల్బర్టుప్రభువు తనకుమారుఁడు లోకముసందు కలచిత్రవస్తువుల నన్నింటిఁ జూచి వానిస్వభావమును నేర్చుకొనుటకు వీలగునటుల నొకసర్వవస్తుప్రదర్శనశాలను 1851 సం. న ఆవనంబునఁ గట్టించెను. అతఁడందు నిర్మింపునఁ జేసినవియును, ఐరోపా, అమెరికా, ఆసియ ము న్నగుఖండంబులలో నుత్పత్తి యైనవియును, ఆయాదేశస్థులబుద్ధికుశలత వెల్లడి యగునటులఁ జేయఁబడినవియును, అయినవస్తువులను సంపాదించి వరుసగ నుంచెను. ఆశాల యద్దముచేఁ గట్టంబడి, చూపఱకు నధికసంతోషము నొసఁగుచుండిన దై చెన్నుమీరె పార్లమెంటుసభాసభ్యులలోఁ బెక్కుమంది దానిని నిర్మించుట వల దనిరి. ఎంద ఱెన్నిమాటలు వల్కినను, ఆల్బర్టు ప్రభువు వారిమాటల నాలకింపక ప్రదర్శనశాలను నిర్మించెను. శ్రీమహారాజ్ఞి తనయునిఁ గూఁతులను వెంట నిడుకొని నాల్గుగుఱ్ఱంబులఁ బూన్చినశకటంబుల నెక్కి భర్తప్రక్కఁ దాఁ గూర్చుండి ప్రదర్శనశాల కరుదెంచెను. లండనురాజమార్గంబుల జనులు వారిని వీక్షించి ప్రమోదభరితు లైరి. మంత్రులును, పార్లమెంటు సభ్యులును, రాణిని, ఎడ్వర్డును, మిగుల గౌరవించి, ప్రదర్శనశాలను దెఱవఁ బ్రార్థించిరి. రాణి వారివేఁడుకోలును వ్యర్థపుచ్చ నొల్లక ప్రదర్శనమందిరంబును దెఱచుట కంగీకరించెను. ఆవల

భర్తవెంటరాణియును, అయనవెనుక ఎడ్వర్డును, మున్నగువారం దలివస్తువులను గాంచిరి. ప్రదర్శనశాల ఆవలఁ గొన్ని నెలలుండె. ప్రతిదినమును ఎడ్వర్డు తనయయ్యవారైనబిర్చువెంటఁ బ్రదర్శనశాలకుఁజని, అందలివస్తువులస్వభావమును, తనయుపాధ్యాయునివలన నేర్చుకొను చుండెను.

రాణికొడుకు బిర్చివలన విద్యలను గ్రహించు చుండ నాయుపాధ్యాయుఁడు మఱొకతావున నుద్యోగము సేయుటకు విడిచి పోవుటకు నిశ్చయించుకొనెను. ఎడ్వర్డు ఆసమాచారము ను విని మిక్కిలి చింతాక్రాంతుం డయ్యె కాని బిర్చి ఆపసిబాలు నూఱడించి, తానుపోయినఁదనస్థానమునకుఁ దనకంటె మిక్కిలి మేధావియైనయుపాధ్యాయుఁడు వచ్చునని ఆయనకు మెప్పఁజెప్పి నను క్రొత్తపనికి గుదురుకొనెను. రాణియును అల్బర్టుప్రభువును బిర్చివలనఁ దమ కుమారరత్నము మంచినీతులను నేర్చి బుద్ధిమంతుఁడాయె నని సంతసించి యనేక విధంబులను నాతనికి దమ నెనరు జూపి చక్రవర్తి కాబోవువానికిఁ జదువునేర్పువానికి కొఅంత!

బిర్చిస్థానమున నెడ్వర్డునకు విద్యను నేర్పుటకుఁ దగిన యుపాధ్యాయుఁడు లభించుట కష్టసాధ్యమై ఉండె. నీకునాకు జదువు నేర్పుటకు బెక్కుమంది అయ్యవార లుందురు. చక్రవర్తి కాబోవు నాతఁడు చదువవలయు నన్న నాతనికి పదవికిఁ దగిన విద్వాంసుఁడు లభింపవలయును కదా! సర్ జేమ్సు స్టీఫన్ అను

లండనుపురంబున నుండు "హైడ్ పార్కు" అనునుద్యానవనము మిక్కిలివిశాల మై రమణీయ మైనపచ్చనిచెట్లచే నిబిడీకృతం బై ఉండును. ఆల్బర్టుప్రభువు తనకుమారుఁడు లోకమునందు కలచిత్రవస్తువుల నన్నింటిఁ జూచి వానిస్వభావమును నేర్చుకొనుటకు వీ లగునటుల నొకసర్వవస్తుప్రదర్శనశాలను 1851 సం. న ఆ వనంబునఁ గట్టించెను. అతఁ డందు నిగ్లండునఁ జేసినవియును, ఐరోపా, అమెరికా, ఆసియ మున్నగుఖండంబులలో నుత్పత్తి యైనవియును, ఆయాదేశస్థులబుద్ధికుశలత వెల్లడి యగునటులఁ జేయఁబడినవియును, అయినవస్తువులను సంపాదించి వరుసగ నుంచెను. ఆశాల యద్దముచేఁ గట్టంబడి, చూపఱకు నధికసంతోషము నొసఁగుచుండిన దై చెన్నుమీరె. పార్లమెంటుసభాసభ్యులలోఁ బెక్కుమంది దానిని నిర్మించుట వల దనిరి. ఎంద ఱెన్నిమాటలు వల్కినను, ఆల్బర్టు ప్రభువు వారిమాటల నాలకింపక ప్రదర్శనశాలను నిర్మించెను. శ్రీమహారాజ్ఞి తనయునిఁ గూఁతులను వెంట నిడుకొని నాల్గుగుఱ్ఱంబులఁ బూన్చినశకటంబుల నెక్కి భర్తప్రక్కఁ దాఁ గూర్చుండి ప్రదర్శనశాల కరుదెంచెను. లండనురాజమార్గంబుల జనులు వారిని వీక్షించి ప్రమోదభరితు లైరి. మంత్రులును, పార్లమెంటుసభ్యులును, రాణిని, ఎడ్వర్డును, మిగుల గౌరవించి, ప్రదర్శనశాలను దెఱవఁ బ్రార్థించిరి. రాణి వారివేఁడుకోలును వ్యర్థపుచ్చనొల్లక ప్రదర్శనమందిరంబును దెఱచుట కంగీకరించెను. ఆవల

భర్త వెంట రాణియును, ఆయన వెనుక ఎడ్వర్డును, మున్నగువా రందలివస్తువులను గాంచిరి. ప్రదర్శనశాల ఆవలఁ గొన్ని నెల లుండె. ప్రతిదినమును ఎడ్వర్డు తనయయ్యవారైనబిర్చు వెంటఁ బ్రదర్శనశాలకుఁజని, అందలివస్తువులస్వభావమును, తనయుపాధ్యాయునివలన నేర్చుకొను చుండెను.

రాణికొడుకు బిర్చువలన విద్యలను గ్రహించు చుండ నాయుపాధ్యాయుఁడు నొకతావున నుద్యోగము సేయుటకు విడిచి పోవుటకు నిశ్చయించుకొనెను. ఎడ్వర్డు ఆసమాచారము ను విని మిక్కిలి చింతాక్రాంతుఁ డయ్యె. కాని బిర్చి ఆపసిబాలు నూఱడించి, తానుపోయినఁదనస్థానమునకుఁ దనకంటె మిక్కిలి మేధావియైనయుపాధ్యాయుఁడు వచ్చునని ఆయనకు మెప్పఁజెప్పి 1852 సం. నఁ దాను క్రొత్తపనికి గుదురుకొనెను. రాణియును ఆల్బర్టుప్రభువును బిర్చివలనఁ దమ కుమారరత్నము మంచినీతు లను నేర్చి బుద్ధిమంతుఁ డాయెనని సంతసించి యనేకవిధంబుల నాతనికిఁ దమ నెనరు చూపిరి. చక్రవర్తి కాబోవువానికిఁ జదువు నేర్పువానికి నేమి కొఱంత ?

బిర్చిస్థానమున నెడ్వర్డునకు విద్యను నేర్పుటకుఁ దగిన యుపాధ్యాయుఁడు లభించుట కష్టసాధ్యమై ఉండె. నీకునాకు జదువు నేర్పుటకుఁ బెక్కుమంది అయ్యవార లుందురు. చక్రవర్తి కాఁబోవు నాతఁడు సదువవలయు నన్న నాతని పదవికిఁ దగిన విద్వాంసుఁడు లభింపవలయును కదా! సర్ జేమ్సు స్టీఫన్ అను

నాతఁడు బిర్చుస్థానమున మ-రా-శ్రీ ఫ్రెడెరిక్కు డబ్లియు గిబ్బు అనునాతఁడు ఉండదగ్గవాఁడని రాణీ ఆల్బర్టులకు నెఱుకపఱిచెను. వారు స్టీఫనుమాటప్రకారము గిబ్బును తమ కుమారునకు విద్య నేర్పుటకు నియమించిరి. గిబ్బు ఆపదవిని ఆతోంగ్లుండెను. ఆకాలమున నాతఁ డెడ్వర్డును విడిచి యెచ్చటికిఁ జనినవాఁడు కాఁడు. ఎడ్వర్డు ఆతని నేమరక వానితో నుండి, అతఁడు నేర్పినపలుకులను నేర్చుకొనెను.

ఎడ్వర్డేవేళ నుపాధ్యాయునిశిక్షలో నుండినను, అప్పుడప్పుడు విడుమరకాలమున నాతఁ డాడుకొను చుండెడివాఁడు. ఒకనాఁడు రాణి సింహాసనము మీఁదఁ గూర్చుండి యుండినపుడు, ఎడ్వర్డు ఆదేవేరి ప్రక్కఁ గూర్చుండెను. పార్లమెంటు సభ్యులు క్రిమియాలో యుద్ధము సలుపవలసి యుండెనని రాణితో విన్నవించిరి. ఆయమ దానికి సంగీకరించెను. క్రిమియాలో గొప్పరణము నడిచెను. అందు ననేకులు మృతిఁ జెందిరని ఎడ్వర్డు వినెను. 1855 సం. న "ఛాతము" అనుస్థలమున నుండినగాయముల నొందినరణశూరులను గాంచి వారికిఁ దగినకానుక లొసంగుటకు నేఁగెను. తల్లి వెంట నాయమబుడుతఁడును, నెల్లిగాయముల నొంది బాధ పడుశూరులను గాంచి, వారియెడ మిక్కిలి దయతో వర్తించెను. వారును వానిని జూడఁగానె తమశ్రమ నివారణమైన దని తలంచిరి. ఎడ్వర్డు ఈసంగతులలో నొకదానినైనను మఱచినవాఁడు కాఁడు. అతఁడు తనచిన్ననాఁడు నడిచిన

సంగతుల నన్నింటిని బూస కూర్చినరీతిని వచించు చుండెడివాఁడు. అతనిజ్ఞాపకశుద్ధి ప్రశంసనీయ మైన దని వేఱుగ వచింపవలయునా ?

క్రిమియాయుద్ధమునఁ జచ్చినవారిభార్యాపుత్రాదులసాహాయ్యార్థమై ఇంగ్లండులోనిజనులు చందాలువేసికొని పైకమును వసూలు చేసిరి. ఇందులకు బిర్లింగ్టన్ శాలలో నొకప్రదర్శనము నడిచెను. అందు వసూ లగుద్రవ్య మానిధికిఁ బోవునట్టులఁ దీర్పు సేయఁబడెను. అప్పు డనేకు లనేకవస్తువుల నాప్రదర్శనమునకు నంపిరి. రాణిబిడ్డలును యుక్తవయస్సుననుండి సంగునఁ దమకు దెలిసిన రీతిని చిత్తరువులను వ్రాసి యాప్రదర్శనమున విక్రయమునకుఁ బంపిరి. వారిలో నెడ్వర్డు వ్రాసిన చిత్తరువులు 870 రూ. లకు నమ్ముడు వోయెను.

క్రిమియాలో రణము ముగిసెను, ఫ్రెంచిరాజు విక్టోరియాను దనరాజ్యము సూడ ర మ్మని యాహ్వానము పంపెను. రాణియును ఆల్బర్టును ఎడ్వర్డునువెంటఁ బెట్టుకొని ఫ్రెంచిదేశమునకు వెళ్లి దానికి రాజధాని యైనపారిసుపుర వరంబున ఎనిమిది దినము లుండిరి. ఎడ్వర్డు ననేకులు చూచి మిక్కిలి సంతోషపడిరి. ఫ్రెంచిరాజు రాణికి ననేకవిందు లొసఁగెను. ఎడ్వర్డు విలువగల మంచివస్త్రములను ధరించి రాచకోవిని కొదమసింగంబుకై వడి నుండెను. రాణికి మార్సేల్సులో గొప్ప విందు నడిచెను. అందు ఎడ్వర్డును వానియప్పయును ఫ్రెంచి

రాణిరాజుల సమీపంబునఁ గూర్చుండి భుజించిరి. ఫ్రెంచిరాజు నకు బిడ్డలపైఁ గూర్మి యెక్కువ. అతఁడాయెడ్వర్డును ప్రిన్సస్ రాయలునుజూచి విడువక వారినాటలాడించుచుండెను. వారును హెచ్చు మచ్చికను నాయనతో నాడుకొనుచుండిరి. ఆరాజు రాజ్యమును గోలుపోయి రాజ్యపద భ్రష్టుఁడై ఉండినపుడు ఎడ్వర్డు వానిఁ గాంచి పశ్చాత్తాపము నొంది వాని నప్పుడప్పుడు చూచుచుండెను.

రాణి ఫ్రెంచిదేశమును విడిచి ఇంగ్లండునకుఁ దర్లుటకు నుద్యమించుచుండెను. ఎడ్వర్డు ఇంగ్లండునకుఁ బోవుటకు నిష్ట పడక, తల్లితో "అమ్మా! నేను ఫ్రాన్సులో నుండెద. నేను లేకున్న నీవుండలేవా? నేను లేకున్న నేమి? నే నెక్కడ నే నా నీ కొడుకను? నీవు వారితోఁ దృప్తి నొంది యుండుము." అనెను; రాణి వానిమాటలకు నవ్వి వాని నచ్చట విడిచి పెట్టక తన దేశ మునకుఁ బిలుచుకొని వచ్చెను.

ఎడ్వర్డు జనులనిజమైనస్థితిగతుల నెఱుంగఁ గోరి గూఢ వేషమున ఇంగ్లండు పశ్చిమ భాగమును జూడఁ దర్లెను. అతని వెంట నాతని యుపాధ్యాయుఁడు, గిబ్సను తర్సల్ కావెండిషను, వెళ్లిరి. అతఁడు మాఱువేషమున వారివెంటఁ గాలి నడకను డివోన్ షైరంతటను గ్రుమ్మరినను, జనులు తమయూళ్లలో రా కొమారుఁడు మాఱువేషమునఁ గ్రుమ్మరుచుండె నని ఊహించి వాని జాడలు వెదుక బ్రయత్నించిరి. కాని కనుఁగొన లేరైరి.

ఎడ్వర్డు తనయిల్లు సేరి ఫ్రాన్సుజర్మని మొదలగుతావు లకు విద్యార్థియై వెళ్లెను. అతనివెంట జనరల్ గ్రే అనునాతఁడును, గృహస్థధర్మముల నేర్పునట్టి హెచ్ పోర్‌సర్ బియును, శాస్త్రముల నేర్పుగిబ్బునను, మున్నగువారు సనిరి. కొన్ని సమయములలో దేశములలోనందందు చిత్రవిచిత్రము లగు ధాతులతాదులఁ గాంచు నిమిత్త మాతఁడు కాలినడకను బోవుచుండెను. అతఁడేయే వేళల నేయేచోటుల నేయేరీతుల నుండవలయునో ఆయావేళల నాయాతావుల నాయావిధంబుల నుండెను. అతఁడు తానురాచబిడ్డఁ డనియును, తా నెచ్చోటికి నేఁగినను, రాజునకుఁ జేయఁ దగినగౌరవములు సేయవలయు నని కోరినవాఁడు కాఁడు. అతఁడు సామాన్యజనుని పగిదిఁ దనయుపాధ్యాయుల వెంట నాయాతావులయందుఁ గ్రుమ్మరి ఇల్లు చేరెను.

### ఎడ్వర్డు విద్యాభ్యాసము.

ఎడ్వర్డు నప్ప ప్రిన్సస్‌రాయల్ అను చిన్నది వ్యక్తురాలయ్యె. ఆమెకుఁ బదు నేడేండ్లు నిండెను. ప్రష్యాచక్రవర్తి ఫ్రెడరిక్కు విల్లియ మనురాకొమారుఁ డాతరుణిని జేపట్టఁ గోరెను. రాణి తనకుమార్తెకు మంచివరుఁడు లభించె నని కౌతూహలచిత్తయై మంత్రులతో నాలోచించి మిగులవైభవంబున నాచిన్నదాని నాయుర్వీశునకు నిచ్చి సెంటుజేమ్సు చేపలున వివాహము సేసెను. ఎడ్వర్డు తనయక్కకు నవరత్న

ములతోఁ జెక్కినచంద్రహారమును కానుకగా నిచ్చెను. అతని బావ యాతనియప్పను వెంటనిడుకొని తనదేశమునకు నేఁగెను. ఎడ్వర్డు తనయప్పను విడిచి పెట్టి యుండుటకుఁ గొంతచింతించి, ఆవలఁ దనహృదయము నూఱట పఱుచుకొని యుండె.

ఎడ్వర్డువయస్సుపదునే డేండ్లుగుండెను. అతఁడు సకల శాస్త్రంబుల నేర్చుకొనుటకు నాతనిబుద్ధిబలము తగినస్థితిలో నుండెను. అతఁ డింతదనుక ఇంటిలో నుపాధ్యాయుల నియ మించుకొని వారివలన నానావిధవిద్యల నేర్చుకొనుచుండెను. ఇఁకమీఁద నటులఁకాదు. అతఁడు సామాన్యులవూడ్కి ఆక్సు ఫోర్డు కేంబ్రిడ్జు, ఎడింబరు మున్నగుసర్వకళాశాలలలోను, అయిరోపాఖండంబున నుండుకళాశాలలయందును, ధనుర్విద్య యందును, వ్యాపారతంత్రంబులలోను, సమస్తవస్తుజాలంబులఁ జేయుటలోను నేర్పఱితనము పొరయవలె నని, ఆతనితల్లి దండ్రులు కోరి ఆతనితోఁ గూడ చదువుకొనుటకు ముగ్గురు సహపాఠులను నియమించి, రిచ్మండ్ ఉద్యానవనంబున నుండు వైట్లాడ్జ్ అనునస్త్రశాలయందు ధనుర్విద్యను నేర్చుకొను నటుల నేర్పాటులుసేసిరి. ఎడ్వర్డుధనుర్విద్యను నేర్చుకొనునపుడు తనయుపాధ్యాయుల యాజ్ఞల నతిక్రమింపక సామాన్య బాలుని భంగి వర్తించి రణశాస్త్ర మర్మంబుల నన్నింటిని నేర్చుకొనెను. అతఁ డావిద్యలోఁ బరిపూర్ణప్రజ్ఞావంతుఁడై యొరులకుఁ దా నావిద్యను నేర్పునంతజ్ఞానమును సంపాదించి వీరవరుఁ డయ్యె.

1859 సం. న గిబ్సు విశ్రాంతిసెందుటకుఁ దనపనిని విడిచిన పిమ్మట నాతనిస్థానమునకు టార్వ రనునాతఁడువచ్చెను. ఎడ్వర్డు వానివెంటఁ దనతల్లితండ్రుల యానతిని అయిర్లోపాఖండంబున నుండుకళాశాలల విద్యను నేర్చుకొనుటకు వెడలెను. అతఁడు ఇటలీ జిబ్రాలిరు, లిస్బను, స్పెను మొద లగు రాజ్యంబులనుఁ పురంబులను జూచి, యందుఁ గొన్నా ళ్లుండి, తనయింటికి వచ్చి తల్లిదండ్రులకడఁ గొంతకాల ముండెను.

విక్టోరియాయును, ఆల్బర్టుప్రభువును, మంత్రులును ఎడ్వర్డు ఎడింబరులోఁ గొంతకాలము విద్యాభ్యాసము సేయ వలసినట్టులఁ గోరి, యాతనిని ఆచోటికిఁ బంపిరి. కళాశాలా పద్ధతులు బహుకఠినము లైనవి. వానినతిక్రమించి యేవిద్యార్థి యును పోఁగూడదు. సామాన్యస్థితిలో నుండుబాలురు అయ్యా వారలయాజ్ఞలకు లోఁబడి నడుచుకొనుట సహజము. ఎడ్వర్డు రాకొమారుఁడు. అదియునుగాక సర్వకళాశాలాపద్ధతుల స్వభావ మాతఁడు గుర్తెఱుంగఁడు, అతఁ డాగర్భశ్రీమంతుఁ డై తల్లిదండ్రులపొత్తున నుండి, వారిసమక్షమున ఉపాధ్యాయుని వలనఁ దనకు నిచ్చవచ్చినపుడు విద్యను గ్రహించుచుండెను. ఇప్పు డటులఁగాదు. అతఁడు సర్వసామాన్యబాలుని మాడ్కి కళాశాలాపద్ధతులకు బద్ధుఁ డై సర్వకళాశాలలయందుఁ బలుకు నేర్చుకొనుటకు సమకట్టెను.

ఎడ్వర్డు ఎడింబరో విద్యాలయమున రసాయనశాస్త్ర

మును, తత్సంబంధములైనపారిశ్రామికవృత్తులును, డాక్టర్‌న లియాన్‌ప్లేఫేర్ (Dr. Lyon Play fair.) అను నాతనివలన నేర్చి, సామానులు సేయుచోటికిఁ దనయుపాధ్యాయునివెంట వెళ్లి, వానిఁ జేయుమార్గములను దెలిసికొనెను. జర్మనీదేశ స్థుఁడును, ఎడింబరున హైస్కూలునకు డైరెక్టరును, అయిన డాక్టర్‌ష్మిట్జు (Dr. Schmitz.) అనునాతఁడు ఎడ్వర్డునుకు రోముపురిచరిత్రమును చెల్పెను. ఎడ్వర్డు తనకుఁ దీరుపాటొదవినపుడు వారమునకు మూఁడుతడవల ఎడింబరున నుండు ధనుర్విద్యాలయమున నావిద్యను చింతనచేయుచుండెడివాఁడు. మిగతకాలమున నాతఁడు ఇటలి జర్మని ఫ్రాన్సు మున్నగుదేశ భాషల నేర్చుకొనుచుండెను. ఎడ్వర్డునకు న్యాయశాస్త్రమును (Law) దేశచరిత్రమును (History.) నేర్పుటకు ఫిష(Fisher) రను నాతఁడు కుదురుకొనెను. ఎడ్వర్డు ఏవేళ నీశాస్త్రములనభ్య సించుచుండినను, కొంచెము తీరుబాటుకలుగఁ జేసికొని సర్‌వాల్టరుస్కాట్టువ్రాసిననవలలను, జర్మని ఫ్రెంచిభాషలతో వ్రాసిననవలలను, వెత్తి యెత్తిన వానికైనడిఁ జదువుచుండెడి వాఁడు. ఎడ్వర్డు ఎడింబరునఁ జదువును పూర్తిగ నభ్యసించి, పండుగలకు నింటికి వచ్చెను.

ఎడ్వర్డువిద్య యింకను ముగియ లేదు. అతఁడు ఆక్సు ఫోర్డు(Oxford)సర్వకళాశాలలోఁ జదువ నుద్యమించెను. అతని తల్లిదండ్రుడు లాతని నచ్చుటికిఁ బనుప సిద్ధులై యుండిరి. అతఁ

డును వారికోర్కెప్రకార మాచోటికి వెళ్లి అచ్చట విద్యను గ్రహింపసాగెను. అతఁడు విద్యాలయమున నందఱితో మచ్చికతో మెలఁగుచు, వారిలో నెవ్వరితోను విరోధము సేసికొనక, అందఱకును మిత్రుఁడై వర్తించి సమస్తకళల నభ్యసించి అన్నిపలుకుల నుత్తీర్ణుండై తనయింటికి వచ్చి కొన్నిదినములు తనతల్లిదగ్గఱ నుండెను.

ఎడ్వర్డు కొన్నిరోజు లైనపిమ్మటఁ గన్నడా అమెరికా సంయుక్త రాష్ట్రములుమొద లగురాజ్యములకు వెళ్లి తిరిగి యింటికి నేతెంచి, కేంబ్రిడ్జు సర్వకళాశాలలో విద్య నభ్యసించుటకు నచ్చోట ట్రినిటి సర్వకళాశాలయందుఁ జేరెను. అతఁడు పాఠశాలలో గణితశాస్త్రమునఁ బ్రవీణుఁ డయ్యెను కట్టుదిట్టములకు లోఁబడి యెన్నఁడును ఉండిన వాఁడు కాఁడు. ఇంటిలో నయ్యవారు వానియిష్టముచొప్పునఁ బలుకు నేర్పుచుండెను. ఇప్పుడా కేంబ్రిడ్జులో నట్లు కాదు. అతఁడు తనయుపాధ్యాయులయనుమతిని బొందవలసియుండెను. అతఁ డానిబంధనల సహింపలేక ఒంటరిగ లండను నగరమునకు నయ్యవారల సెలవు వొందక ధవుడు కొట్టెను. ఆతనియొజ్జ లాతఁడు లండను నగరమును జేరకముందే ఆతనిపోకను దెలిసికొని ఆతనితల్లిదండ్రులకుఁ దెలియఁజేసిరి. అతఁడు రైలుస్టేషనులో దిగి దిగకముందే ఇంటిలో నుండు సేవకులు కొందఱు వచ్చి కాచుకొని యుండిరి. అతఁడు వారిని గాంచి తలవంచి లజ్జితుఁ డయ్యె.

ఎడ్వర్డు కేంబ్రిడ్జులోఁ జలికాలమంతయు నుండెను. చలికాలపు రజారోజులు వచ్చెను. పాఠశాలలు మూసిరి. రాణి మున్నగువారెడ్వర్డు "కూర్రా" అనుచోట ధనుర్విద్యాపారంగతుఁడు కావలెననికోరి, ఆరజాదినములలో నచ్చటికిఁ బంపిరి. ఎడ్వర్డు అచ్చోటికి వెళ్లి సేనానాయకుఁడైనకర్నల్ పెర్సివాని వలన రణశాస్త్రమర్మంబుల నేర్చుకొని యందుఁ బ్రవీణుండయ్యె.



## మూఁడవ అధ్యాయము.



### ఎడ్వర్డుతండ్రి మరణము.

ఎడ్వర్డు కేంబ్రిడ్జు కళాశాలయందు విద్యాభ్యాసము సేయుచుండెను. అతఁడాచోటఁ దనయుపాధ్యాయుల యాజ్ఞలకు విధేయుఁడై సహపాఠకుల నాదఱకుఁ బ్రియుండై యుండెను. అతఁడు చదువును ముగించి, అయిరోపాఖండంబుననుండు డెన్మార్కు రాజ్యమునకు నొడయనిపట్టి నలెగ్జాండ్రాఅను యువతీమణిని జూడవలయునని ఆతనితండ్రి తలంచి, వారిద్దఱును జర్మనిలో సంధింపవలయునని కోరెను. ఈరహస్యము ఎడ్వర్డు తండ్రికి హృదయపేటికాంతర్గతమై యుండెను. కాని అయిరోపా ఖండమందలి వార్తాపత్త్రికలారహస్యమును వెల్లడి పఱిచెను. అంత నింగ్లండులోని పత్త్రికలు, ఈ మర్మమును కొంతవఱకు

వెల్లడిచేసినవి. అయిన ఎడ్వర్డు ఆకాంతామణిని జూచి, తన మనస్సునకుఁ బట్టినచిన్నదని చెప్పుటకుముందే ఈవార్తాపత్రికాభేకంబులు ఈ విషయమును వెల్లడి సేయుటకు నా యాల్బర్టు కొంత నొచ్చుకొనెను.

ఎడ్వర్డు తన భావిప్రియురాలిని గని వచ్చుటకు స్పేయరు హిడల్‌బర్గు అనుతావులకు వెళ్లెను. అచ్చట నాకాంతయుఁ దనకాంతుని వీక్షించుటకు నేతెంచియుండెను. వారిరువురును, ఆతావులలో రెండురోజు లుండిరి. వారిద్దఱహృదయములు లీన మయ్యెను. అంతట ఎడ్వర్డాచోటు వదలి ఇంగ్లండునకు వచ్చి, తనయిచ్ఛను తల్లిదండ్రులకు నెఱుక పఱిచి కేంబ్రిడ్జికిఁ జనెను.

ఆల్బర్టుప్రభువు తనకొఱకు డెన్మార్కు-రాజ్యపుటాడ యనిపట్టిని జేబట్టు నని సంతసించి వివాహప్రయత్నములు సేయ నాలోచించుచుండెను. కాని "తా నొకటిఁ దలఁచిన దైవ మొకటితలంచును" అనులోకోక్తి అసత్యమా నె? అతఁడు తనకోరిక ప్రకారము కొడుకు పెండ్లిని జేసి చూడలేదు. అతఁ డొక నాఁడు కేంబ్రిడ్జున నుండినసుతుని జూచి వచ్చుటకు వెళ్లెను. నాఁడు కుంభద్రోణవర్షము వర్షించెను. కాని అతఁడు దానిని లక్ష్యము సేయక కేంబ్రిడ్జినుండి ఇంటికిఁ జనుదెంచెను.

అతఁ డిల్లు సేరి చేరక ముందే జ్వర మాతని నాశ్రయించెను. అతఁడు దానిచేఁ గొంతశ్రమపడెను. వైద్యులనేకులు

తత్క్షణమే వచ్చి దివ్యౌషధముల నిచ్చిరి. రానురాను రోగము ప్రబల మయ్యెను. వైద్యులు ఆల్బర్టు బ్రతుకఁడని నిరాశ చేసికొనినవా రయ్యెను, ఆభావమును వెలి నిడిన రాణిగారు ధైర్యమును గోల్పోవుదు రని తలంచి, ఏమేమోమందుల నిచ్చు చుండిరి. విక్టోరియా తననాథుఁడు జీవింపఁడని నిశ్చయించుకొనెను. ఆమెహృదయసముద్రమునుండి శోకతరంగంబులు కన్నులనుచెలియలికట్టమేర దాఁటి పాయలుగ వచ్చుచుండెను. కాని ఆదేవేరి తనశోకము వెలింబుచ్చినఁ బసివాండ్రు మిగుల దుఃఖించి దిగు లొందుదు రని యెంచి దాని లోన నడంచుకొని, అశ్రుకణంబులఁ గొనగోటఁ జిమ్మి వైచు చుండెను.

రాణి రెండవకూఁతురు ప్రిన్సెస్సు అలిస్సు అనుచిన్నది పసి దయ్యెను, బుద్ధిమంతురాలును, దీర్ఘాలోచన కలదియును, ముందు నేమి కలుగు నో అని సంశయించి, కేంబ్రిడ్జులో నుండినతనయన్నకుఁ దండ్రి జబ్బుస్థితిలో నుండె ననియును, బ్రతుకుట దుర్లభం బనియును, తంతివార్త చేసెను. అతఁ డామాటను విని, శోకముచేఁ బీడింపఁ బడినవాఁ డయ్యెను, ధైర్యలక్ష్మిని త్యజింపక వాయువేగ మనోవేగంబున విండ్సరుభవనముఁ జేరెను.

అతఁడు తనతండ్రి యైనఆల్బర్టు మరణావస్థలో నుంటఁ గాంచెను. హృదయము శోకపూరిత మయ్యె. కనులనీరుజలజల రాలి చిన్నచిన్న కాలువలై కడపట గొప్పప్రవాహము లయ్యె.

ఆల్బర్టు మోమువన్నె రానురాను కృశించెను. దంతచ్ఛాయ డీలుపడెను. పెదవులు నల్ల నయ్యె. ఆల్బర్టుఁ జుట్టుముట్టి ఉండి నరాణి ప్రభృతులు ఈచిహ్నము లన్నియుఁ గాంచి, ఆల్బర్టు మృతిఁ జెందె నని నిశ్చయించిరి. రాణి గొల్లు మని యేడ్చె. ఆయమపుత్త్రుడు ఆక్రందనము సేసె. మిగిలిన వాండ్రును మిగుల దుఃఖించిరి. మంత్రు లింతలో విచ్చేసి, రాణికిని ఎడ్వర్డునకును, ఊఱటపలుకులు సెప్పి, ఆల్బర్టుశరీరమును, సమస్త రాజచిహ్నములతో విండసరు నుండు సెంటుజార్జి చేపలునఁ బూడ్చిరి. అప్పు డనేకపరరాజులును విచ్చేసి, రాణికి నామెతనయునకును దుఃఖోపశాంతి వచనంబులు వల్కి, నారియుమ్మలికంబును బోలఁగఁ జేసి, తమతమ దేశములకు వెళ్లిరి.

ఎడ్వర్డును, తండ్రిమరణమునకై సర్వదా దుఃఖించు చుండెను. అతఁడు తనపనులన్నిఁటిని వదలుకొని, "తండ్రిపోయెను, మనమును పోవువారమే కదా? మనకు నీరాజ్యంబు లేల? గీజ్యంబు లేల? పుట్టుట చచ్చుటకొఱకే, ప్రాపంచికసౌఖ్యంబు లస్థిరంబులు. ఉన్నంతవఱకు ధర్మకార్యములు సేసికొనుచు, భగవత్ప్రీతికర మగుమార్గమున నడుచుచు నుండుట మేలు" అని తలంచి, రాచకార్యంబులకు మనస్సుఁ దగులనియ్యక ఉండెను. రాణియును, మంత్రులును, ఎడ్వర్డు తండ్రిమరణముచేఁ గలిగిన విరక్తిని నుండె నని యెంచి, ఆతనిమనస్సు రాచకార్యములపైఁ దిరుగునటుల వానిఁ బురికొల్పిరి. అతఁడును తల్లిమా

టలకుఁ జెవి నిచ్చి, ఆయమయిష్ట ప్రకారము వర్తింప నంగీకరించెను.

మంత్రులు ఎడ్వర్డునకు వివాహము సేయుట బాగని విక్టోరియాకుఁ జెప్పిరి. ఆయిల్లాలు వారిమాటలు లెస్స అని యెంచి, తనకొడుకునకు వివాహము సేయుటకు సమ్మతించి, దానికిఁ దగినయుద్యమములు సేయవలయు నని వారికి ననుజ్ఞ నిచ్చెను. వారును పెండ్లికార్యములు సేయ నారంభించిరి.



## నాలవ అధ్యాయము.



### ఎడ్వర్డు పెండ్లి.

శ్రీ విక్టోరియా మహారాణి భర్తను గోలుపోయినది మొదలు రాచకార్యములు సేయఁబూనక ఉండెను. ఆల్బర్టు జీవించి యుండినపుడు ఆదేవేరి ఆతనిసాయంబున నన్నికార్యములను నిర్వర్తించు చుండెను. ఇప్పు డొంటరిగ నన్నిపనులామె నిర్వహింపవలసి యుండెను. ఆమెకు నన్నిఁటం దోడుపడుటకు ఎడ్వర్డు యుక్తవయస్సున నుండెను. అతఁడును తండ్రి మరణంబున కై చింతిల్లు చుండెను. మంత్రులు వానికిఁబెండ్లి చేసిన నాయిరువురఁశోకము తుదముట్టు నని తలంచి, రాణితో నాలోచించి తగిన యుద్యమములు సేయసాగిరి.

ఎడ్వర్డు ఒకనాఁడు తనమిత్రులతో సరససల్లాపంబులు

సేయు చుండెను. అప్పుడు వారిలో నొకనిచేతిలోఁ గాగితపు
టట్టపై వ్రాసిన చిత్రపట మొక్కటి యుండెను. ఎడ్వర్డు దానిం గై
కొని చూచి, డెన్మార్కు షేనిపట్టి అని యెఱింగి, ఆ మేనియం
దంబును డెందంబున మెచ్చుకొని, ఆమెపై వలపుఁగొని దాని
వెలిఁబుచ్చక, అతరుణీమణిని గనుంగొనఁ గోరు చుండెను. అది
మొద లాతఁడు ఏపనులయందు నాసక్తి లేక ఆ చెలియపై
మోహ ముంచి, ఆమె నెప్పు డెప్పుడు గనుగొందు నా యని
ఉవ్విళ్లూరు చుండెను. ఇంతలో మంచి సమయము తటస్థించెను.
డెన్మార్కురాజు తనప్రియపుత్రిక యగున లెగ్జాండ్రాతో హిడల్
బర్గునకు వచ్చునటులఁ దెలియవచ్చెను. ఎడ్వర్డు ఆమాటను విని
ఆచెలియఁ జూచి వచ్చుటకు నాచోటికి వెళ్లెను. అచ్చట నిం
తకుముందే ఎడ్వర్డు రూపు కలచిత్రపటమును గాంచి యాతనిఁ
జూడవలయు నని యపేక్షించు చుండిన అలెగ్జాండ్రా ఆతనిని
జూచి సంతుష్టాంతరంగయయ్యె. అతఁ డాకన్నియఁ గాంచి,
తదీయ రూపలావణ్యాదిగుణగణంబులం గని విమోహితుం డై
ఆమెచూపు లను సంకెలలచేఁ గట్టఁబడిన హృదయము కలవాఁ
డై యాచోటువిడువ నొల్లక ఎట్టకేలకుఁ గొంతధైర్యము తెచ్చు
కొని "ఆఁడుదాని యందమునకు నింతలో మగవారు బేలు
పోఁగూడునా ?" అని స్వాంతంబునఁ దలంచి, తనయింటికి
జనుదెంచెను.

ఇంగ్లండు నేలురాణి తనకుమారునకు వివాహ ప్రయ

త్నములు సేయుచుండె నని విని జర్మనీ దేశపు రాజకుమారుండు పటములను, స్వీడన్ దేశపు తేనిపట్టి ఫలకమును, ఇట్టివి యెన్నియో అనేకములు ఇంగ్లండురాణి సమ్ముఖమున వచ్చి యిచ్చెను. రాణి వానిని గాంచి ఎడ్వర్డునకుఁ జూపెను అతఁడు వానిని జూచియుఁ జూడనియట్టుల నుండి వానియెడఁ దనకుఁ గలయనాదరణను గాన్పించెను. బుద్ధిశాలియైన మహారాణి వానిభావం బెఱింగి ఆయూపటము లాయారాజ్యములకుఁ బంపెను. అంత రాణి ఎడ్వర్డు మనోభీష్టంబుఁ దెలిసికొని డెన్మార్కు రాతనయను వివాహమాడఁ దలంచినాఁడని ఊహించి ఆదేశపుటొడయనికి నాశుభవర్తమానమును దెలియఁబంపె. అతఁడునుతనకూఁతునకుఁ దగినవరుఁడు లభించె నని మహానంబు నొంది, శుభముహూర్తము నిశ్చయింపవలసిన దని రాణికి నెఱుకపఱిచెను. ఆమెయును మంత్రులతోను కాంటర్బెరి ఆర్చిబిషపు తోడను, ఆలోచించి 1862 సం. న ఫిబ్రవరినెల 16వ తేది నాఁడు పెండ్లి ముహూర్తమును నిర్ణయించినటుల శుభవర్తమానమును డెన్మార్కు ప్రభువునకు నెఱింగించెను. అతఁడు ఇంగ్లండునకుఁ దనతనయను వెంట నిడుకొని వత్తు నని రాణికి సమాచారమును బంపెను. ఇటుల రెండిండ్లవారును బెండ్లికి వలయునుద్యమములు సేయుచుండిరి:

రాజమంత్రులు ఎడ్వర్డునకు డెన్మార్కుప్రభువుపుత్రిక నిచ్చి వివాహముజరుగు నని లండనుపత్రికలలోఁ బ్రచురించిరి.

తత్పూర్వము కొద్దిమందికిమాత్రము తెలిసిన ఎడ్వర్డలెగ్జాం డ్రా వివాహము అందఱును ఎఱింగి, దానిని గనుటకు గుతూహలాయత్తచిత్తులై యుండిరి. ఈవివాహమువలన రాజ్యము సిరిసంపదలతో మిక్కిలివర్ధిల్లు నని అనేకులు కోరిరి. రాణికి లోఁబడిన రాజ్యంబులలోని జనులు తమరాచబిడ్డఁడు సదాచారసంపన్నురాలును, సుగుణగణమణియును, సౌందర్యశుభాంగియును, అయినఅలెగ్జాండ్రారాచకూఁతును వివాహమాడఁ బోవు ననియును, ఆపరిణయంబును గాంచవలయు ననియును, కోరిరి. ధనవంతులును, శాఁగలిగినవారును మాత్రము ఇంగ్లండునకుఁ జనుదెంచి యావివాహమహోత్సవమును జూడ నుద్యమించిరి. అనేకులు తాము రాలేమని నిరాశచేసికొని తమతమ యింటిపట్టులయందే యుండి ఎడ్వర్డలెగ్జాండ్రులవివాహము నిర్విఘ్నముగఁ బరిసమాప్తి నొందవలె నని కోరుచుండిరి.

డెన్మార్కురాజతనయ యగునలెగ్జాండ్రా ఇంగ్లండునకు గ్రొత్తదికాదు. అపురికి రెండుమూఁడుతడవ లాకన్నియ పసితనంబున వచ్చి దానిసొబగును, గాంభీర్యంబును, జనులకుఁ జూపి ఉండెను. ఆమె తనమేనయత్తయైనకేంబ్రిడ్జిరాణిని జూడ నేతెంచినపుడు లియొపాల్డనుభూనేతను జూడఁ బోవుచుండిన విక్టోరియాను గాంచెను. ఆమహారాణి అప్పుడే ఆడెన్మార్కుప్రభుతనయను గని దానివినయగాంభీర్య సౌశీల్యాది సద్గుణాం

బులకు మిగులసంతసం బంపెను. ఇదియునుగాక రెండవతడవ నాపూఁబోఁడి తనతండ్రి వెంట నింగ్లండునకుఁ జనుదెంచి ఆస్బోర నులోనుండినవిక్టోరియాను జూచి తన రాజ్యమునకు మఱలెను. లండనుపురి పౌరు లాచిన్నదానిసొబగును విన్నవారు కాని ఆ తరుణిని గని యెఱుంగరు. అనేకు లనేకభంగుల నాయమ సౌందర్యంబును మదిలోఁ బొగడుచుండిరి. కొందఱు "నే మా యలెగ్జాండ్రాను, డెన్మార్కులోఁ గన్నారము. జను లనుకొనుకీ తిని అంతచక్కనిపూఁబోఁడికాదు. ఏమో గొప్పరాజునకుఁ బత్నికాఁబోవుచున్నది. అయిన సద్గుణగణఖని యఁట," అని వక్కాణించిరి. మఱికొందఱు "అలెగ్జాండ్రా మంచిచక్కనిది. మిక్కిలిచదువరి. నిగర్వి. ఆశ్రయించినవారిపాలిటికల్పవృక్షము. మనలఁ గన్నతల్లిమాదిరిఁ గాపాడును." అనిరి. "ఓ! ఈయలె గ్జాండ్రా ఎవరో? అనుకొంటిని. మొన్ననాతోఁగూడి యాడు కొన్నచిన్నదా? దానికా పెండ్లి? ఆతరుణియేనా మనయొడ్డురను బెండ్లియాడఁ బోవుచున్నది? దానికి నెంతభాగ్యము? దాని యదృష్ట మే అదృష్టము." అని వెండియుఁ గొందఱు వల్కిరి. "ఆయలెగ్జాండ్రా మనకు రాణి అగుట మనకు లాభమును, డెన్మార్కుదేశస్థులకు గొప్పనష్టమును గాదా?" అని ఇంకఁ గొందఱు వాక్రుచ్చిరి. విక్టోరియామహారాజ్ఞీ యాస్థానపుఁగవీశ్వరుం డైన టెనిసనను కవి చంద్రుఁడు పెండ్లి కై ఇంగ్లండునకు నేతెంచు చుం డినఅలెగ్జాండ్రాకు నీటులఁ బద్యరూపంబున స్వాగత మిచ్చెను.

"అందంపుఁబ్రోవ! మాయంగలరాణి
ఇందునిభానన! వెలుగిచ్చి నిన్ను
'మాలంకకును వచ్చి మమ్ములఁ బ్రీతిఁ
బాలింపు మోతల్లి పద్మజగంధి,
ఓయలెగ్జాండ్రా య' నోరిమి నెలమిఁ
బాయనికూర్మిని పల్కుచున్నట్లు
ఖంగు ఖంగని మ్రోసె ఘంటజాలంబు
బాంగా రలెగ్జాండ్రపురిఁ జేరువేళ."

రాజబంధువు లనేకులు ఎడ్వర్డు అలెగ్జాండ్రాకు మగఁడౌ నని ప్రమోదభరితహృదయు లై పెండ్లిదిన మెప్పుడు వచ్చునా యని కోరుచుండిరి.

రాణియాజ్ఞను మంత్రులు పెండ్లికార్యములు సేసి ముగించిరి. వారు పెండ్లికి రావలసియుండినసామంతప్రభువులకును, సమానరాజపుంగవులకును ఇంకననేకప్రముఖులకును, వివాహాహ్వానపత్రికలను వ్రాసిరి. వారు లండనుపురము ననేకరీతుల శృంగారింపఁ గొలువుకాండ్రను పెక్కుమందిని నియమించిరి. ఆసేవకులును దమ తేఁడు చెలువంపుదీవి యనఁబరగు నలెగ్జాండ్రాను జేఁబట్టు నని సంతోషచిత్తంబునఁ దమ రాజభక్తిని వెల్లడి సేయుచు పురమును శృంగారించిరి. రాజమందిరంబులు నానావిధంబు లైనవన్నెలతో మెఱయసాగెను. రాజవీథులు చక్కని వై నిర్మలము లై కనుపట్టె. "మహాచక్రవర్తి చక్కని

చిగురాకుఁబోఁడిని జేఁబట్టఁ బోవు చున్నాఁడు. పెండ్లివేడుకలను జూడ ననేకదేశములయందుండి అనేకులు వత్తురు. పెక్కు సరకులు విక్రయమునకుఁ బోవును. ద్రవ్యమును సంపాదించుటకు నిదియే మంచిసమయము. జాగు సేయకూడదు. అన్నిసామానులను జేర్చుకొనుట లెస్స'' అని వర్తకులందఱును ఆయావస్తువులు విక్రయమునకుఁ దెచ్చి పెట్టుకొనిరి. భిక్షు లూఁచ్చుకొని జీవించువాఁడు మొదలు రాణిమంత్రిపదంబుననుండినవారివఱకుఁ గలజనులందఱును తమతమమందిరంబుల సర్వవిధంబుల నలంకరించుకొనిరి. పరదేశములనుండి పరిణయవినోదంబులఁ గాంచుటకు నేతెంచుగొప్పవారును, శ్రీమంతులును, హిందూదేశమున నుండినసామంతప్రభునికరంబులును, తమకు నాపట్టణంబున నాతరుణంబున బస సేయుటకుఁ జోటు లభింప దని యెంచి, మున్ముందుగ నద్దెకు నియ్యవలసినపైకమును బంపి, బసలను ఏర్పాటు చేసికొని యుండిరి. రాణిమంత్రులును వేవేగనైరోపాఖండంబున నుండుచక్రవర్తులకుఁ దగినమేడలును నియమించి వారిదేహసౌఖ్యములకు భంగము లేవియు లేకుండఁ జేయుటకుఁ బెక్కుమంది సేవకులను నియమించిరి. పనులన్నియు ముగియఁ గళ్యాణకళలచే లండనునగరవరము పెంపొందుచుండెను.

ఎడ్వర్డు తండ్రిపోయిన దాదిగ రాచకార్యములు సేయు చుండెను. పరదేశములనుండి రాణిఁ జూడ నేతెంచినప్ర

భువుల నాతఁడు గౌరవించి వారి నాదరింపవలసియుండెను. అతనికల్యాణమహోత్సవమును జూడ సామంతప్రభువర్గములును శ్రీమంతు లైనవర్తకనికరంబులును, అతనిరాజ్యంబుల నాతనిమారుగఁ బాలించు రాజప్రతినిధుల సమూహంబులును, సామాన్యజనంబులును, ఎన్నియోమంది లెక్కకుమిక్కిలి వై లండనుపురి వైభవమహోన్నతముగ నానాదేశంబులయందుఁ బెల్లుగ నల్లుకొనునటులఁ జనుదెంచు చుండిరి. వారు వారు తమకు నియమించిన విడిదులలో బస చేసిరి. హిందూదేశము, కన్నడా, ఆస్ట్రేలియా, కేపుకాలని మున్నగురాజ్యంబులయందలి సేనలును, సేనానాయకులును, లండనుపురి చేరిరి. రాణి మంత్రు లేయేవారల నేయేరీతుల నాదరింపవలయు నో ఆయా వారల నాయారీతుల నాదరించుటకు వారివారి హోదాలకుఁ దగిన పరివారమును ఏర్పాటు చేసిరి. వారందఱును ఎడ్వర్డు కళ్యాణ మహోత్సవమును గాంచుటకు నతికుతూహలు లై యుండిరి.

రాణి తన వియ్యంకునకును, వియ్యపురాలికిని, వారి పరిజనములకును, దగినబసలను ఏర్పాటు చేసెను. వారిలోఁ బెక్కుమంది వారివారి కుటుంబములతో ముందుగ నే విచ్చేసి యుండిరి. రాణిమంత్రులు వారికి నే కొదువ లేకుండునటుల వారికి వలయుసామానులను అందఁ జేయు చుండిరి. డెన్మార్కు ప్రభువు తనజనసమూహములకుఁ గావలసిన సామగ్రుల నన్నిం

టిని బంపించెను. ఎవరును ఏలాటి కోలాహలములు లేక డెన్మార్కు రాజపుత్త్రిక యగు నలెగ్జాండ్రారాకకు నెదురు చూచు చుండిరి.

ఇంగ్లండు పెక్కుభాగములుగ విభజింపఁబడి యున్నది. ఒక్కొక్క దానికి "కౌంటి" అని పేరు. అట్టిదానిని మన రాజ్యమున "జిల్లా" అని పలుకు చుందుము. అచ్చటఁ బ్రతికౌంటి యందును, వ్యాపార సంఘములు, వ్యవసాయదారుల సంఘములు, నగర పాలకుల సంఘములు, (Municipal Bodies). గొప్పగొప్ప జమీందారులు, మొదలైనసంఘములును, జనులును, పత్త్రికాముఖంబునఁ దమ తమ రాజభక్తిని దెలుపుటను, ఎడ్వర్డు సంప్రీతిని గొని వారందఱకు నుచితభంగిని సత్కారములు సలుప వలసియుండెను. అతఁడు పార్లమెంటుసభాసభ్యులకుఁ దాను వివాహ మాడఁ బోవు చున్నా నని తెలియఁబఱచుటకు నాసభలోఁ బ్రవేశించి వారియంగీకారము నొందవలసియుండెను. అతఁ డాపనుల నన్నింటిని స్వయముగఁ జేసికొనెను. అతఁడు రాజచిహ్నములచే నలంకృతుఁడై పార్లమెంటుసభలోఁ బ్రవేశించెను.

ప్రభువులందఱును లేచిరి. కాని లార్డుచాన్సలరు మాత్ర మతిగాంభీర్యంబునఁ దనయాసనంబునఁ గూర్చుండి యుండెను. ఎడ్వర్డాతని డాయం జని "మేము డెన్మార్కునెడయనిపట్టియైనఅలెగ్జాండ్రాను వివాహ మాడఁబోవు చున్నారము. ప్రభువులందఱును మాకల్యాణసమయమున విచ్చేసి, సమస్తకార్య

ములను కొనసాగింతు రనికోరుచున్నారము.” అను మొదలగు సంగతులు వ్రాసినపత్త్రికను ఆతనిహస్తపల్లవంబున నిడెను. పార్లమెంటుక్లార్కు ఎడ్వర్డునకుఁ గొన్నిప్రమాణవచనములను జెప్పెను. ఎడ్వర్డు వానిని ప్రభువులయెదుట స్ఫుటముగఁ బలికెను. అంత నాతఁడు కారన్వాలుప్రభు వనియును, (Duke of Cornwall) ఛెసరునకుస్వామిఅనియును, (Earl of Chester) కారిక్కునకు నొడయఁ డనియును, (Earl of Carrick) రోథుసేకు నేలిక అనియును (Duke of Rothesay) లంకలప్రభు వనియును (Lord of the Isles) ప్రభువులు సెప్పిరి.

పార్లమెంటుసభాసభ్యులలో రెండుతరగతులవా రుండిరి. ఒకతరగతివారు ప్రాచీనాచారములును, చట్టములును, మేలైనవియును, వానిమార్పఁగూడ దనియును, చెప్పువారు. వీరికి“కంజర్వటీసు” అని పేరు. రెండవవారు ప్రాచీనాచారములలో మే లైనవానిని గ్రహించి, పనికి రానివానిని బోఁ ద్రోసి క్రొత్తవానిని నిర్మించి, వానిని ఆచారమునకుఁ దెచ్చిఇంగ్లండున నుండు సన్నగాండ్రను తమతోసమానులుగఁ జేయుటకు నుద్యమించువారు. వీరికి “లిబరల్సు” అనిపేరు. ఎడ్వర్డు ఈరెండుకక్షులవారిలోఁ జేరక ప్రత్యేకముగ నుండి వీరివాదంబుల నాసభలలో వినుచుండెడివాఁడు. అయిన నాతఁడొకతడవమాత్రము “పెండ్లమును గోలుపోయనవాఁడు చచ్చినపెండ్లము చెల్లెలిని క్రమ్మఱ వివాహము సేసికొనవచ్చును” అనుచట్టము

ను విని ఆమోదించెను. కాని ఇంతకన్న మిన్న యగురాచ పనులలోఁ బసితనంబున నాతఁడుప్రవేశించి పాటుపడినది లేదు.

ఇంగ్లండున నీపెండ్లివారు సమస్తకార్యంబు లొనర్చుచుండ డెన్మార్కు రాజ్యమునందలిప్రజలు తమరాజపుత్త్రిక లోకమునం గలపృథ్వీపతులలో మేటి యని చెప్పఁ దగునెడ్వర్డును బెండ్లియాడఁ బోవుచుండె నని మిగులసంతోషించి ఆకన్నియకు ననేకవిధంబు లగుకానుకలం దెచ్చియిచ్చిరి. అలెగ్జాండ్రా పెండ్లికిఁ దర్లినపుడు తనతోడఁ గూడియాడినబాలికామణులపెండ్లిండ్లకై పెద్దరొక్కంబు నొసంగె. ఆమెవెంటఁ బెక్కుమందిచెలికత్తియలు పయనమైరి. ఆమెను ముందునిడుకొని సమస్తరాజవైభవములతో నాయమ తల్లిదండ్రులును, ఆమెచెల్లెండ్రును తమ్ములును, పెక్కుమంది పరిజనములును, వెంటరా కొనుపనుహేగును వదలి ఇంగ్లండునకుఁ బ్రయాణోద్యుక్తులైరి. వీరిని బరివేష్టించి సేనాసమూహములు ఆయుధపాణులై ఇంగ్లండునకు నేఁగ సమకట్టిరి.

డెన్మార్కునెడయఁడు తమ నెయ్యంపుఁగూఁతును వెంట నిడుకొని 1863 సం. ము ఫిబ్రవరినెల 26 తేదిని కోపనుహేగనువిడిచె. పెండ్లివారు త్రోవలో కోలోనను (Cologne) న నిలిచిరి. అచ్చటనుండిన యాంగ్లేయరాజ ప్రతినిధి తమకు నేలికసాని కాఁబోవు అలెగ్జాండ్రాను దర్శించి స్వాగత మిచ్చి పెండ్లికూఁతు విందొనరించెను. ప్లాకుడర్సు ప్రభువు విక్టోరియా

వియ్యంకుని ఆయనయనుచరులను మిక్కిలి గౌరవించి ఫ్లషింగు (Flushing) అనుతావున నాంగ్లేయుల నావలసేనాసమూహము అలెగ్జాండ్రా ప్రభృతులను వెంటఁ బెట్టుకొని పోవుటకుఁ వేచి యుండి, పెండ్లివారిని లండనుపురిని జేర్చెను.

లండనుపురి థేమ్సునదిగట్టున నున్నది. ఆనదిలో నెల్లప్పుడును నానాదేశనావలు క్రిక్కిఱిసి యుండును. ఎడ్వర్డు తనభావిభార్యను బిలుచుకొని వచ్చుటకు నా నదిలో మంచి యోడయుం డుండెను. అదిబహుభంగుల నలంకృతమై రాజిల్లుచుండె. దాని స్తంభపుఁగొనను వ్రేలాడుజండాలు లండనుపురికి వచ్చెడి యలెగ్జాండ్రానురమ్మని చేపిచు చుండినవో అనురీతిని గాలికి నటు నిటుఁ గదలుచుండెను. అందునంగల యోధులు మిక్కిలి భయభక్తులతో నాయుధపాణులై నదీతీరంబున నిలిచి యుండిరి. జను లనేకులు అలెగ్జాండ్రా ముఖారవిందమును జూడ నచ్చోటికి నేతెంచి యుండిరి. నదిలో నుండినయోడలలోని సామానులను పురిలోనికిఁ గొనిపోవుకూలివాండ్రు తమ తమ పనులు చాలించి మోములెత్తి పెండ్లివారువచ్చు చుండిన చాయ దృష్టి సారించి నిలువఁబడి యుండిరి. దేశీయ బాండువాద్యము "మా రాజును గట్టుకొనుము. ఇదె ఇచ్చట నున్నవాఁడు. మేముమీకుప్రథమస్వాగతము నిటనిచ్చుచున్నారము. రమ్మా మా రాణి!" అని మందలించు చుండెనో అనుభంగిని శబ్దించు చుండె.

డెన్మార్కునుండి లండనుపురికి నేతెంచు చుండినపెండ్లి వారినావ థేమ్సునదీ ముఖద్వారముఁ జేరె ననుసమాచారము ఎడ్వర్డు ప్రభృతులకు నందెను. పిరంగులు "అలెగ్జాండ్రా! రావమ్మా! రావమ్మా మాపురికి" అని పిలుచుచుండె నను లాగున మ్రోగెను. బాండువాద్యధ్వనులు నింగి ముట్టె. లండనుపురి వాస్తవ్యుల కరతాళధ్వనులు జనులచెవులు దూట్లుచేయుచుండెను. ఇంతలోఁ బెండ్లివారు లండను నగరమును డాయం జనుదెంచిరి. ఎడ్వర్డుప్రభృతు లుండిననావనుండి చిన్నపడవ నదిలో నికిడిగి, అలెగ్జాండ్రానుబిలుచుకొనివచ్చుటకు నాయమనావను సమీపించెను. పెండ్లివారిలో ముఖ్యులు అందుదిగిఎడ్వర్డుండిన తావు సేరిరి.

ఓడకడుపున నుండినఎడ్వర్డు ఓడపైప్రదేశమునకు నేతెంచెను. అలెగ్జాండ్రా ఆయనను డాయం బోయెను. అతఁడా రాచపూఁబోడికెం గేలును తనకేలుతోఁ గీలుకొలిపి ముద్దిడుకొనెను. అందఱు గొల్లున నవ్విరి. అనేకులు కరతాళధ్వనులు నింగిముట్టఁ జెలంగఁ జేసిరి. మంత్రిప్రభృతులు ఎడ్వర్డలెగ్జాండ్రాలిద్దఱికమీఁద నన్యోన్యానురాగంబునఁ బ్రవర్తింపుదు రని నిశ్చయించిరి.

రాజ్ఞీప్రధానులును, మతగురువులును, లండను నగర వాస్తవ్యులును, పరరాజ్యప్రభుసమూహములును, సామంత రాజప్రకరంబులును, ఆయుధపాణులైన సేనానిచయంబులును,

నలువై వుల బలిసి కొలువ పెండ్లి వారు నాలుగుగుఱ్ఱంబులు పూన్చినబండ్లపై నెక్కి రాజమార్గంబున రాచకేవిని రాఁ దొడఁగిరి. మేడచివరలమీఁద నుండిన నారీమణులు పూలవానను అలెగ్జాండ్రా ప్రభృతులపైఁగురిపించిరి. శ్రీమంతులుముత్యాలవర్షము నారాజవర్గముమీఁద బోరన వర్షింపించిరి. అనేకులాయాఘట్టములలో వారిని నిలిపి, నానావిధమణులచే నలంకరింపఁబడిన సింగంపుఁ బీఠంబులపైఁ గూర్చుండఁ జేసి వారిని బహుభంగుల గౌరవించిరి. లండను వంతెనచెంగటఁ బూలచే నలంకృత మైన మంటప మొకటి యమరి యుండెను. అందు నెడ్వర్డు అలెగ్జాండ్రాలు విశ్రమింప దివ్య మణిమయోపేతంబు లైన తిన్నెలు వేసి యుండెను. వానిపై నాయా ప్రభువులకు నుచితాసనములు రాజిల్లు చుండెను. వాని నడుమఁ జక్కఁగ నలంకరింపఁబడిన యున్నతాసనములు రెండు చూపఱకుఁ గనుపట్టు చుండెను. లండను పురిపాలకసముదాయము(London Municipal Corporation) ఆయాసనంబులపై నాయా రాజవర్గములు గూర్చుండ నేర్పాటుచేసిరి. అంతనాసంఘమువారు అలెగ్జాండ్రాను బహుకీర్తులసంభావించి, స్వాగత మిచ్చిరి. పెండ్లివారాచోటువాసి, కైతునెస్సుప్రభువు దోలిన ధూమశకటంబుపై విండ్జరుభవనము సమీపించిరి. ఈటను పాఠశాలలోఁజదువుబాలురెనమన్నూరు మంది అలెగ్జాండ్రాను నాయమ తల్లిదండ్రులను సగౌరవంబున తమపురికి విచ్చేయవలయు నని ఆహ్వానము సేసిరి. విండ్జరు

20/8<0



మందిరద్వారమునఁ బుత్త్రిపుత్త్రికాపరివృత యగు విక్టోరియా మహాచక్రవర్తిని తన కోడ లగునలెగ్జాండ్రా నెదుర్కొని వింజరు మందిరాభ్యంతరప్రదేశమునకుఁ దోడ్కొని వెళ్లెను.

పెండ్లిమూరుతముమిక్కిలిసమీపించెను. రాణికి గావలసినచుట్టాలందఱును విచ్చేసి వారి వారి విడిదులలో విడిసి యుండిరి. ప్రిన్సు ఆల్బర్టు వైపునం గలబంధుగులును ఏతెంచి తమ తమ బసలలో వసియించి యుండిరి. సమస్తదేశాధిపతులాయాస్థానంబుల యందుండిరి. వారందఱును ముహూర్తదినంబునవధూవరుల వెంబడిఁ జనుదేర సర్వవిధంబుల నలంకరించుకొనికట్టాయితంబై యుండిరి. రాణి రాజ్యములయందలి సేనానాయకు లశ్వారూఢులై ఆయుధములఁ గేలం గొని రాజమార్గములయందు పారా లిచ్చు చుండిరి.

డెన్మార్కు పృథ్వీతనయ అలెగ్జాండ్రాకుఁ జెలికత్తియలు పరిమళోపేతంబగు నుష్ణోదకంబున స్నానంబుఁ గావించి, సర్వవిధంబుల నలంకరించిరి. ఒకచేడియ నాయమకు భూషణంబుల నందించెను. ఇంకొకతె వాని నామె మేనిపైఁ దొడిగెను. వేఱొక్కతె ఆతరుణీమణి నీలాలకములు చిక్కు దీసి పూలు దురిమి ముడిచెను. వెండియు నొక్కతె ఆకాంతాలలామంబునకు దివ్యపట్టువస్త్రంబులు కట్టఁబెట్టెను. ఒండొక్కతె నానావిధము లైనపూలు కట్టిన పూబంతి నా యలెగ్జాండ్రా పాణి

పల్లవంబునఁ బెట్టెను. ఆమె దానిం గొని ఎడ్వర్డు పాణిగ్రహ ణము సేయ మిక్కిలి తమకంబున నుండె.

ఎడ్వర్డు సమస్తరీతుల నలంకరించుకొని, అలెగ్జాండ్రా పాణికమలంబుఁ జేఁబట్ట నువ్విళ్లూరు చుండె. ఆయన పినతండ్రి సాక్సుగోబర్గు గోతాప్రభువును, ప్రష్యా రాజ్యాధిపతి పెద్దకు మారుఁడును, ఆతనివెంటఁ జనుటకు నియమితులై యుండిరి. అతఁడును సమస్తరాజచిహ్నములు ధరియించి, జగములనుండు పూఁబోడుల నలపించునభినవమన్మథమొలక యోయనురీతి నొప్పారుచుండెను.

పెక్కుమంది సెయింటుజార్జిచే పలునకుఁ బయనమై ముందు నడిచిరి. జనంబులు రాజమార్గంబులం దిరుకెలంకుల గ్రిక్కిఱిసి యుండిరి. అనేకులు మేడలపై నిలిచి వధూవరుల వీక్షింపఁ గౌతూహలాయత్తచిత్తులై యుండిరి. జనులనే కులు తావు చిక్క దని సెయింటుజార్జిచేపలును బడంద్రో యుదురో అను భయము జనించుభంగిని గుంపులుగూడి దానిఁ జుట్టుముట్టి యుండిరి. ఆగుడిలోనికిఁ బోనర్హులైనవారు ముందుగ నేఁగి వారివారికి నమర్చిన యుచితాసనంబుల నధి ష్ఠించిరి.

రాణి జలకంబు లాడి మంచియుడుపులు ధరియించి దేవాలయమునకు నేఁగ నుద్యుక్తురాలై యుండెను. నష్టభర్తృ కియగుట చే నాయమ యందఱవెంట బో నొల్లక మున్ముం

దుగనేఁగి గుడిలో మతగురువు నాసనంబునకు నుత్తరపుఁజాయ నమర్చిన గదిలో నున్న తాసనంబునఁ గూర్చుండి తనయునివైవాహిక క్రియలు నడుచుటను జూడఁ గోరు చుండెను.

పెండ్లికూఁతువంకవా రొకచాయనుండిఁ గుడిఁ బ్రవేశించిరి. మంత్రులు మహారాజులు ము న్నగువారు రాజు పెండ్లిని గన విచ్చేసిరి. ఎడ్వర్డు ఒకబండిలో నెక్కెను. తోడియల్లుండ్రు ఆయన కిరు కెలంకులఁ గూర్చుండిరి. ఆయనబండి మ్రోల సాయుధులైనపరిజను లశ్వంబులనారోహించి ముందుఁ జను చుండిరి. ఠాణాదారులు సామాన్యజనులను జేర నియ్యక దూరమున నుండుఁడని బెత్తంబులచే వారితలలపై నాడించు చుండిరి. అలెగ్జాండ్రా వేఱొకబండి నెక్కి కడలిబిడ్డ వెన్నునిఁ జెందఁ బోవుపగిదిఁ గనుపట్టె. ఆమె చెలికత్తియ లామె కెలఁకుల నుండిరి. ఇటుల నారాజవధూవరులు మెల్లగ రాజవీథిని శివిగఁ జని దేవాలయమును బ్రవేశించిరి. జనులయానందమునకు మేర లేదు. వారు తమసంతోషముఁ బెక్కుతెఱంగుల నెఱింగిచిరి. కొందఱు చప్పట్లు తట్టిరి. మఱికొందఱు కోలాహల ధ్వనులు నింగిముట్టఁ జేసిరి. భేరీమృదంగాది వాద్యములు మ్రోసె. వందిమాగధులు రాజుబిరుదులను బాడి కీర్తించిరి. అప్పుడా కోవెలచుట్టు నిసుక వేసిన రాలనంతజనసమూహము లానమయంబున నుండిరి.

ఇంతలో ముహూర్తకాలము సమీపించెను. చప్పుడడం

గెను. గుడి నుండినజనులు మాటలాడక మౌనమును ధరించినవారై ఎడ్వర్డు నలెగ్జాండ్రాను గాంచు చుండిరి. అలెగ్జాండ్రా లజ్జావనతవదనయై మతగురువునెదుటఁ జని నిలిచెను. ఎడ్వర్డు ఆమెయోర నిలఁబడెను. మతగురువు లేచితనహస్తంబును వధూవరులశిరస్సుపై నిడి కొన్నిమంత్రంబులు పఠియించి, ఎడ్వర్డును, అలెగ్జాండ్రాను, గొన్నిప్రశ్నల నడిగెను. ఎడ్వర్డు స్పష్టముగఁ "జేయుదును." అని వాక్రుచ్చెను. ఆయంగనయుఁ జిఱునగవు మోమునెలఁ గులుకు లాడ సన్నపుటెలుంగునఁ బల్కెను. ఆమెమాటలు దాపున నుండినవారికిఁగూడవినంబడ లేదు. డెన్మార్కురాజు తనతనయను ఇంగ్లండుప్రభువు కొఱకు ఇచ్చెను. ఎడ్వర్డారాణిపాణికమలమును గేలఁ గీలుకొల్పెను. పెండ్లికూఁతును కుమారుఁడును, సభాసభ్యులయెదుట నిలుచుటకుఁ బూర్వము ఉన్నతాసనంబు నలంకరించిన విక్టోరియా పాదకమలంబులకుఁ బ్రణమిల్లిరి. "చిరంజీవులై జనుల నాయనంతరము చల్లగఁ బ్రోతురుగాక" అని ఆరాజగృహిణి ఆశీర్వదించెను. ఆవల నారాజదంపతులు సభ్యులచాయఁ దిరిగి, వారికి నతు లొనర్చిరి. వారును కరతాళధ్వనులు చెలంగనాశీర్వదించిరి.

అలెగ్జాండ్రా తల్లియును, సోదరీసోదరజనంబులును తమతోడఁ బుట్టినది తమ్మునేడఁ బాసి చనుచుండె నని శోకపూరితనయనులైకనుపట్టిరి. డెన్మార్కు ప్రభువు ధీరుఁ డయ్యును

నెయ్యంపుఁబట్టి నన్యునకు నొసంగునపుడు, అతనిధైర్యము నీరై ఆతనినేత్రము లనుతూములగుండ పొర్లి పొర్లి రాసాగెను. వీరివంకవారు తమజేనియుమ్మలికంబు నుపశాంతించుటకు నాతని నోదార్చుచుండిరి. అలెగ్జాండ్రాతండ్రిమోమ్ముం గాంచి విస్మయ దుఃఖాక్రాంతస్వాంతయై తననాథుని వంకవారిచాయఁ జూచెను. ఎడ్వర్డుతోఁబుట్టువులు తమయన్నదమ్ముల విడనాడి పరచేడియ ను జేఁబట్టె నని లోచనకమలంబులంనుండి వేడినీరు పొంగిపొంగి దొర్లుచు వచ్చుచుండ దుఃఖించిరి. వారు తమదుఃఖంబు నన్యు లెఱుంగకుండుట కై తమవదనవనరుహంబులఁ బూఁబంతులచేఁ గప్పుకొనిరి. పెండ్లికి వచ్చినవారిలోఁ గొలఁదిమందిమాత్రము వారిని జూచి పశ్చాత్తాప పడిరి.

డెన్మార్కుప్రభువు తనముద్దుబిడ్డను, ఎన్నినాళ్లు పెంచి నను, ఆకన్నియ పొరుగింటిబిడ్డయే అని తలంచి; కన్నీరుఁ గొన గోటఁ జిమ్మివైచి యల్లునకును, కూఁతునకును, నానావిధము లైనకానుకలను సమర్పించెను. అపరంజిమయంబు లగు పైడి గిన్నెలును నవరత్నఖచితంబు లైనభూషణంబులును, వెలలేని దివ్యాంబరంబులును, ఇంగ్లండు మహారాణి వియ్యంకునకు సమర్పించెను. ఈరీతిని నాపెండ్లివారానందాబ్ధిని మునిఁగి తమ తమరాజ్యంబులకు నేఁగ నుద్యుక్తు లై యుండిరి.

పెండ్లికి వచ్చినపరరాజనికరంబు లెడ్వర్డలెగ్జాండ్రా లకు బహువిధంబులఁ గానుక లిచ్చి, తాము తమరాజ్యములకుఁ

జనుటకు రాణియనుజ్ఞ వేఁడిరి. ఆమె వారందఱకుఁ దగురీతిని గౌరవములు సలుప వలసిన దని మంత్రులకుఁ గట్టడ నొనర్చె. వారును ఆ యారాజులను వారివారికి సర్హములైన మార్గముల సత్కరించిరి. ఆభూధవులు రాణిసెలవు వొంది నిజదేశగమనో న్ముఖు లైరి. నూతనరాజదంపతులు ప్రజలకు ననురాగవర్తను లై పెండ్లి యైనయొకసంవత్సరపర్యంతము ప్రతిదినమునను విందులు గుడుచుచు సుఖం బుండిరి.



## అయిదవ యధ్యాయము.



### ఎడ్వర్డలెగ్జాండ్రాల నూతన దాంపత్యము.

విక్టోరియా భర్తను గోలుపోయినదిమొదలు రాజకీయ వ్యవహారములలోఁ దాను ప్రవేశింపక తనకుమారరత్నమును అందుఁ బ్రవేశింపఁ జేయు చుండెను. అందువలనఁ బరదేశ రాజులుగాని, రాయబారులుగాని రాణిని జూచుటకు వచ్చి నపుడు వారికిఁ జేయవలసిన గౌరవము లన్నింటిని ఎడ్వర్డు చేయు చుండెడివాఁడు. అతనికిఁ బరిణయం బై కొన్ని దినము లయ్యె. లండనునగరంబునను, ఇంగ్లండులోను, గొప్పగొప్ప పట్టణంబులయందును, ఉండుశ్రీమంతులు ఈనూతనరాజదంపతు లైనయెడ్వర్డలెగ్జాండ్రాలను తమతమయునికిపట్టులకుఁ బిలుచు కొనిపోయి వారికి యథాశక్తిని మర్యాదలు సలుపు చుండిరి.

అతఁడు భార్యామణితోడ నాయాతావులకు వెళ్లి వార లిచ్చు నాతిథ్యంబులు గొని యింటికిఁ జేరు చుండెను.

"రాయల్ అకాడమి" (The Royal Academy) అను విద్యాలయాధిపతులు తాముచేసెడివిందుఁ గుడువ ర మ్మని ఎడ్వర్డుఁ బిలిచిరి. అతఁడు పరివారసమేతుఁ డై వారియాల యమునకు వెళ్లి వారలు తనకుఁ జేసినమర్యాదలకు సంతుష్ట హృదయుం డై వారియెడఁ దనకుఁ గలయనురాగంబును, దేటఁ బఱుచుచు సమంజసంబు లైనకొన్నిమాటలు ప్రసంగించి యందఱమనంబుల నాకర్షించుకొనెను. అప్పు డాతఁడు పెద్దల యెడభ క్తియును, చిన్నలయెడఁ బ్రీతివిశ్వాసములును, గనఁ బఱుచుచు నందఱకును హితమతియై ప్రవ ర్తించె నని "రాయల్ అకాడమి" అధిపతి యైనసర్ చార్లస్ ఈస్ట్ లేక్ అనునాతనిభార్య వచించి యున్నది.

ఎడ్వర్డు ఆంగ్లేయభాషాయోషాభిమానుం డై పండిత కవుల నాదరించుచు నుండువాఁడు. ఆయకాడమిమందిరంబున "తాకరి" (Thackery) అనుపండితకవీశ్వరుఁడు కూడ ప్రసంగిం చెను. అతఁ డావలఁ గొలఁదిదినములఁ కె స్వర్గస్థుఁ డయ్యె. ఎడ్వ ర్డాపండితసింహునిమరణము తనరాజ్యమునకు గొప్పనష్ట మని యును, ఆకవి విద్వాంసు లై యుండి బీదఱికముచే శ్రమపడు కవీశ్వరులకు నన్నివిధాలఁ దోడుపడు చుండెడివాఁ డనియును, తాకరి మేలిగొనంబుల నుతించి పలికెను.

ఇంగ్లాండులో "ఆక్సుఫోర్డు" అనుపట్టణము కలదు. అది సర్వకళాశాలలకుం బేరు వహించి యుండును. అందు ననేక శాస్త్రములు పెక్కు-దేశములయందుండి వచ్చినవిద్యార్థులు నేర్చుకొను చుండెడివారు. అచ్చటికళాశాలాధిపతులు ఎడ్వర్డులెస్గాంద్రులను ఆహ్వానము చేసిరి. ఆరాజదంపతులు సపరివారులై ఆక్సుఫోర్డునకు వెళ్లిరి. ఆచోట నుండువిద్వాంసులు వారిని బహుభంగుల గౌరవించి"డాక్టరు ఆఫ్ సివిల్ లా" (Doctor of Civil Law) అనుబిరుదు నెడ్వర్డునకు నొసంగిరి. ఆరాజదంపతులాతావు వాసి తమపొందుపట్లకు నేతెంచిరి.

ఎడ్వర్డు తనగృహిణితో మారల్బరోభవనంబున నివసింపసాగెను. అతండు తనయింటికిం జనుదెంచుచుండెడువారికి నప్పుడప్పుడు విందులు సేయు చుండెను. అలెగ్జాండ్రా తనభర్తతో నత్యుల్లాసంబునం గాలము గడుపు చుండ నాతరుణీమణి కాలక్రమమున గర్భమును ధరించెను. అత్తగారైనవిక్టోరియా తనకోడలి తొలిచూలున మగబిడ్డ పుట్టుం గాక అని కోరుచుండెను. ఇంతలో నాయలెగ్జాండ్రా సుదతీమణికి నవమాసములు నిండెను.

1865 సం. న జనవరి నెలలో నొకి నాంటిసాయంత్రంబునం బూర్ణగర్భిణి యైన అలెగ్జాండ్రా వింజరునగరునకుం జెంగట వర్జీనియాసీటీపైం బడవలో సికారి చేయు చుండెను. అప్పుడుతుక సాయంసమయంబున నాపడవలో నొకమగనిసువును

గనెను. విక్టోరియామనోరథము సంపూర్తియాయెను. వెంటనే బాలెంతరాలును, బిడ్డడును, మార్లబరోమందిరంబుఁ బ్రవేశించి, ఆరోగ్యవంతులై వర్ధిల్లుచుండిరి.

డెన్మార్కురాజు తనతనయ మగబొట్టెను గనె నని విని మిక్కిలిసంతోషించి బీదలఁ బెక్కుతెలుంగుల నాదరించి వారికి నన్నవస్త్రదానంబులు సేసెను. విక్టోరియాకూడ తనకు మనుమఁడు జన్మించె నని మిగులనానందంబు నొంది బీదలకుధర్మంబుల నాచరించెను. "క్లారెన్సుప్రభువు" (Duke of Clarence) పుట్టినప్పుడు అలెగ్జాండ్రాకు దాదాపు వయస్సు ఇరువదేండ్లు. ఆమెయు అత్తగారిమాడ్కిఁ జిన్నవయస్సున నే బిడ్డలను గని పెంచుటలో మిక్కిలియోర్పుకలదై రాచకార్యంబుల నంతఁగఁ బాటింపక కోంకకుసుఖంబే తనసుఖం బని తలంచి యుండెను.

డెన్మార్కు రాజ్యమునకును, ప్రష్యా రాజ్యమునకును, గొప్పపోరు నడిచెను. అనామధేయుఁ డెవఁడో ఒకఁడు డెన్మార్కురాజు రణరంగంబునఁ బరాభవంబు నొందె నని అలెగ్జాండ్రాతో మందలించెను. ఆమె కన్నీరు మున్నీరై పాలదుఃఖింపఁగడంగెను. ఎడ్వర్డు తనరాణియుమ్మలికంబు పాప నుద్యమించి, ఆసమాచార మెంతవఱకు నిజమై ఉండనోపు నో అని విచారింపసాగెను. ఇంతలో నొకానొకఁడు డెన్మార్కుప్రభు వే గెలిచె ననుమాటను అలెగ్జాండ్రాచెవిని బడవేసెను. ఆమె తన మనోవ్యథను తొలఁగఁ జేసికొని, వికసితకమలవదన యయ్యె.

లండను పురమున వైద్యశాల ఒకటి నిర్మింపఁబడి యుండెను. కాని దానిపడమటిచాయ నొకనూతనభవనము కట్టవలసి యుండెను. ఎడ్వర్డు దానికి నస్తిభారమును వేసెను. అలెగ్జాండ్రా ఆయనవెంబడి వెళ్లి ఆకార్యము ముగియు వఱకు నచ్చోట నుండెను. ఆవైద్యాలయంబున, యూధులకు ప్రత్యేకముగఁ గొట్టులు ఏర్పడి యుండెను. ఆరాజదంపతు లాయేర్పాటునకు మనంబునఁ బ్రహర్షంబు నెందిరి. ఒకనాఁడు వారిద్దఱును, హైలంపుభూములఁ జూడ వెళ్లిరి. వా రాతావులఁ గొన్నినా ళ్లుండి తమపురికి మఱలి వచ్చిరి.

1865 సం. న ఎడ్వర్డు, అయిర్లండులంకకు వెళ్లెను. అచ్చట నాయువరాజు డబ్లినునగరంబునఁ బ్రదర్శనశాలను దెఱచెను. ఆసంవత్సరమున అలెగ్జాండ్రా చూలాలై యుండి మే నెలలో ఇప్పటి మనప్రభు వైనజార్జిని గనెను.

వివాహ మైనపిమ్మట ఎడ్వర్డును, ఆయనభార్యయును, ఒకతావున నే నివసించు చుండుట లేదు. వారు కొన్ని వేళల యందు మార్లబ్రోమందిరంబున నుండిరి. మఱికొన్ని సమయంబుల సాండ్రింగ్ హాముభవనంబున నుండిరి. ఒకనాఁటిరేయి సాండ్రింగుహాముగృహంబున దాదు లుండినగదికి ని ప్పంటుకొనెను. ఆగదికి నగ్గితాఁగుటకుఁ గొన్ని నిముసములకు ముందు, అలెగ్జాండ్రా తనయుద్దఱుబిడ్డలను రెండుచంకల నిడుకొని వేఱొకయరలోఁ బరుండఁ బోయెను. ఎడ్వర్డు మంటను జూచి

దాని నార్పుటకు వెంటనే ప్రయత్నించెను. అతఁ డాజ్వాలను ఆర్పునపుడు, మంట ఆతని జుట్టుకొనెను. అతఁడు దానిని దాఁటి యావలికి వచ్చినపు డాతనికిఁ గొంతచెఱుపు కలిగెను. కాని అయ్యది ప్రాణోపద్రవ మైనది కాదు. అచ్చట నిప్పు రగులుకొనుటకుఁ గారణ మిది యిత్థ మని ఎవ్వరును ఊహింప లేరైరి. భగవత్కృపాకటాక్షమహిమచే నామంట ఆరెను. ఎవరికిని దానివలనఁ జేటు కలుగ లేదు. తదాదిగి నెడ్వర్డు లండనునగరమున నేతావున నైన నిప్పుమంటఁ జూచె నేని, అతఁడు రహస్యవర్తనంబున నాతావునకు వెళ్లి దాని నార్పు చుండెడివాఁడు.

పీటర్బైస్సనుతావునకు నెదుటఁ బెద్ద పొగయోడ నూతనముగ నిర్మింతమై యుండెను. ఎడ్వర్డు దానిఁ జూచి వచ్చుటకు వెళ్లెను. అట నుండినయింజినియర్లు ఆతనిని మిక్కిలి గౌరవించి పొగయోడను నిర్మించుపద్ధతిని, ఆయనకుఁ జెప్పిరి. అతఁ డాయోడసొబగును, దానిదిట్టతనమును, జూచి యానందభరితచిత్తుఁడై యింటికి వచ్చెను.

విక్టోరియా తనభర్త పరలోకగతుఁడైనది మొదలు రాచకార్యములు సేయక చింతాక్రాంత యై ఉండెను. ఎడ్వర్డును దనతండ్రిచావుచేఁ దనకును, దనతల్లికిని, కలదుఃఖమును పలుతెఱంగులఁ బలుచోట్ల సమయమువచ్చినపు డంతయును వాక్రుచ్చి, ఆతని సద్గుణజాలంబుల బ్రశంసించుచుండెడివాఁడు.

అతఁడు తనతండ్రిజ్ఞాపకార్థమై ఫ్రాగ్మోరనుచోటఁ గట్టిన భవనమునకు రూ 1,5,0000 లను ఇచ్చెను.

1866 సం. న జర్మనిదేశమునకును, ఆస్ట్రియారాజ్యమునకును, జగడము నడిచెను. ఎడ్వర్డు ఏదేశము గెలుపు చెందునో అని మిక్కిలితమకంబున మార్ల్బరోభవనంబున నుండి ఆ రణభూమివృత్తాంతంబుల నారయుచుండెను. ఫ్రెంచివారికిని, ప్రష్యారాజ్యమువారికిని, జరిగినరణంబునను, రష్యాదేశస్థులకును, టర్కీవారికిని, నడచినయుద్ధమునను, ఆయాయుద్ధములయందలివృత్తాంతంబులను ఎడ్వర్డు విచారించుచుండెను.

బైబిలును బోధించుసంఘమువారు, లండనునగరంబున నొకమేడను గట్టిరి. ఎడ్వర్డు దానికి నస్తిభారపురాతిని నాటెను. అప్పు డాతఁడు, ఆసంఘమువారు, స్వసౌఖ్యలాభములను దిగనాడి అన్యులదుఃఖములఁ దొలఁగింప నన్యదేశములలోఁ బాటుపడువారనియును, తనతాత కెంటుప్రభు వెల్లకాలంబుల నా సంఘమువారిని బ్రశంసించుచుండె ననియును, మున్నగువాక్యంబులు సెప్పి, తాను ఏసునాథుఁడు నడిచిన మార్గంబున నే వర్తింతు నని మందలించెను.

ఎడ్వర్డును, అలెగ్జాండ్రాయును తమకుమారులను వెంటఁ బెట్టుకొని, డన్రోబినులో నుండినసదర్లెండుజమీందారుని జూడ వెళ్లిరి. "ఆర్గొడ్డే" అను స్థలమువఱకె రైలుమార్గముండెను. ఆరాజదంపతులు బండ్లపై డన్రోబినుకు వెళ్లిరి. త్రోవ

లోఁ బ్రజలు రాజదంపతులను జూచి ప్రమోదమును జెందిరి. డర్బోబిను జేరఁగానే అచ్చటిజమీందారుఁడు ఎడ్వర్డలెగ్జాం డ్రాలకు సకలమర్యాదలు సలిపెను. వారాతావునఁ గొన్ని నాళ్లుండి, జమీందారుని అనుమతిని ఇంటికి జనుదెంచిరి.

డెన్మార్కురాణి తనబిడ్డలను వెంట నిడుకొని ఇంగ్లండు నకు నేతెంచెను. ఎడ్వర్డును, అలెగ్జాండ్రాయును, ఆయమను మిగుల గౌరవించి, చిఱుతలను ముద్దాడి వారికి విందు నొసఁగిరి. ఆరాణి తన తనయకడఁ గొన్నాళ్లుండి ఆవలఁ దనరాజ్యమున కు నేఁగెను. ఎడ్వర్డు రుష్యాప్రభువునకు జరిగినపెండ్లి వేడుకల జూచి వచ్చుటకు వెళ్లి, ఆరాజ్యమునఁ గొన్నిదినము లుండి తనదేశమునకు మఱలెను. తదాదిగ నాతఁడు ఆదేశము నెడ సద యుఁడై వర్తిల్లుచుండెను.

1866 సంవత్సరాంతమున అలెగ్జాండ్రా గ్రమ్మఱ గర్భ మును ధరించెను. ఈమూఁడి ఫిబ్రవరి నెల 20 వ తేదిని ఆయమకు నొకయాఁడుబిడ్డ పుట్టెను. అప్పుడారాణిదేహము మిక్కిలిజబ్బు పడెను. అంత నామె తల్లిదండ్రులు తమగారాబుఁబట్టిని జూడ వచ్చి ఇంగ్లండునఁ గొన్నిదినము లుండిరి. ఎడ్వర్డు, రాచకా ర్యము లెన్ని సేయవలసి యుండినను, భార్యదేహము కుదు టఁ బడువఱకు నాయమను విడిచి వేఱొండుచోటికి వెళ్లినవా డుకాఁడు. ఇంతలో దేవుని కృపామహిమాతిశయమువలన నా యమరోగము కుదిరెను. కాని ఆమె ఆసంవత్సరము జూలై

నెలయంతమువఱకు కదలమెదిల నేరక ఇంటిపట్టున నుండెను. ఆ సంవత్సరాంతమువఱకు వారిద్దఱును,ఏచోటికి వెళ్లక ఉండిరి.

ఎడ్వర్డు భార్యాసమేతుఁడై అయిర్లండునకు వెళ్లెను. అచ్చటఁ బ్రజలు తమరాజభక్తి పెక్కుతెఱంగులఁ గనఁబఱచుచు, వారిని మిక్కిలి గౌరవించిరి. ఎడ్వర్డాలంకలో నొక తావు ననే ఉండలేదు. ఆరాజ్యమున దొడ్డవారు ఆయనను బిలిచి విందులు సేసిరి. అతఁ డొకచోట నాడవలసి యుండెను; వేఱొకస్థలమున ప్రజ లొసంగునాతిథ్యంబుఁ గొనవలసి యుండెను; ఇంకొకతావునఁ బుస్తకభండారంబులను, సర్వకళాశాలలను, పాఠశాలలను, బరీక్షింపవలసి యుండెను. జనులు తమకొఱఁతల నివారింపుఁ డని వేఁడిన వేఁడికోలునకు సహేతుకము లైనప్రత్యుత్తరము లియ్యవలసి యుండెను. అతఁ డీరీతులఁ దనయిల్లాలితో అయిర్లండున నుండి, తనదేశమునకు విచ్చేయునపు డుత్తరవేల్సుభూమికి వెళ్లెను. అచ్చట జను లారాజదంపతులం గాంచి హర్షంబు నొంది, వారికి నాతిథ్యం బొసంగిరి. ఎడ్వర్డు ఆజనుల మిక్కిలి సంతోష పఱచి భార్య వెంటరా నింటికిఁ గ్రమ్మఱ నేతెంచెను.

1868 సంవత్సరము జూలై నెల 6 వ తేదిని అలెగ్జాండ్రా చూలాలై యుండి, రెండవకూఁతుఁ బ్రిన్సస్ విక్టోరియాను గనెను. కొన్ని నెలలవఱకు నారాజదంపతు లిగ్లండున నుండి యావల నైరోపాఖండ మంతయుఁ దిరుగ వెళ్లిరి. వారు తొలు

దొర్లు ఫ్రెంచిరాజ్యమునకు వెళ్లి పారిస్సునగరంబునఁ గొన్ని రోజు లుండిరి. ఫ్రెంచిదేశపుటడవులలో నాదేశపురాజును, ఎడ్వర్డును, ఇంకను పెక్కుమంది వెంట రా వన్యమృగంబుల వేఁటాడఁ బోయిరి. ఏడ్వర్డొకవైపున మెకంబుల గుఱి వెట్టి కాల్చు చుండ నాయనపైకి నొకకౄరమృగం బుఱికెను. కాని ఆతఁడు దానివలనఁ గీ డెంతమాత్రమును బొందఁడయ్యె. లక్ష్మీకళత్రాంశసంభూతు లైనమహావీరులకు నెప్పు డైన దోసఁ గు పొసఁగు నే? ఆవల నారాజదంపతులు డెన్మార్కురాజ్య మునకుఁ జనుదెంచిరి. అచ్చట నలెగ్జాండ్రా పుట్టినదినమహోత్సవమును డెన్మార్కుప్రభు వతివైభవమున నడిపించెను. ఎడ్వర్డలెగ్జాండ్రా లారాజ్యమును వదలి జర్మనిరాజ్యంబునకు నేఁగిరి. జర్మనిదేశయువరాజు ఎడ్వర్డుబావ. అతనితండ్రి వీరల మిగుల గౌరవించెను. వా రాచోటు వాసి, అస్ట్రియారాష్ట్రమునకుఁ బోయి, ఆదేశపుచక్రవర్తి సేసినసపర్యలు వొంది, వా గొసంగు విందులు గుడిచి, తమదేశమునకు విచ్చేసిరి.



## ఆఱవ యధ్యాయము.



### అన్యదేశాటనము.

అమెరికాలోఁ గెన్నడారాజ్యంబున నుండుప్రజలు క్రిమియాలో నడిచినయుద్ధమునకు వలయుశూరులను తమరాజ్యము

నుండి పంపి, ఇంగ్లీషురాజునెడఁ దమకుఁ గల రాజభక్తిని వెల్లడిపఱిచి యుండిరి. అప్పుడు వారు ఆదేవేరిని స్వయముగ వచ్చి తమదేశమును జూచి వెళ్లవలయు నని వేఁడిరి. కాని ఆయమ దూరప్రయాణము తనదేహమునకు నిబ్బరసేయు నని యెంచి వచ్చుటకు వీలు లే దని వారికిఁ దెలియఁ జేసెను. వా రంతట రాణి వచ్చుటకు వీలు లేకుండినను పోఁగాక రాణికుమారులలో నొక్కని దమరాజ్యమును బాలింపఁ బంపు మని ప్రార్థించిరి. అందుల కాయిల్లాలియ్యకొన నొల్లక, ప్రిన్సు ఆఫ్ వేల్సును బంపెద నని వారికిఁ జెప్పి వారిని సమాధాన పఱిచెను.

రాణి తనమాటను మఱవక తనకుమారుఁ డైనయెడ్వర్డును కెన్నడా రాజ్యమునకుఁ బంప నిశ్చయించుకొనెను. సంయుక్తరాష్ట్రీయ ప్రసిడెంటు రాణికుమారుఁడు కెన్నడా రాజ్యమునకు రాఁబోవు నని విని ఇంగ్లండుదీవిరాణి తనయుండు తనరాజ్యమునకు వచ్చి తా నిచ్చునాతిథ్యంబు గొని పోవుటకు రాణిసెలవు గోరెను. రాణి అందులకు సమ్మతించి కొడుకు ఆ రాజ్యమునకుఁ గూడపోవలయు నని ఏర్పాటుచేసెను.

ఆల్బర్టు తనకొడుకు పసివాఁ డనియును, రాజ్యతంత్రంబులయందుఁ జక్కఁగ మెదిగినవాఁడు కాఁ డనియును, కెన్నడా రాజ్యమునందలిప్రజ లచ్చటఁ దనతనయుని అనేకవిషయంబులు ప్రశ్న వేయుదు రనియును, వానికి నాకొండిక వారిమనస్సు

తృప్తి పడుకీతిని బదులు చెప్పవలసి యుండు ననియును, వా రి సుగుణసంగతుల స్వభావములఁ గొన్నింటి నూహించి వానిఁ బ్రత్యుత్తరములను వ్రాసి యిచ్చుటకును, వాని నాతనికి నేర్పు టకును, దగినవారి లాతనివెంటఁ నేఁగుటకుఁ గొందఱ నియ మించెను.

ఎడ్వర్డును, అతనివెంటఁ బోవ నియమించినరాజ్యతంత్ర నిపుణులును, సేనలును, ఇంక ననేకులును, ఆరాజ్యమునకుఁ దరలిరి. ఓడ సముద్రముపై బిరబిర నడిచెను. వారలకు ననుకూలముగ గాలి వీచెను. ప్రయాణము నడుచు చుండినపుడు ఎడ్వర్డు చిన్నవాఁ డయ్యును, నావయాత్ర దీర్ఘకాలము సేసిన చిఱుతకానందమున సముద్రమున నివసించెడిజలపక్షులను జూచు చు, సముద్రతరంగింబులధ్వని విని యానందించుచు, ఇంతకుఁ బూర్వము సముద్రమునఁ బయనము సేసి యందుఁ బర్వతం బులఁ దాకి మునిఁగినయోడలోనిజనంబుల దుర్మరణంబుల నాల కించి వారలయెడఁ దనకు గలిగినపశ్చాత్తాంబు గనఁబఱచుచుఁ బ్రయాణము సలిపెను. 1860 సం. న జూలై నెల 24 వ తేదిని ఎడ్వర్డుప్రభృతులు న్యూఫౌండ్లెండుదీవికి రాజధాని యైన సెంట్ జాన్ అనునగరమున నుదయమున నోడ దిగిరి. నాఁ డాచోట వర్షము వర్షించు చుండెను. రాజకుమారుఁడు రాఁగానే ఇంగ్లం డుతాఁ వచ్చినాఁ డని యెంచి, సూర్యుఁడు మేఘములఁ బోఁ ద్రోచి తూర్పుమెట్టు మనోహరంబుగ వెలుంగసాగెను. సెంటు

జాను లోని ప్రజలు గుంపులుగూడి ఎడ్వర్డును గనుటకు విచ్చేసి యుండిరి. వా రాతనిఁ గాంచి, చేతులు దట్టి, అనేకభంగుల నా తనిఁ జూచినందునఁ దమకుఁ గలిగినయానందంబును దెలియఁ బఱచిరి.

ఎడ్వర్డు కన్నడా రాజ్యముఁ బ్రవేశించెను. అందలిజను లాతనిరాకకై చాతకపక్షి మేఘముల రాకకై వేచి యుండు విధంబున నిరీక్షించు చుండిరి. అతఁ డారాష్ట్రమునఁ బయనము సేసిన చోటులం దంతట నెచ్చటఁ గాంచినను, వేనవేలజనులు క్రిక్కిఱిసి ఆయన ముఖకమలమునుఁ జూడఁ బైపయింబడు చుండిరి. పట్టణంబులలో రాజమార్గంబులు పచ్చనితోరణంబు లచే నలంకరింపఁబడుట సహజము. ఒకయూరినుండి ఇంకొక యూరికి నాతఁడు వెళ్లినదారులకు ఇరువంకలఁ బూలవృక్షలతా గృహంబులును, పచ్చని ఆకుతోరణంబులును, అమరి ఉండుట అబ్బురంబు గాదె? అవి దారి నడుచుబాటసారులయుల్లంబుల రంజింపఁ జేయు చుండెను. అతఁ డాదేశంబునఁ గ్రుమ్మరు చుండి నపుడు రేలు పవల్లె ద్వాదశా దిత్యు లేవేళం బ్రకాశించు చుండిరో అనుభంగిఁ గన్పట్టె.

అమెరికా రాజ్యంబున "నయగారా"అను కొండశిఖరం బులపై ప్రదేశంబులనుండి గంగ భూమిమీఁదికి మిక్కిలిలావుగాఁ బడుచుండును. అది చూడ నింపుగ నుండును. ఎడ్వర్డు దానిని జూడవలయు నని కోరెను. కన్నడా దొరతనమువారు ఆతఁ

డచ్చోటికి వెళ్లుటకు గుఱ్ఱముల నేర్పాటు సేసిరి. అతఁడాగుఱ్ఱంబులమీఁద నెక్కి యాతావుఁ జేరి, నయగారా యాకాశగంగను జూచి విస్మయప్రమోదభరితచేతస్కుండై "ఇట్టిది ప్రపంచమున నెక్కడనైన నుండు నే?" అని అచ్చెరువొందు చుండెను. ఆమఱునటి దినమున "బ్లోండిన్" అనుపేరుగల యొకఁడు నయగారానదికి నడ్డముగఁ గట్టి యుండిన మోకుపై నిర్భయముగ నెడ్వర్డుమోల నడిచెను. ఎడ్వర్డు వానిని గాంచి వాఁడు నీటఁ బడి మృతి నొందునేమో అని వెఱఁగందు చుండెను. కాని వాఁడు దాని దాఁటి యెడ్వర్డును సమీపించెను. రాచబిడ్డఁడు వానిని జూచి, "అబ్బ ప్రాణముతో వచ్చితి వే? నీవు త్రాటిపై నడుచు చుండినపుడు నామేనఁ బ్రాణములు నిలువవయ్యె. నీవెట్లుంటివో? నీ వొకవేళ నీటిలోఁ బడి మునిఁగి "నదీనాంసాగరోగతిః" అగుదువేమో అని శంకించితి. దేవునికృపచే బ్రతికితి వే? అంతియ చాలు." అని వాని ధైర్యమును బ్రశంసించెను. వాఁడారాకొమరుని గాంచి, అంజలిబద్ధుండై "దేవరా! ఇదియొక లక్ష్యమా? మీరు నావీపు నెక్కుఁడు. ఎంతశీఘ్రకాలములో మిమ్ముల నావలివైపునకు మోసికొనిపోదునో కనుఁడు. నయగారానది పైఁ ద్రాటిమీఁద నడుచుట ఎంతపాటి. మీదయ యుండవలెఁ గాక! ఇట్టియద్భుతము లైనపను లెన్నియో చేయఁగలను." అని నుడివెను. ఎడ్వర్డు బ్లోండనుపలుకులకు నలరి తనయిరవునకరుదెంచె.

అమెరికాసంయుక్తరాష్ట్రజనులు ఇంగ్లండురాజ్యమునకు నొడయండగు ప్రభువు తమదేశముం జూడ రాంబోవు చున్నాండని యతని గౌరవింప ననేకభంగుల నుద్యమములు సేసిరి. కన్నడారాజ్యము నందయు నెడ్వర్డు గ్రుమ్మరి యందలిజనుల యాచారవ్యవహారములను, వారిసుఖదుఃఖములను, వారి వృత్తులను, వారిపూర్వుల చరిత్రములను, మొద లగువానిని గ్రహించి, యారాజ్యమున హామిల్టనను పురంబున 1860 సం. న సెప్టంబరు నెల 20 వ తేదిరాత్రి నివసించి, మఱునటియుదయాన లేచి దేవున కెరంగి, అల్పాహారమును భుజించి, సబంధుమిత్ర పరివారుండై సంయుక్తరాష్ట్రప్రమాణాంబులలోం జేరిన డెట్రాయి ట్టనుపురిం బ్రవేశించెను.

డెట్రాయిట్టుపురిపౌరులు ఇంగ్లాండురాణిపుత్త్రుండేతెంచె నని వీథుల నలంకరించిరి. పచ్చనితోరణంబులం గట్టి వీథుల తుదం జెండాలు వ్రేలాడ వైచిరి. వేల నన్నిచోటుల దీపములు వెలిగించిరి. రేయిం బగలు ఒకతీరుగ గాన్పించెను. ఎడ్వర్డు ఎక్కినబండి వీథుల నేగునపుడు దారికి నడ్డముగం బ్రజలు బలసి యాతని విలోకింప గుంపులుగూడి నిలిచి యుండిరి. మేడలపై వెలందులు తమలో "ఇంగ్లండునేలిక ఇతండే" అని గుసగుసలు వ్రాంవుచుండిరి. నాండాపట్టణము మునుపటిజార్జివాషింగ్టన్ పునర్జీవితుండై వచ్చినభాగిం గన్పట్టె.

ఎడ్వర్డు డెట్రాయిట్టును వదలి చికాగోకు వెళ్లెను. అప్పు

డాపురమున రాజమార్గములు విశాలము లై ఇప్పు డుండురీతిని నారోగ్యము లై ఉండినవికావు. కాఁబట్టి ఎడ్వర్డా నగరమున రాజమార్గంబులఁ జనినప్పుడు మిగులమెలఁకువతోఁ బోవలసి యుండెను. ఏఁబదివేలజనులు ఆయనవదనకమలమును గాంచి సంతోషించిరి. దారిప్రయాణముచే నెడ్వర్డు కొంత యలసటఁ జెందెను. అతనివెంటఁ జనుదెంచిన న్యూకాజల్ ప్రభువు ఎడ్వర్డు సేదదీర్చుకొనుట కై చికాగోనుండి "సెంటులూయి" అను పట్టణమునకు వెళ్లుమార్గమున నొకపల్లియలో విశ్రమించి, దానికెలంకుల నుండునడవిమెకంబుల వేఁటాడవలయు నని కోరెను. ఎడ్వర్డు న్యూకాజల్ప్రభువు కోరినరీతిని ఆగ్రామం బునఁ గొంతకాలము విశ్రమించి దానిసమీపంబున నుండిన యరణ్యమధ్యంబున వేఁట కై చని, నాలుగుకుందేళ్లను, ఇరువదెనిమిది పూరేడుపిట్టలను గాల్చి వేఁటలో సమర్థుం డని పొగడ్త గాంచెను.

అక్టోబరునెల 30 వ తేదిని సంయుక్తరాష్ట్రమునకు రాజధాని యైనవాషింగ్టన్ అనుపురవరమును, నెడ్వర్డుప్రవేశించెను. ఆంగ్లేయులతరపున నుండినలియాన్సనుప్రభువు ఎడ్వర్డునకు స్వాగత మిచ్చి, సంయుక్తరాష్ట్రమున కధ్యక్షుఁడగు జేమ్సు బూచానునకుఁ (James Buchanan) బరిచియము సేసెను. జేమ్సుబూచానను మిగులజాగరూకుఁడై తనవైపువారిని అతృప్తిపఱుపక, వారిని మెప్పించి, ఎడ్వర్డురాక వారికి నా

మోద మొదవునటుల,వర్తించెను. అతఁడు ఇంగ్లండురాణికు మారుని అనేకరీతుల గౌరవించి, ఆయనగౌరవమునకుఁ బాత్రుఁ డాయెను. జేమ్సుబూచానను ఎడ్వర్డునకు వాషింగ్టను సమా ధిని జూపెను. అచ్చట నెడ్వర్డు దానియొద్దకుఁ బాదచారియై శిరస్సునఁ గుళ్లాయిని వేసికొనక వెళ్లి, దానికడ మాటాడక కొంతకాలము నిలిచెను. ఆతనివెంటవచ్చినవారలును మౌన మును ధరించియుండిరి. పూర్వమున నాంగ్లేయులకును, సంయు క్తరాష్ట్రజనులకును గల మనస్పర్ధ నాఁటితో నంత మొందిన దని యోజించుచుండినట్టుల నెడ్వర్డు కాన్పించెను.

ఎడ్వర్డాచోటు వాసి తనబసకు నేతెంచి విశ్రమించెను. మఱునాఁడు కొందఱు ఎడ్వర్డు సంయుక్తరాష్ట్రపు దక్షిణ మాగాణములలో బానిసవ్యాపారము నడిచినతావులకు వచ్చి బానిసలను జూడవలయు ననికోరిరి. బానిసవ్యాపారము ఇగ్లం డులో నాలవవిల్లియముప్రభువుకాలమున నిలిచెను. ఎడ్వర్డు బానిసలను గాంచి వారిబాధలను గని సహించునంతకఠిన చిత్తుఁడు కాఁడు. అతఁడొరులు శ్రమపడుటను గాంచి, వారి కష్టములఁదీర్పక పోయినవాఁడుకాఁడు. ఎడ్వర్డు తనకుసంబంధ ములేనిరాజ్యములో నావ్యాపారము నిలుపుదల సేయుటకు నాతనికి నెంతమాత్రమును స్వాతంత్రము లేదు. అతఁడు బాధ పడు వారి నోదార్చి వారిశ్రమల నివారింపక ఆస్థలమునకు బోఁగూడదని నియమము సేసికొన్నవాఁడు. అట్టి పురుషశ్రేష్ఠుఁ

డీబానిసగుంపులను జూడబోవునా? అయినను న్యూకాజల్ ప్రభువు, ఈవిషయమై దీర్ఘముగ నాలోచించి సంయుక్తరాష్ట్రపు దక్షిణమాగాణములను జూచి వచ్చుటకు రమ్మని ఎడ్వర్డును పిలిచెను. అతఁడు తన క్షేమము కోరినఅతని ప్రార్థనకు విరోధముగఁ బోనొల్లక ఆమాగాణములఁ జూచి వచ్చుటకుఁ దర్లి బానిసలు లేనితావు లన్నింటిని జూచి వాషింగ్టనునకు వచ్చెను.

ఎడ్వర్డు వాషింగ్టనునుండి ఫిలడెల్ఫియా అనుపట్టణమువరకు నేతెంచెను. అచ్చట నుండు ఇండిపెండెన్సుహాలు నాతఁడు గాంచి, పూర్వము తనతాతకు లోఁబడినజనులు స్వాతంత్ర్యమును పొందిన తావ దే అని కొంతకాల మచ్చట నూరకుండి తనభావము నెరులకు దెలియనియ్యక యాతావు వాసి న్యూయూర్కునకుఁ జనుదెంచెను. అచ్చట నాతఁడు సేరఁగానే, ఆ పురవాసులు ఆతనిఁ గాంచి మిక్కిలి సంతోషపడిరి. ఫాదర్ నికర్ బాకర్ (Father Knickerbocher) అనునాతఁడు ఎడ్వర్డునకు సగౌరవంబున స్వాగత మిచ్చి, ఆతనిహోదాకుఁ దగిన విడిది సూపి, ఆయనకు విం దొనర్చెను. అందు ననేకులు వచ్చిరి. పెక్కుమంది తావు లేనందుచే రాలేక పోయిరి. ఆపురమున నెడ్వర్డైదురోజు లుండెను. అతఁ డాతావును విడిచి ఆల్బని, బోస్టను, అనుపురంబుల జూచి, లాంగ్ ఫెలో, ఆలివర్ వెండల్ హోమ్సు, ఎమర్సను, ము న్నగుగొప్పకవీశ్వరులఁ గాంచి, వారితోఁ గొంతకాలము విద్వత్ప్రసంగములు సేసి,

హార్వర్డుకళాశాలను బొడగాంచి, కడపట బంకర్సుకొండను జేరెను.

ఎడ్వర్డు అమెరికాదేశమును విడిచి, నావలోఁ బయనము సేసి, ఇంగ్లండుఁ జేరి పెద్దకాలము తన్ను నెడబాసిన వ్యథచే నవయు తల్లిదండ్రుల సంతోషపఱిచి సుఖంబున నుండె.

ఎడ్వర్డు తూర్పురాజ్యములఁ జూచుటకు నేఁగుట.

1861 సం. న ఎడ్వర్డుతండ్రి పరలోకగతుఁ డయ్యె. అతఁడు తండ్రిచావున కై మిగుల దుఃఖించి, రాచకార్యములు సేయక ఏవేళఁ దననాయననే తలంచు చుండెను. మంత్రులు ఎడ్వర్డన్యదేశములలోఁ ద్రిమ్మరు నేని శోకముపశమించునని ఆలోచించి ఆతనిని తూర్పురాజ్యంబులకు ననుపుట మేలని విక్టోరియాతోఁ జెప్పిరి. ఆమెయును దానికి నంగీకరించెను. ఎడ్వర్డు వారికోరిక మేరకు నాదేశములఁ గని వచ్చుటకు నియ్యకొనెను.

1862 సం. ఫిబ్రవరినెల 28 వ తేది ఎడ్వర్డు పరిజనులనేకులు తనవెంటఁ జనుదేరఁ దూర్పురాష్ట్రములకు నేఁగఁ బయన మయ్యె. జనరల్ బ్రూసు, (General Bruce) మేజర్ టీస్ డేల్ (General Teesdale) కాప్టన్ కెప్పల్ (Captain-Keppel) డాక్టరుస్టాన్లి (Dr.Stanley) ఎడ్వర్డు వెంట నంటి నడిచిరి. ప్రయాణీకులు ఈజిప్టు రాజ్యమునకు ముఖ్యపట్టణ మైన కైరోకుబోవుటకుఁ దర్లిరి.

ఎడ్వర్డుప్రభృతులు కైరోపురంబుఁ బ్రవేశించి అందలి

వింతలను బొడఁగాంచి విస్మితులై నైలునదిలోఁ బయనము సేయుచుండిరి. ఎడ్వర్డు నైవభక్తిసంపన్నుఁడైనందున ఆదివార మగుటచేఁ బక్షులను జంప నొల్లఁడయ్యె. ఏటికి నిరువైపుల నుండుగట్టులపై శకుంతసంతానముల కిలకిలారవములు చెవులకు విందొనర్చు చుండె. నదిలో నొకచాయఁ దామరలు వికసింప నాతావులను బుస్సుతతెమ్మెరలు ఇంగ్లండురాణికొడుకు పైఁజల్లు చుండెను. తెల్లనిబాతులు నీటిమీఁద నెడ్వర్డు నెదురుకొనుటకై వచ్చుచుండె ననువిధంబున నీఁదు చుండె. రాణి తనయుండు వానిలో నొకదాని నైనను చంపక దేవుని స్మరియించుచు నదిలోఁ బయనము సేసె. అతఁడు మొసలిని వేఁటాడవలయునని ఎంతఁగోరినను, ఒకమొసలి యైనను నీటిమీఁదఁ గనుపడ దయ్యె.

ఎడ్వర్డును, ఆయనపరిజనులును, డాక్టరుస్టాన్లి మొదలగు పండితసమూహంబులును, నైలుముఖద్వారంబున నుండు "అలెగ్జాండ్రా" అను రేవు పట్టణమును జేరి, అచ్చటనుండి మధ్యధరాసముద్రముపై నావయాత్రసలిపి, క్రైస్తవ మతోద్ధారకుడైన జీసస్ క్రైస్టు జన్మభూమి యగు పాలెస్టైను బ్రవేశించిరి. మొదటి ఎడ్వర్డును, ఎలినారును పూర్వ మాచోటికి వెళ్లి యుండిరి. కాని వెనుక నింగ్లండు నేలినప్రభువర్గములో నేరును ఆతావును మెట్టి యుండలేదు. మొదటి ఎడ్వర్డు రాజ్య మేలి దాదాపు. ఏడువందల యేండ్లయ్యె.

మార్చినెల 31వ తారీకునఁ డర్కీలో మధ్యధరాసముద్రపు దరి నుండు "జాఫా"(Joffa)అను రేవు పట్టణమున, ఎడ్వర్డు ఓడ దిగెను. టర్కీ రాజ్యమునందలి యుద్ధవీరులు సాయుధులై ఎడ్వర్డునకు దారి చూప సాయపడిరి. ఆల్బర్టుబిడ్డఁడు జెరూసలమును, దానికి నలుగడల నుండు రమ్యప్రదేశంబులను, కొండచరియలలోఁ బ్రవహించు సెలయేళ్ల మొత్తంబులను, గాంచి ప్రమోదభరితుం డయ్యె. అతఁడు జూడియా మలలమీఁదుగ "బెతల" మనుపట్టణమును జూచి, "జెరికో" (Jericho) అనునడవులలోఁ గొంతకాలము గ్రుమ్మరి, "బితని"కి వెళ్లి, అచ్చట నుండునందంపుఁ దావులఁ గని, మాక్పెలా (Machepela) అనుగుహాలోని వింతలఁ జూడగాంచి అచ్చెరు వొంది, ఆదేశమును వదలి తనరాజ్యమునకుఁ గ్రమ్మఱ నే తెంచెను. డాక్టరు స్టాన్లి తా నింతకుఁ బూర్వ మాపాలెస్టైను రాజ్యమునకు వెళ్ళి యుండినపుడు చూడ లేనట్టితావుల నన్నింటిని ఎడ్వర్డు వెంటఁ బయనము సేయుటచేఁ జూడఁ గలిగినందులకు మిక్కిలి సంతోషించి, ఎడ్వర్డును బహువిధంబులఁ బ్రశంసించెను.

ఎడ్వర్డు ఇల్లు సేరఁగానే, "హీస్" అనురాజ్యమునెుక్క రాజపుత్త్రుఁడైన "లూయి" కి నాయనచెల్లెలైన ప్రిన్సుఅలిస్సను నామెను ఇచ్చి వివాహము నడిచెను. ఎడ్వర్డు తాను తూర్పు దేశంబునుండి తీసికొని వచ్చిన వింత వింత సామానులను, అపూర్వ పుష్పవర్గంబులను, తనతోఁబుట్టువునకు నజరుగ నిచ్చి

ఆమె ప్రీతికిఁ బాత్రుఁ డాయెను.

ఎడ్వర్డలెగ్జాంద్రులు, ఈజిప్టురాజ్యమును జూడఁబోవుట.

ఎడ్వర్డు తన పెండ్లికిముందు, అమెరికాలోని కన్నడా మొదలగు రాజ్యములను జూచి వచ్చెను. వివాహ మైన పిదప నాలిఁగోడ నాతఁడు ఈజిప్టు రాజ్యమును జూచి రావలయు నని తనతల్లితో నాలోచించెను. పుత్త్రులకోరిక నెఱవేర్చుట తల్లులకుఁ బ్రియము కదా! రాణి "ఎడ్వర్డు ఈజిప్టుఁ జూడవల యు నని కోరి యున్నాఁడు. ఆచిన్నవానికిఁ గావలసిన ప్రయాణ సన్నాహములఁ గావింపుఁడు." అని మంత్రులకు నాజ్ఞ నలుప, వారలు ఎడ్వర్డారాజ్యములఁ జూచి వచ్చుటకు సమ్మతించి సర్వయత్నములు సలిపిరి.

ఎడ్వర్డును, ఆతనిపత్ని యైన అలెగ్జాంద్రాయును, పరి వారమును, 1869 సం. జనవరి నెల 15వ తేదిని ఈజిప్టుదేశమునకుఁ బ్రయాణ మైరి. వారివెంట బాటన్బరురాకొమారుఁడైన "లూయి" అనునాతఁడును, (Prince Louis of Battenberg.) సదర్లెండు భూస్వామియును, (The Duke of Sutherland) డాక్టరు డబ్లియు రస్సలును, (Dr. W. H. Russel.) వారిపరి జనంబులును, ఎడ్వర్డలెగ్జాంద్రులవెంటఁ జనుదెంచిరి.

ఎడ్వర్డు మొదలుగాఁ గలవారు ఫిబ్రవరి నెల 3 వ తారీఖున నైలుముఖద్వారంబుననుండు నలెగ్జాంద్రా పట్టణమున నోడ దిగిరి. ఆపురంబున నుండునాంగ్లేయులు తమప్రభువునకును, ఏలిక

సానికిని, సుస్వాగత మిచ్చి, వారిమెడలోఁ బూలదండలు వైచి, మిక్కిలి సంభావించిరి. ఎడ్వర్డును, అలెగ్జాండ్రాయును, మున్నగు వారు, అలెగ్జాండ్రాపురిని విడిచి కైరోపట్టణమునకు వెళ్లిరి.

అచ్చట నాంగ్లేయ రాజప్రతినిధి యెల్లప్పుడును ఉండును. అతఁడును, అతని పరివారమును, ఇంకను ఆచోట నుండు దొడ్డ వారును, ఎడ్వర్డలెగ్జాండ్రులను సందర్శించి వారిరాక చేఁదమదేశమును, దమజనులును, ధన్యులై రనిమనంబున నూహించి, ఆ రాజదంపతులకు సకలమర్యాదలను సలిపిరి. ఎడ్వర్డలెగ్జాండ్రులు విడియుటకు దివ్యమైన యొకనగరు విడిచియుండెను. అది సర్వాభంగుల నలంకృతమై చూపరుల కనుల పండువు సేయుచుండెను. దానిలోని గదులు విశాలములై రమణీయములై యొప్పారుచుండెను. వానిలో నవరత్నఖచిత ములైన హేమపాత్రంబులు ఆయాచోటులందు నమరిసొంపు పెంపు పెరుఁగుచుండెను. ఆంగ్లేయుల ప్రభువులకువలయు నుపకరణము లాతావున సమృద్ధిగ విరాజిల్లుచుండెను.

ఈజిప్టు వైసురాయితల్లి ఫిబ్రవరి నెల 5-వ తేది అలెగ్జాండ్రామహారాణికిని, ఆమె చెలికత్తియలనును, గొప్పవిందుఁ జేసెను. విశాలములైన బల్లలమీఁద నవరత్న ఖచితములైనవియును, స్వర్ణరజిత మయములైనవియును, అగు గిన్నెలలోను, తట్టలలోను, చిన్నచిన్న పాత్రములలోను, నానా విధములైన భోజ్యవస్తువులు నిండియుండెను. ఇంగ్లండులో నెప్పుడును లభిం

పని ఫలసముదాయంబులును, పరిమళోపేతంబు లైనపుష్పప్రక రంబులును, పఱిచి యుండెను. వైసురాయితల్లి అలెగ్జాండ్రా ప్రభృతులను గౌరవించి, పైనఁజెప్పిన భోజ్యవస్తువులఁ గుడువ వేఁడెను. ఆ యెడ్వర్డు గృహిణి, మున్నగువారు బల్లలముందరఁ గూర్చుండి ఆహారమును భుజింప నారంభించిరి. వెలయాండ్రు నృత్యము సలిపిరి. పాటకులు గానము సేసిరి. గారడివిద్యవాండ్రు గారడీని ఒనర్చిరి. భోజనసమయమున నిట్లుజరుగుట నా యింగ్లండురాణికోడలుగాంచి, ప్రమోదాశ్చర్యంబుల నొందెను.

ఎడ్వర్డును, అలెగ్జాండ్రాను, వారివెంట నింగ్లండునుండి ఏతెంచినవారలును, నైలునదిలోనే దానిజన్మస్థలము వఱకుఁ బయనముసేయఁ గోరిరి. తురక లనేకులు మెక్కాలో మహమ్మదుగోరిమీఁదఁ గప్పఁబడునట్టి చిత్రపుఁ గంబళ్లను రెంటిని దీసికొని వెళ్లుటను, ఆరాచబాటసారులు గాంచి, ఫిబ్రవరి నెల 6-వ తేదిని నైలునదిలో వారలఁ గొనిపోవునోడ ఆయత్తంబై యుండ దాని నారోహించి దారి సాగఁ జనుచుండిరి.

ఎడ్వర్డును, అలెగ్జాండ్రాయును, ఒకయోడలో నుండిరి. అందు వారికి స్నానార్థమై ఒకగదియును, నిదురపోవుటకు వేఱొక అరయును, ఉడుపులు ధరించుకొనుటకు నొండొకగ్గొట్టును, కచ్చేరిసేయుటకు నింకొక గదియును, ఉండెను. ఈ యోడలో వారు భోజనము సేయుట లేదు. రెండవ నావ, మొదటిదానివెంట వచ్చుచుండెను. అందు నల్గురు ఫ్రెంచిదేశస్థులైన

వంటవాండ్రును, ఒక తురక వంటవాఁడును, వంట సేయుటకు సిద్ధులై ఉండిరి. ఆయోడలో భోజనవస్తువులన్నియు నిండియుం డెను. కోడి పుంజులు, బాతులు, కోడిపెట్టలు, వానిగ్రుడ్లును, లెక్కకు మిక్కిలి యై ఉండెను. మూఁడవయోడలో కైరోల నుండు బ్రిటిషు కన్సలును, ఈజిప్టు దేశస్థు లిర్వురును, ఫ్రెంచి దేశపు డోబీలును, వచ్చుచుండిరి. దానిలో గుఱ్ఱములును, కంచరగాడిదెలును, జనుదెంచుచుండెను.

ఎడ్వర్డు వేఁటలో నధికాసక్తి కలవాఁడు. అతఁడు నది కెలంకుల నుండు పక్షిసమూహంబుల నప్పుడప్పుడు కాల్చుచుఁ బయనము నొనర్చుచుండె. నైలునదిలో మొసళ్లు పెక్కులుండు నను ఖ్యాతిని ఎడ్వర్డింతకుముందనేక పర్యాయములు విని యున్నవాఁడగుటచే నామొసళ్లలో నొకదానినైనను జంపి, ఇంగ్లండునకుఁ గొనిపోవలయునని సర్వవిధములఁ బ్రయత్నించెను. కాని అతని దృష్టిపథంబున నొకటియైనఁ గోచరము కాదయ్యె.

ఒకనాఁటి రాత్రి నా రాజ దంపతు లుండిన యోడలో నలెగ్జాండ్రాకు సమీపంబున నిప్పు రగులుకొనెను. ఎడ్వర్డు మంట పెద్దదగుటకు ముందే మేలుకొని దాని నార్పెను. పగలంతయు నాఫ్రికాదేశపు సూర్యరశ్మికిఁ జక్కఁగ నెండిన ద్రూనియోడలు నిప్పుమంటకుఁ బేలపిండియేకదా! భగవంతుని కృపాతిశయముచే నాయగ్గిమంట చల్లారెను.

ప్రాచీనకాలపు నాగరికతకుఁ జేరువడసిన రాజ్యము లలో నీజిప్టు సుప్రసిద్ధమైనది. ఆదేశములో ప్రాచీనకాలపు వాస్తు శాస్త్రప్రకారము కట్టి శిథిలమైన దేవాలయములును, గోపురములును, అనేకము లుండును. ఎడ్వర్డు లెగ్జాండ్రులు దానింగాంచుటకు నవి యున్న చోటులయందుదిగి, వానిని జూచి వానిసొబగునకు మిక్కిలి యాశ్చర్యంబు నొంది, అట్టివాని నాదరించినవారి దానశౌర్యాది సద్గుణంబుల నభివర్ణింపుచు, అట్టివి ఖిలము కాక వానిం గాంచుటకు వచ్చెడి బాటసారులకు నానందదాయకములై యున్నందులకు మనంబున సంతసము నొందుచు, తాముండిన యోడకుఁ దిరిగి వచ్చిరి. ఫిబ్రవరి నెల 20-వ తేదిని ఓడలు ఏటి యడుసున దిగఁబడెను. అవి మరల నీటిపైఁ దేలుటకు నందలి సామానులు గట్టుపైకి దింపవలసియుండెను. ఎడ్వర్డు లెగ్జాండ్రులు సదర్లెండు ప్రభువు నోడ మీఁదికి వెళ్లి అచ్చట నాహారమును భుజించిరి. ఇంతలో దిగఁబడిన యోడలు నీటిపై నెప్పటి రీతిని దేలసాగెను. అందఱును బయనము సేయుటకుఁ గడంగిరి.

ఫిబ్రవరినెలాఖరువఱకు నారాజదంపతులు నదిలోనే ప్రయాణము సేసి, ఆయాచోటలయందుండు వింతప్రదేశములఁ జూచి, ఆహ్లాదముఁ బొరసి, నదీముఖద్వారము చాయఁ బయనము చేయసాగిరి. అప్పు డెడ్వర్డు నష్టమైన పెన్నిధిని గన్నచందంబున నొక్క మకరంబు నీటిపైనఁ దేలుచుండుటనుజూచి వెంటనే దానిని గాల్చెను. మొసళ్లు బైటికి రావు. అవి తమ్ము

జనులు చంపుదు రను భీతిచే నెల్లకాలంబుల నీటియడుగుభాగ మున నుండును. కాఁబట్టి మనుష్యులు వానిని వేఁటాడుట అరిది. ఎడ్వర్డు చంపిన మొసలి మిక్కిలి గొప్పది. అతఁడు దాని నింగ్లండునకుఁ గొనిపోవఁ బెట్టెలో దాఁచి యుంచెను.

ఎడ్వర్డును, అలెగ్జాండ్రా మున్నగువారును మార్చి నెల కడవఱకు నైలులోఁ బయన మొనర్చుచు, వచ్చుచుండిరి. ఈరాజదంపతుల వివాహమహోత్సవదినము పండుగ నైలు నదిలోనే నడిచెను. గొప్పవారు ఆసమయంబున నెడ్వర్డలెగ్జాం డ్రులకు బహుమతుల సమర్పించిరి. ఈజిప్టురాజ్యమునం గలవె లయాండ్రు వారి మ్రోల నాట్యము సలిపి వారి నానందపఱిచిరి. వారలు గొన్నాళ్లు నదిలోఁ బయనము సేసి, మినిహేకు నే తెంచి, అచ్చట ధూమశకటంబుమీఁదఁ గైరోపురికి వచ్చిరి.

విక్టోరియాకొడుకును, కోడలును, వారివెంటఁ జను దెంచినపరిజనులును, కైరోనగరంబున వారమురోజు లుండి మార్గాయాసమును బోఁగొట్టుకొని, అందు విచిత్రము లైనవి యును, రమ్యము లైనవియును, అయినప్రదేశములను గాంచి, టర్కీ దేశగమనోన్ముఖులైరి.

వేల్సురాజ్యముయొక్క యువరాజు ధర్మపత్నీసమేతుఁ డై సూయజుకాలువ సమీపించి వచ్చెను. సూయజుభూసంధిని కాలువను త్రవ్వుచుండిరి. ఎడ్వర్డు మధ్యధరాసముద్రమున కును, "బిట్టరులేక్సు" అను నుప్పుచెఱువులకును, నడుమ

గట్టిన తూములను దెఱచెను. అతఁడు ఆతూములను దెఱచుటచే మధ్యధరాసముద్రమందలి నీరు సూయజుకాలువలోనికి రాసాగెను. కాని, కాలువపని పూర్తికానందున ఆతూములు మరల మూసికొనెను.

ఎడ్వర్డుప్రభృతులు పోర్టుసెయిడ్డు రేవుపట్టణముఁజేరి, కాన్‌స్టాంటినోపిలు పట్టణమునకుఁ బోవ నోడ నెక్కి, అలెగ్జాండ్రాపురికి వచ్చి అందలి పాంపె జయస్తంభమును జూచి, కాన్‌స్టాంటినోపిలునకు నేఁగ నోడ నెక్కిరి. పయనము బాగుగ నడిచెను. కాన్‌స్టాంటినోపిలుపురికి మూఁడుమైళ్లదూరముననే వచ్చిన టర్కీసుల్తానుని పడవలోనికి నారాజదంపతులుదిగి, తురకజేనివీటఁ బ్రవేశించిరి.

ఆశియాలో నుండుటర్కీకిని, అయిరోపాలోనుండుటర్కీకిని, ప్రభు వొకఁడేను. ఆతనికి కాన్‌స్టాంటినోపిలు రాజధాని. అతఁడు నిరంకుశాధికారమును చెల్లించుచుండువాఁడు. అతని మాటకు నెట్టిప్రజ్ఞావంతుఁడును, ఎదురాడ భీతిల్లుచుండును. అతని యంతఃపురస్త్రీలు తమనాథునితప్ప అన్యపురుషుల మోముల నెన్నడును జూచి యెఱుఁగరు. అట్టిచోట నెడ్వర్డలెగ్జాండ్రములు కొన్నినాళ్లుండిరి. సుల్తాను ఆంగ్లేయులయాచారవ్యవహారంబుల నెఱింగినవాఁడు. అతఁడు రాజదంపతులతో నధికమైత్రిని బ్రవర్తించి, వారికి సకలసౌఖ్యంబులు కలుగఁ జేయుచుండెను.

ఎడ్వర్డలెగ్జాండ్రాలు గొప్పమేడలో నివసింపసాగిరి. అది చక్కఁగ నలంకృతంబై యుండె. దానిలోని మందిరంబులు నానా విధమణులచేఁ బొదుగఁబడి చూపరులనయనంబులకు విందుసేయుచుండెను. ఒక నాఁ డామేడలోఁ డర్కీ రాజ్యసుల్తాను, ఎడ్వర్డుప్రభృతులకు విందు సేసెను. అతఁడు అందఱితో భోజనము సేసెను. అతనిమంత్రులును వానితోఁగూడ విందు నారగించిరి. ఎడ్వర్డును, అలెగ్జాండ్రాయును, వారితో సరససల్లాంబులుసలుపుచుఁ దమకువలసిన భోజనమును సాపడిరి. ఏప్రిలు 5 తేదిని ఉదయమున ఎడ్వర్డును, ఆయన రాణియును, కాన్స్టాంటినోపిలు అంగడి వీథులలో సికారి వెళ్లిరి. ఒకనాఁటిరాత్రి నాపురంబున నొకచోట నొకనాటకము ప్రదర్శింపఁబడెను. మన రాజదంపతు లాయాటను జూచువేడ్క నాచోటికి వెళ్లిరి. సుల్తానును, ఆతావునకేఁగి, స్త్రీలచెంగటఁ గూర్చుండెను. ఇంతకుముం చెన్నఁడును తురకరాజు, నారీమణులప్రక్కన గూర్చుండినదిలేదు. ఈరీతి నాపురంబున నారాజదంపతులుండి క్రిమియా రాజ్యమునకుఁ బోవఁ బయనము కట్టిరి.

ఇంగ్లండురాణికుమారుఁడును, కోడలును, టర్కీదేశపు ఱేఁడయని సెలవు పొంది క్రిమియాకుఁ జనుదేర నావ నెక్కిరి. దారి చక్కఁగ సాగెను. వారు సిబాస్టపూలు రేవు పురిని జేరిరి. కొద్దిదినములకుఁ బూర్వమే నడిచిన ఘోరరణమువలన నాపురి పాడుపడి యుండెను. అందు జను లెవ్వరు నివ

సించుటలేదు. ఎడ్వర్డు మొదలుగాఁ గలవారుక్రిమియాను ప్రవేశించి, అందు రణము జరిగినతావులను జూచిరి. రుష్యాదేశచక్రవర్తి ప్రతినిధి ఎడ్వర్డులెగ్జాండ్రాలకు సగౌరవంబుగా స్వాగతం బొసంగి, వారికి బహుభంగుల మర్యాదలు సలిపెను. ఆ రాజదంపతులు క్రిమియాలో రణభూముల నన్నిఁటిని వేఱు వేఱుగఁ బరీక్షించి, ఉభయసైనికనికాయంబు లుండినతావులను గాంచి, యుద్ధకాలంబున శిథిల మైనఆల్మానదిపై నుండువంతెనను గని, క్రిమియారాజ్యము నంతయుఁ గ్రుమ్మరిరి. రుష్యాదేశస్థులు ఎవరు వచ్చినను రొట్టెముక్కను, కొంచెముప్పును, ఇచ్చి అతిథిపూజలు సలుపు చుందురు. వారు తమవాడుక ప్రకారము మనరాజదంపతులకుఁ దమశక్తివంచన లేక అతిథిపూజలు సలిపిరి. ఎడ్వర్డులెగ్జాండ్రాలు 14 వ తేదికి బాక్లావా యుద్ధభూమిని గాంచి, లివిడియాలో నారాత్రి విశ్రమించి, మఱునాఁ డుదయంబున లేచి, కాల్యకరణీయంబులు దీర్చుకొని రుష్యాదేశస్థులసెలవు పొంది స్వదేశగమనోన్ముఖు లైరి.

ఎడ్వర్డులెగ్జాండ్రాలు ఇంటికి మరలి వచ్చునపుడు ఫ్రెంచిదేశమునకుఁ జనుదెంచి, పారిస్సుపురిపౌరు లొసంగునాతిథ్యంబుఁ గొని, లండనుపురికి విచ్చేసి.

ఎడ్వర్డు రోగపీడితుఁ డై ఆరోగ్యవంతుఁ డగుట.

ఎడ్వర్డులెగ్జాండ్రులు దేశములు తిరిగి వచ్చినపిమ్మట సాంద్రింగుహాము భవనంబున నుండిరి, ఎడ్వర్డుతోఁబుట్టువు ప్రిన్సస్

అలిస్సు వారిని జూడవచ్చి వారిదగ్గఱనే ఉండెను. వారందఱును మిక్కిలి సుఖంబుగా నుండిరి.

ఎడ్వర్డు నౌకరియగుబెగ్గనువాఁడును, చెస్టరుఫీల్డును జ్వరదేవతకు మంచి ఫలాహారమైరి. ఎడ్వర్డుమాత్రము దానికి లోఁబడనివాఁడయ్యెను, దానిచే మిక్కిలి పీడింపఁబడుచుండెను. ఎడ్వర్డు మిక్కిలి చేవకలవాఁడగుటచే నాజ్వర మాతనిఁ దొలుదొల్త బాధపెట్టదయ్యె. అతఁడు క్రమముగ దానికి నధీనుఁడై లేవలేక పడకమీఁదనే ఉండెను. కొన్నివేళల యందు నాతనికి మాటలు కూడ నిలిచి నిలిచి, తడఁబడుచు నోటనుండి మిక్కిలి కష్టమున వచ్చుచుండెను.

ఇట్టి జబ్బుస్థితిలో నాతనికి నలెగ్జాండ్రాయును, ఆయనతోఁబుట్టువు ప్రిన్సస్ అలిస్సును, దాపున నుండి ఉపచారములు సేయుచుండిరి. జెన్నరు, గల్, క్లేటక్, లోనగువైద్య శిఖామణులు నిమిష నిమిషమునకు సర్వకాలంబుల నాయన సమీపంబునందుండి మందు లిచ్చుచుండిరి. అలెగ్జాండ్రా ఎడ్వర్డు ప్రాణముతో నుండినచాలు నని, "సర్వేశా! మాభర్తను రక్షింపుము. మృత్యుదేవతకు నొసఁగకుఁడు. నా వైధవ్య తనముఁ గాపాడుఁడు." అని వేల్పును స్తుతించుచు ధైర్యలక్ష్మిని గోల్పోక ఆయనదగ్గఱనే ఉండెను.

విక్టోరియా ఎడ్వర్డు రోగపీడితుఁడై ఉండుటను విన్నదై ఎకాయెకిని సాండ్రింగుహాము భవనంబునకు సరుదెంచెను.

ఎడ్వర్డు బ్రతుకుట దుర్లభ మనుమాట పుట్టెను. విక్టోరియా, అలెగ్జాండ్రా, మున్నగువారు మిక్కిలి మైనం బడ్డ ట్టుల నిస్సారులై యుండిరి. వారికి ధైర్యము వచ్చు మాటలు కూడ చెప్పవా రుండియును, అందఱును బ్రతుకండని నిశ్చయించుకొని యుండిరి. అనేకరాజ్యముల యందలిజనులును, రాజులును, చక్రవర్తులును, ఎడ్వర్డు దేహస్థితిని దెలియం జేయు వలయు నని రాణి మంత్రులకు జాబులు వ్రాయుచుండిరి. ఇంగ్లండున, నుండుజనులు సాండ్రింగుహాముభవనమునకు నే తెంచి, ఆయనను జూడ గుంపులుగూడి యుండిరి.

ఇంగ్లండు, స్కాట్లాండు, అయిర్లండు, కన్నడా, ఆస్ట్రేలియా, కేపుకాలని, హిందూదేశము, మున్నగురాజ్యములలో నుండు దేవాలయములలో నన్నిమతస్థులును, ఎడ్వర్డు జీవింప వలయు నని తమ తమదేవతలకు మ్రొక్కులు సలుపవలయు నని రాణిప్రభృతులు అందఱకుం దంత్రీవార్తను బంపిరి. అన్నిచోటులలో నానాగుడులయందు నానా మతస్థులు దేవతా ప్రార్థనలను గావించిరి. ఇందఱమతస్థుల ప్రార్థనలు నిష్ఫలము లగునే? ఇండఱిలో నొక్కండైనను సదాచారసంపన్నుం డుండక ఉండునే?

ఎడ్వర్డునకు జ్వరము కొంచెము తగ్గెను. బాధ కొంత వఱకు నిలువసాగెను. ఆతనికి నిదుర పట్టెను. ఈసన్నలు శుభ సూచకము లైన వని అలెగ్జాండ్రా తెలిసికొని, దేవుని సదా

స్మరించు చుండెను. రాణి మంత్రులు, లోకులకు నీశుభవార్తను తెలియఁ బఱచిరి. అందఱును సంతోషాంబుధి మునిఁగిరి. క్రమముగ నెడ్వర్డు ఆరోగ్యవంతుఁ డయ్యె.

ఎడ్వర్డు దేవునిదయవలన బ్రతికె నని తలంచి రాణి భగవంతునకు మ్రొక్కుబడులు చెల్లింపవలయు నని మంత్రులతో మందలించెను. ప్రధానపుంగవులు ఆదేవేరి మనోరథము పూర్తి కాగలందులకు నుద్యమములు సేసిరి. విక్టోరియాయును, ఎడ్వర్డలెగ్జాండ్రములును, శుచిగా నాల్గు గుఱ్ఱంబులు పూన్చిన శకటంబుల నారోహించి సెంటుపాలుగుడికిఁ జేరఁ దర్లిరి. పునర్జన్మము నొందిన ఎడ్వర్డును జూచుటకు వీథులలో వేనవేల జనులు గుంపులుగూడి యుండిరి. అందఱును తిన్నగ నాదేవాలయము సేరిరి.

కోవెలలో నున్నతాసనంబున నిలిచి కాంటెర్బరి ఆర్చిబిషపు బైబిలులోని కొన్నివాక్యములు చదివి "ఎడ్వర్డు దీర్ఘాయువు కలవాఁడై మనుచు జనులను బాలించుఁగాత!" అని కీర్తనము పాడెను. గుడిలో మ్రొక్కుబడి చెల్లెను విక్టోరియా మొదలగువారు వేఱుతెరువుల నింటికి వచ్చిరి. ఒకానొకకవి,

"మృత్యువాతఁ బడియు మేన జీవముతోడ
జనులు మోదజలధి మునుఁగ వెలికి
వచ్చినాఁ డితండు హెచ్చుగ నెడ్వర్డు
బ్రోవుమయ్య దేవ జీవ మిచ్చి." అని కీర్తించెను.

## 1873.—1875.

### ఎడ్వర్డు రెండేండ్లు ఇంట నెమ్మదిగ నుండుట.

1874 సం. న జనవరి నెల రుష్యాదేశపు రాజపుత్త్రిక యగు "గ్రాండు డచెసుమేరియి" (Grand Duchess Marie of Russia) అను నామెకును, ఎడింబరో ప్రభువునకును, వివాహము నడిచెను. ఎడ్వర్డలెగ్జాండ్రులు విక్టోరియా ప్రతినిధులుగ నుండి ఆపెండ్లిని జరిపిరి. డీనుస్టాన్లి (Dean Stanley) అను నాతఁడు దేవాలయంబున మంత్రములు పఠించెను. పరిణయము ముగిసినవెంటనే వివాహమునకు వచ్చినవారికి విందులు చేయఁబడెను. అప్పుడు వేల్సు యువరాజును, ప్రష్యారాజ్యముయొక్క రాజపుత్త్రిఁడును, సహపంక్తిని విందు భుజించిరి. ఆవల నందఱును తమతమ బసలకు నేఁగిరి.

1874 సం. న మిడిల్ టెంపిలుహాలులో నెడ్వర్డునకు విందు జరిగెను. న్యాయశాస్త్రము నభ్యసించువా రాహాలులో నాశాస్త్రమును జదువుచుందురు. అతఁడు తన్ను గౌరవించినవారియెడఁ గూరిమి కలవాఁడై కొంతకాల మచ్చటి వారితో సరససల్లాపంబులు సేయుచుండి తనయింటికి వచ్చెను.

ఆసంవత్సరంబున నాతఁడును, ఆయనభార్యామణియును, బర్మింగుహాముజిల్లాకు వెళ్లిరి. ఆజిల్లా అధికారి జోసఫ్ చాంబర్లేనను నాతఁడు, (Mr. Joseph Chamberlain) ఈ రాజదం

పతులను మిగుల గౌరవించెను. ఆవల వారా తావును విడిచి తమ గృహంబు సేరిరి.



ఏడవ అధ్యాయము.



ఎడ్వర్డు హిందూదేశమునకు వచ్చుటకు ప్రయత్నముచేయుట.

ఆల్బర్టుప్రభువు జీవించి యుండినపుడు, కానింగుప్రభువు ఎడ్వర్డు హిందూదేశమును జూచుటకు నేగుటచే హిందూదేశస్థులకును, తమకును, గలమైత్రి పెరుఁగు నని ఒకానొకప్పు డాదారతో మందలించెను. రాణి ఈ పలుకును విని మఱువక సమయము వచ్చినపుడు మంత్రులతో నీ విషయమై ఆలోచింపవలయునని తలంచెను. 1875-వ సంవత్సరమున నామె యొకనాఁడు మంత్రులతో నీ సంగతినిగుఱించి ఆలోచించెను. ప్రధానులును రాణిమాట లెస్స అని ఆమోదించిరి. అప్పుడు సాల్సిబరిప్రభువు హిందూ దేశమునకుఁ గార్యదర్శిగ నుండెను. అతఁడు 1875-వ సంవత్సరము అక్టోబరునెల 11-వ తేదిని ఎడ్వర్డు హిందూదేశమును గనుటకు నేఁగును. అని పత్రికలలోఁ బ్రకటింపచేసెను.

పార్లమెంటు సభాసభ్యులలో ననేకులు ధనమధికముగ ఖర్చగు నను భీతిచే నా పయనము మాను కొనుట బాగనిరి. కొందఱు హైడ్ పార్కులో సభచేసి ఎడ్వర్డు హిందూదేశమునకుఁ బోఁగూడదని వాదించిరి. మఱికొందఱు "ఎడ్వర్డు రాణిప్రతి

నిధిగఁ బోఁదలంచియున్నాఁడా? ఆయన యువరాజ్య పదవిని నా దేశమును గనఁ జనుదేర నెంచియున్నాఁడా?" అని ప్రశ్న చేసిరి. ఏ హోదాలో నాతఁడు వెళ్లిన నేమి? ఇంగ్లండు నేలిక బిడ్డఁడు హిందూ దేశమునకు వచ్చుటచేఁ గొంత పైకము ఖర్చగుటచే నింగ్లీషువారికి వచ్చిన నష్టమేమో? ఎడ్వర్డు ఆంగ్లేయులకుఁ బ్రభువైనటుల హిందూదేశస్థులకును బ్రభువేను. అట్టిఁడా దేశమునకు బోవుటకై ధనమేల వ్యయము సేయఁగూడదు? అతఁడా దేశమునకు వెళ్లుటలో మేలు కలుగునని తలంచి రాణియు మంత్రులు, నెందఱు ఎన్ని యడ్డమాటలు వల్కినను వానినన్నింటిని నిరాకరించి,ఆయనను బనుప నిశ్చయించుకొనిరి.

ఆంగ్లేయుల యాచారవ్యవహారములకును, హిందూదేశస్థుల యాచారవ్యవహారములకును, గొప్ప భేదము కలదు. హిందూదేశములోని స్వదేశరాజు లాతనికి ననేకవిధము లగు కానుకలను సమర్పింతురు. అతఁడు వారికి బదులు బహుమతులొసంగవలసి యుండెను. అతఁ డందులకై 6,00,000 రూపాయలు విలువగల వస్తువులను భద్రపఱుచుకొనెను.

ఎడ్వర్డు హిందూదేశములో నడుగిడినది మొదలు తిరిగి ఇంగ్లండునకు నేఁగువఱకును అప్పుడు హిందూదేశమునకు రాణి ప్రతినిధియైన నార్తుబ్రూకు ప్రభువునింట నాతఁడతిథియైయుండవలయునని తీర్పు చేసిరి. ఇందులకుఁగాను 4,50,000 రూ. సొమ్ము వ్యయముసేయవలసియుండెను. పోవుటకును, వచ్చుట

కును బట్టు దారిఖర్చులు 7,80,000రూ. రొక్కము కావలసి యుండెను. అతని సొంతఖర్చులకు 9,00,000రూ. ధనము కావలసి యుండెను. పార్లమెంటు సభా సభ్యులలోఁ గొందఱు మాత్ర మింత ద్రవ్యము ఖర్చుసేయ నొల్లకపోయినను, డిస్రెలి ప్రభువు మొదలుగాఁగలవారు ఇంత పైకము ఎడ్వర్డు ప్రయాణ మునకుఁ బట్టు ఖర్చులకు గా నియ్యవలసిన దని నిష్కర్ష చేసిరి.

హిందూదేశములో నింతకుఁ బూర్వమున నుండిన సర్ బార్టల్ ఫ్రీరు (Sir Bartle Frere) అను నాతఁడును, సదర్లెండు భూస్వామియును, ఎడ్వర్డు నెచ్చెలు లైన అయిలెస్ ఫోర్డు ప్రభువును (Lord Aylesford) కారింగ్టన్ దొరయును, (Lord Carrington)కర్నల్ ఓవన్ విల్లియమ్సు (Colonel Owen Williams)మున్నగువా రాయన వెంటఁ జనుదేర నియమితులై ఉండిరి. కాని అలెగ్జాండ్రామాత్రము ఇంటిపట్టున నుండునటుల నిశ్చయింపఁబడెను. వీరుగాక ఇంక ననేకు లాతని సాహాయ్యముసేయ నియమితులై యుండిరి. వారిలో నొకఁడు వైద్యుఁడును, వేఱొకఁడు హిందూదేశమున నెవరెవరికి ఏయే బహుమతు లియ్యవలయునో వారి వారికి నానాబహుమతు లిచ్చుటకును, వారివలనఁ దిరిగి కానుకలను బొందుటకును, ఒండొకఁడు ఎడ్వర్డు గుఱ్ఱములు సామానులు మున్నగు వానిని సురక్షితముగఁ గాపాడి ఆతనికి నందఁజేయుటకును, నిర్ణీతులై యుండిరి. వీరు పనివాండ్రలలోఁ జేరినవారు. రాజబంధువులు

క్రింద ఆ యెడ్వర్డువెంటఁ జనవలయునని విక్టోరియారాణి, వారిని బంప నిశ్చయించుకొనెను.

ఎడ్వర్డును ఆయన పరిజనులును, ముందు నిర్ణయించిన దినముననే ఇంగ్లండు వదలి హిందూదేశమునకు దర్లిరి. అలెగ్జాండ్రా రాణిమాత్రము ఫ్రాంసుదేశములో "కలె" వఱకు నేతెంచి క్రమ్మఱ నింటికి వెళ్లెను. ఆవల నెడ్వర్డు ప్రభృతులు బ్రిండిజి మార్గమున నేడెనుకు నేతెంచిరి. హిందూ దేశమున, నాయాచోటులందు నాతనితో విన్నవించుకొను వార్తలును, వానికి నాతఁ డియ్యవలసిన ప్రత్యుత్తరములును, ఆయనకు నాతని ప్రైవేటుసెక్రిటెరీలు వ్రాసి యిచ్చినేర్చుచుండిరి. అతఁడు బొంబాయికిఁ జేరకముందే బొంబాయి మునిసిపాలిటివారు విన్నవించుకొను వార్తలు ఆయన చెవినిఁ బడి యుండెను.

హిందూదేశమునకు నెడ్వర్డు రాబోవునని గొప్ప గొప్ప పట్టణములందలి రాజులును, రాజప్రతినిధులును, మునిసిపాలిటి వారును, ఇంకను అనేకులు ఆయన హోదాకుఁ దగినరీతిని బహుభంగుల గౌరవింప నుద్యమములు సేయుచుండిరి. పట్టణములలోను, పాళెములయందును, చిన్న చిన్న గుడిసెలయందును, అడవులలోను, నుండు సమస్త జనులును, ఎడ్వర్డు తమ దేశమునకు నేతెంచుట శుభోదయమునకుఁ గారణ మనితలంచి, ఆయనను వీక్షింప నేయేచోటుల నేయేసమయంబుల నాతఁడు వచ్చునని తెలిసియుండెనో ఆయాచోటులకు నాయాసమయంబుల జనులు వచ్చియుండిరి.

హిందూదేశము నేలు వైసురాయి నార్తుబ్రూకుప్రభువు బొంబాయికి వెళ్లి ఎడ్వర్డునకు స్వాగతమిచ్చుటకు సిద్ధుఁడై యుండెను. బొంబాయి గవర్నరును, ఆతని పరిజన సమూహము లును, ఆయనను బరివేష్టించి ఎడ్వర్డు రాకకై ఎదురు సూచు చుండిరి. బొంబాయి రాజ్యభాగములలోని స్వదేశ రాజులు ఆ పురమునకు నేతెంచి ఎడ్వర్డును గాంచి ఆయనను తమదేశము లకుఁ బిలుచుకొని పోవుటకు సిద్ధులైయుండిరి. వేయేల? సర్వ జనులును బొంబాయి హార్బరున ఎడ్వర్డును వీక్షింపఁ గౌతూ హలులై కాచుకొని యుండిరి.

ఎడ్వర్డు బొంబాయిని దిగుదినము ముందే తెలియఁ బఱచి యుండెను. నాఁడు అతఁడు ఆచోట నడుగిడిన వెంటనే గొప్పగొప్పపట్టణములయందలి కోట బురుజులనుండి పిరంగి వేటు లాతని రాకను హిందూదేశస్థులకు నెఱుకపఱుప నేర్పాటు చేయఁబడి యుండెను. నవంబరు నెలారంభమున నెడ్వర్డు బొం బాయి హార్బరులో దిగెను.

ఎడ్వర్డు వచ్చినయెడ బొంబాయి రేవు జేరెను. కోట బురుజులనుండి పిరంగులు "ఎడ్వర్డు వచ్చెను. ఎడ్వర్డువచ్చెను." అని జనుల చెవులు తూట్లు పొడుచుచుండె ననురీతిని మ్రోగెను. నార్తుబ్రూకు ప్రభువు ఎడ్వర్డునకు నెదురేఁగి, ఆయనను బిలుచు కొని వచ్చి, ఆయనకై ఏర్పఱిచిన యున్నతాసనంబునఁ గూర్చుండఁ జేసెను. బొంబాయి మునిసిపాలిటివారు బొంబా

యిపురవాసుల పక్షమున నెడ్వర్డునకు స్వాగత మిచ్చి పలు విధంబుల గౌరవము సేసి, తమపురికి రమ్మని ఆయనను వేఁడిరి. అతఁడు వారి ఇష్టప్రకార మా పురంబున గవర్నరునింట నతిథియై ఉండెను.

ఎడ్వర్డు బొంబాయిపురమును జేరిన మూఁడవదినమున నాతనిపుట్టినదినమహోత్సవము నతివైభవమున నడిచెను. ఉత్తరహిందూస్థానంబునను, దక్షిణహిందూస్థానమునను, ఆయన పుట్టినరోజున జనులు పండుగలు సేసికొని ప్రమోదభరితులై ఉండిరి. ఆతఁ డాదినమున రాజునకుఁ దగినచిహ్నము లన్నింటిని ధరించి తన్నుఁ జూడవచ్చిన పెద్ద పెద్దవారిని గౌరవించుచుండెను. అతఁ డప్పుడు రజతమయ మైన యున్నతసింహాసనంబుపై నధిష్ఠించి యుండెను. అన్ని వేడుకలును అతివైభవముతో నడిచెను.

స్వదేశసంస్థానాధిపతు లనేకులు బొంబాయి పురంబునకు నేతెంచి ఎడ్వర్డును దర్శించి, తమతమ రాజ్యంబులకు రమ్మని వేఁడిరి. వారిలోఁ గోలాపురసంస్థానాధిపతి మిక్కిలి పసివాఁడు. అతఁ డప్పుడు పన్రెండేండ్ల వయస్సు కలవాఁడై యుండి, ఎడ్వర్డును జూడఁబోయినపుడు, వినయగాంభీర్యంబులు సూపెను. ఎడ్వర్డాచిన్నజేనిఁ గాంచి హర్షంబు నొందెను.

ఎడ్వర్డు బొంబాయిపట్టణంబున నావలఁ గొన్నిదినములు మాత్ర ముండెను. తన్ను ముందుగఁ జూడవచ్చిన రాజుల

బసకు నాతఁడాదినములలోఁ బోవుచుండెను. అప్పుడు అతఁడు ఆయారాజుల యాచారవ్యవహారములను అతి శీఘ్రకాలములో గ్రహించెను. ఎడ్వర్డు ఆరాజుల పూర్వీకులైన శూరులచరిత్రంబులను, వారిపరాక్రమంబులను, మిక్కిలి కొనియాడి వారిని సంతోషపఱిచెను. ఆరాజులును ఎడ్వర్డు నడవడిక మేలైనదని యును,అందఱకుఁ బ్రీతికరమైనదనియును తలంచి, ఆయనను మిగుల గౌరవించిరి. బొంబాయిలో నుండునాంగ్లేయులు ఎడ్వర్డును దీసికొనివచ్చిన యోడలోని నావికులకు విందుసేసిరి. వారావిందు గుడువరమ్మని ఎడ్వర్డును వేఁడిరి. అతఁడును ఆచోటికి వెళ్లి సామాన్యజనునికైవడి వారితోపాటు భోజనముసేసి, వారిని దృప్తిపఱిచి తన బసకు వేంచేసెను. అప్పుడె ఎలిఫెంట్ స్టనుడాక్సు పూర్తియాయెను. ఎడ్వర్డు వానిఁదెఱచుటకు నియమితుఁడై ఉండెను. హిందువులను, తురకలును, పారసీలును, ఆచోటికి వచ్చియుండిరి. వారందఱును చేతులు తట్టి తమమోదమును తెలుపుచుండ నాయిఁగ్లండు రాణీకుమారుఁడు డాక్సును తెఱచి, తన బసకు విచ్చేసెను.

నవంబరు నెలనడుమ నెడ్వర్డు పునహాపురికిఁ జనుదెంచి, బరోడాసంస్థానాధిపతి కోలునుకూటంబు విలోకించెను. ఎడ్వర్డు ఏనుఁగుపై నడవిలో వేఁటాడుటకు నిర్ణీతుఁడై యుండెను. ఏనుఁగు బాగుగ నలంకరింపబడెను. దాని మీఁద నంబారి నాలుగులక్షలపైకము వెలకలదై యుండె. ఎడ్వర్డు దానిమీఁద

నెక్కి అడవినడుమ నుండు వ్యాఘ్రాది క్రూరసత్త్వంబులను జక్కాడెను. అతఁ డింతకుముం దెచ్చటను-ఇట్టి మృగంబులను జంపినవాఁడు కాఁడు. అతని దేశమున నిట్టిమృగములు లేవు. అది మిక్కిలి చలి దేశము. అందు నీమృగంబులు వసింపఁజాలవు. అతఁడు వేఁటాడుటచే సంతృప్త హృదయుండై తనవిడిదికి నరుదెంచెను,

ఎడ్వర్డు పునహాపట్టణమును బాసి, బొంబాయికి నేతెంచి, అచ్చటనుండి పోర్చుగీసువారి పురంబులైన గోవా మొదలగు స్థలములను జూచి, సింహళద్వీపంబునకు నేఁగి, ఆచోటఁ దేయాకు పంటను పరిశీలించి, చెన్నపురికిఁ జనుదెంచెను. ఆపురంబునఁ బ్రజలు ఆయనను మిగుల గౌరవించిరి. అతఁడు తనతండ్రి శ్రాద్ధమును డిసంబరునెలలో చెన్నపురి గవర్నరుండు గిండిపార్కులోఁ జేసికొని, కలకత్తాకు వెళ్లెను.

అతఁడు కలకత్తానగరరాజంబునఁ గ్రిస్మస్ పండుగలు నడుపుకొనెను.అతఁ డాచోటఁ బెక్కురాజకార్యములు సేసెను. అనేకరాజులు ఆయనను జూడవచ్చిరి. అతఁడు వారిని దగినరీతిని గౌరవింపవలసి యుండెను; వారిబసలకు నాతఁడు వెళ్లవలసి యుండెను. అతఁడు దొరతనమువారి దివ్యమైన భవనంబునఁ గొలువుచేసెను. హిందువులును, తురకలును, వెండియు ననేకులును, ఆయన కొలువుతీరియుండుటను జూచి విస్మయచిత్తులైరి. అతఁడు క్రైస్తవుల కోవెలలో భగవంతునిస్మరించి, గొప్ప

వారికి విందు నొనర్చెను. అనేకు లా భోజనసమయంబున నా తని చిరంజీవిగ నుండవలయు నని ఆశీర్వదించిరి.

1876 - వ సంవత్సరము జనవరి నెల 1-వ తేది యుగాది పండుగ నాతఁడు కలకత్తాలో నడపెను. ఆసమయంబున నాతఁడు నిండు పేరోలగంబున నుండెను. స్వదేశ సంస్థానాధిపతు లాచోటికి విచ్చేసిరి. అతఁడు వారందఱకు నైట్స్ గ్రాండుకమాండర్ (Knights Grand Commander) నైట్స్ గ్రాండు క్రాస్ (Knights Grand Cross) మొదలగుబిరుదుల నొసంగెను. వా రా పొరుూదలను గైకొని వినమితగాత్రులై ఆయనకుఁ దమ తమ కృతజ్ఞతను బహుభంగులఁ దెలిఁబుచ్చి తమదేశములకు నాయనను రమ్మని ప్రార్థించి తమతమ రాజ్యములకు వెళ్లిరి.

ఎడ్వర్డు కలకత్తాను వదలి కాశీపురికి నేతెంచి, అచ్చట శ్రీవిశ్వేశు నాలయమును,గంగానది యొూవన గర్వంబును జూచి యానంద పరవశుఁడయ్యె. అచ్చోటనుండి ఆతఁడు నావలో రామనగరున నుండుప్రాఁతకోటసొబగును గాంచెను. అచ్చట మహారాజా ప్రభృతు లాయనను మిక్కిలి గౌరవించి విందులు సేసిరి. అతఁడు వారివలన రత్నఖచిత మైనదియును, బంగారు మయమైనదియును, అయిన చేతికఱ్ఱను బహుమానంబు నొందెను.

ఎడ్వర్డు అయోధ్యరాజ్యమునకు వెళ్లెను. దానికి లక్ష్మణ పురి రాజధాని. దానిచే ఇచ్చటివారు లక్నో అని చెప్పు

చున్నారు. అతఁ డచ్చోట సిపాయి కలహంబునఁ జనినవారి జ్ఞాపకార్థమై కట్టుమందిరంబునకు నస్తిభారమును వేసెను. అతఁ డాసమయంబున స్వదేశి సిపాయీల పరాక్రమముల నుగ్గడించి వేవిధంబులఁ గొనియాడి పలికెను. ఆపెద్దకలహములో బాగు గఁబోరిన మేలిబంటులను ఆయనజూచి, వారితోఁ గొంతకాల ము సంభాషించి వారి ననునయించి పంపెను.

ఎడ్వర్డా చోటు విడిచి కాన్పూరునకు నేఁగెను. సిపాయీల కలహము నీపురముననే తొలుదొల్తఁ బుట్టెను. అనేకు లాంగ్లేయు లాచోట సమసిరి. వారు చచ్చిన చోట నొక గోరి కట్టియున్నది. అతఁడు దానిని జూడ వెళ్లినపుడు, కాలినడకతోఁ బోయి మౌనముద్రాలంకృతుఁడై కొన్ని నిమిషములుండి, "ఇంత మంది నిరపరాధులైన ఆంగ్లేయ స్త్రీలును బిడ్డలును, ఈపాడు బావిలో మృతిజెందిరికదా? అయ్యో పాపము. వారిని భగ వంతుఁడు కాపాడును గాక!" అని తిన్నని యెలుంగున జపించి, తన యిరవున కరుదెంచెను.

ఎడ్వర్డు ఆగ్రాపురికి నేగెంచెను. మొగలాయి పట్చక్ర వర్తులలో నైదవచక్రవర్తి షాజిహానుఁడు తన భార్యకై కట్టిన గోరి కలదు. దానిపేరు టాజిమహాలు. అది అయిదువందలసంవ త్సరములకుముందు నిర్మితమయ్యెను. నిన్ననో మొన్ననో కట్టిన యట్టుల ఉండును. ఎడ్వర్డా భవనంబుఁ జూచి, దాని యందంబు నకు డెందంబున నమందానందంబునొంది, అచ్చటనుండిన స్వల్ప

కాలములో దానిసొబగును రెండుమూఁడుతడవలు చూచి, అట్టి మహాల్ ప్రదేశంబునను లేదని నిశ్చయించి తన విడిదికిఁ జనెను.

ఎడ్వర్డునకు వేటపై నధికప్రీతికలదు. అతఁడీఫిబ్రవరి నెల 5-వ తేదిని జయపూరునకు నేఁగినపు డాతఁడు దాని కెలంకుల నుండు నడవులలోఁ నొకపులిని బీచమడంచెను. అతఁ డీ తావు విడిచి నేపాలు రాజ్యమునకువెళ్లి అచ్చటనుండు దట్టమైన విపినంబులలో సర్ జంగ్ బహదూరు సాయంబున నైదాఱుపులుల నొకవేటునఁ గాల్చి చంపెను. అతఁడు హిమవత్పర్వత ప్రాంతంబుల నుండు నడవులను, ఆపర్వత శిఖరంబుల యౌన్నత్యంబును, నదులసొంపును, మొదలగు చక్కని ప్రదేశంబులఁ జూచి మఱలెను.

ఎడ్వర్డు తన పరిజనులతో నర్మదానదతీరంబు పై వెలయు జబ్బలపురముఁ బ్రవేశించి ఆపురజనులు సంప్రీతిమై నిచ్చిన యాతిథ్యంబును గొని, అచ్చట కారాగృహంబున నవయువారును, పూర్వమున దారులలోఁ బ్రయాణముసేసిన బాటసారులను హతమునొనర్చి వారి యమూల్యాభరణంబులను గైకొన్న వారును, అయిన 'తగ్సు' అనువారిలో నేడ్గురినిజూచి వారితోఁ గొంతకాలముసంభాషించెను. అట్టిసమయంబున వారిలోనొకఁడు తా నఱువదిమందిని తనచేతులారఁ జంపితి నని ఎడ్వర్డుతో మందలించి బడాయి కొట్టెను. అట్టివారు విచారణలో దొరతనమువారికిఁదోడుపడి సాక్ష్యము నిచ్చినందున ప్రభుత్వము వారిమన్ననలను బడసి ప్రాణములను గోల్పోక చెఱసాలలో నవయుచుండిరి.

మార్చినెలలో నెడ్వర్డు, ఆయన పరివారముతో, బొంబాయిపురంబునకు నేతెంచి, ఆనెల 14 వ తేదిని స్వదేశగమనోన్ముఖుం డయ్యెను. అతఁడు హిందూదేశమున నాల్గునెల లుండెను. అతఁడా స్వల్పకాలములో ననేకులతోఁ జెలిమిసేసికొని, ఆదేశస్థుల యాచారవ్యవహారములను జక్కఁగ గ్రహించి భూమిమీఁద 800 మైళ్లు నడిచి, సముద్రముపై 2500 మైళ్లు ప్రయాణముసేసి హిందూదేశస్థులకును, ఆంగ్లేయులకును, గలమచ్చికను హెచ్చుచేసి తన వీటికి నేఁగెను. అతఁడు బొంబాయిలోనుండినపుడే, ఆయనతల్లి విక్టోరియామహారాణి "హిందూ రాజ్యచక్రవర్తిని" అను హోదాను బొందఁబోవు ననువార్త ఆతనికిఁ దెలిసెను. అతఁ డింగ్లండునకు నేఁగుబాటలో నార్తుబ్రూకు ప్రభువునకు వెనుక, హిందూదేశమును బాలించుటకు నిర్ణయింపఁబడిన లిట్టను ప్రభువు వేఱొక ఓడలో హిందూదేశమునకు వచ్చుచుండెను.

ఎడ్వర్డు హిందూ దేశములో నుండిన స్వల్పకాలములో స్వదేశ సంస్థానప్రభువులును, శ్రీమంతులైన వర్తక సమూహంబులును, జనులును, ఆయనకు కానుకలను సమర్పించి యుండిరి. అతఁడు వానిని బొంది సంతోష చిత్తుఁడై ఇంగ్లండు చేరెను. స్వదేశసంస్థానపురాజులు ఎడ్వర్డునకు బహుమతులను ఇచ్చుటకై ఇంగ్లండులో 37,50,000 రూ. విలువగలవస్తువులు కొనినారఁట.

ఎడ్వర్డు లండనుపురి చేరెను. రైలుస్టేషనులో నాయన తల్లియును, మఱియు ననేకు లాతని నెదుర్కొనుటకు వచ్చి యుండిరి. అతఁడు జను లభినందించుచుండ లండనుపుర వీథుల నూరేఁగుచు, తన వియోగబాధచే శ్రమ చెందు నలెగ్జాండ్రా మహాసాధ్వికి దర్శనం బొసంగి, తన యిల్లు చేరెను.

ఎడ్వర్డిల్లు సేరఁగానే రాజబంధువు లందఱును విచ్చేసి ఆయనను దర్శించిరి. అతఁడు భార్యాసమేతుఁడై కానాట్టుప్రభువు, ఎడింబరో ప్రభువు, మున్నగువారు వెంటఁ జనుదేర, వెస్టుమినిస్టరుగుడిలో భగవంతునిచరణారవిందంబులఁ దన హృదయపీఠంబునఁ జేర్చి, ప్రముదితచిత్తుండై పొందుపట్లకు నేతెంచెను.



## ఎనిమిదవ అధ్యాయము.



### 1876 సం. ము మొదలు 1887 సం. ము కడపటను ఎడ్వర్డు ఇంట నెమ్మదిగ నుండుట.

లండనుపురంబున "లైసెన్స్డ్ విక్టలర్స్ అసైలమ్" (Licensed Victuallers' Asylum) అను నాశ్రమము కలదు. అది యాపట్టణంబున వెలసి కొన్ని యేండ్లాయెను. ఆయాశ్రమవాసులు జూబ్లిమహోత్సవము సేయఁ దలఁచి, ఎడ్వర్డును, బిలిచిరి. అతఁడు ఆచోటికి వచ్చుటకు నియ్యకొనెను. అనేకులీసంగతి నెఱింగి, ఆచోటికిఁ బోవల దని ఎడ్వర్డును వేఁడిరి.

కాని అతఁడా తావునకు వెళ్లుటకుఁ బట్టు పట్టెను. ఆయాశ్రమమున మత్తు పదార్థములు జనులకు నియ్యఁబడుచుండెను. అతఁడు తాను త్రాగుఁబోతులను ఉత్సాహపఱుప నాచోటికిఁ బో ననియును, ఆయాశ్రమవాసుల ధర్మకార్యమును వృద్ధిపఱుప వెళ్లెద ననియును, తన్నుఁ బోవల దన్నవారికి సమాధానము సెప్పి, ఆతావునకు వెళ్లి, కొన్ని మాటలు ముచ్చటించి యింటికి జనుదెంచెను.

"పారిసు" అను నగరము ఫ్రాన్సురాజ్యమునకు రాజధాని. ఆరాజ్యమునందు వా రా వీట సర్వవస్తు ప్రదర్శనము గావింపవలయు నని యుద్యమములు సేసిరి. వారు ఆయాతావులలోఁ జేయఁబడు వింత వింత సామానులను దెచ్చి ఆప్రదర్శనశాలలో వెలయింపఁజేయుచుండిరి. ఇంగ్లండున నొనర్పఁబడిన సామానులను వెలయఁ జేయవలయు నని ఆంగ్లేయులు కోరి, దానికి నొక సంఘమును ఏర్పాటు చేసిరి. ఆ సంఘమునకు ఎడ్వర్డు అధిపతి. ఇట్టి ప్రదర్శనములలో నెడ్వర్డు తండ్రి మిక్కిలి యక్కఱతోఁ బాటు పడుచుండెడి వాఁడు. కొడుకును అదేరీతిని ప్రదర్శనావలోకనాసక్తుఁడై పారిసునగరంబునకుఁ జని ప్రదర్శనకార్యాధ్యక్షులతో దానికి సంబంధించిన మాటలాడి, దానికి వలయు నుద్యమములు సేయుచుండెను.

1878 సం. పారిసులో ప్రదర్శనము జరుగు నని పత్త్రికలలోఁ జాటించిరి. ఇంతలో నెడ్వర్డునకు గొప్పదుఃఖము సంప్రా

ప్తించెను. అతని తోఁబుట్టువు "ప్రిన్సస్ అలెసీ" అను నామె జబ్బుపడి, తిరిగి కుదుటఁబడక మిత్తినోటికిఁ బేలపిండి యయ్యె. ఎడ్వర్డు తనసోదరిమరణంబునకై మిగుల వగలఁ బొగులుచు రాచకార్యములలోఁ బ్రవేశింపక దుఃఖముతో నింటిపట్టుననే ఉండెను. "తగిన కాలునకె తగులును." అను సామెతచొప్పున నెడ్వర్డు తోఁబుట్టు వొకఁడు దక్షిణాఫ్రికాలోనుండు "జూలూలాండు" అనుచోట రణము సలిపి, స్వర్గస్థుఁడయ్యె ననుశోక వృత్తాంతము ఆయనకుఁ దెలిసెను. అతఁడు దానికై మిక్కిలి శోకించెను. కాని అతఁడు చావు మనుష్యజన్మము నొందినవారందఱకు నుండుట సహజమనియును, చచ్చినవారికై వగచుట పనికిమాలిన పని అనియును తలంచి నిశ్చింతతో నుండెను.

ఎడ్వర్డు, రణమున స్వర్గస్థుఁడైనరాకొమారుని జ్ఞాపకార్థమై వెస్టుమినిష్టరుగుడిలో నాతనిరూపు కలపటమును వ్రేలాడ వేయవలయు ననిచెప్పి, దానికిఁగాను 1,950 రూపాయలను ఇచ్చెను. అనేకులు దీనికి సమ్మతించలేదు. అయినను ఎడ్వర్డు తాను పట్టినపట్టు వదలక 1883 సం. జనవరినెలలో వుల్ విచ్చిలోని నాతని జ్ఞాపకార్థమై ఆతని యాకారము గల పటమును జనులకు గోచరమగునటులఁ జేయుటకుఁ దన చిన్నికుమారులు వెంటరా నాచోటికివెళ్లి, రాకొమారుఁడు, మాతల్లియైన విక్టోరియామహారాణికిఁగాను ప్రాణములు గోలుపోయినాఁడనియును అతఁడు దైవభక్తి సంపన్నుఁడనియును, వానిగుణములను

ప్రశంసించి, వానిపటముపై గల గుడ్డను తీసివేసి, లండనుపురికి నేతెంచెను.

1881 సం. న లండనుపురంబున లార్డుమేయరైన సర్ జార్జి మాకార్టి రను నాతఁడు, "కలోనియల్ ఇన్‌స్టిట్యూటు" లోని సభ్యులకు విందు చేసెను. దానికి రావలయునని ఎడ్వర్డునకు నాహ్వానము వచ్చెను. అతఁడాసమయమున నాచోటికి వెళ్లి అమెరికాలోని కన్నడాజనులు రాజభక్తిసంపన్నులనియును, తనకు వారియెడఁ బ్రీతివిశ్వాసములు కలవనియును నుడివి, తనయింటికి వచ్చెను.

ఇంగ్లండున నుండు చెందినవాండ్రు సముద్రమునఁ గల చేఁపలను బట్టి జనులు ఆమత్స్యములను గాంచునటుల నొక పెద్ద ప్రదర్శనశాలలోఁ బెట్టిరి. ఆప్రదర్శనమున నానావిధములైనచేప లుండెను. ఎడ్వర్డు దానిని దెఱిచి, పలువిధములైన చేఁపలను జనులు చూచునటులఁ జేసినందులకు చెందినవాండ్రు మిక్కిలి ప్రశంసనీయులని వారిని గొనియాడెను. చేఁపల అమ్మకమువలన 1,95,000, రూ. వచ్చుబడి వచ్చెను. ఈమొత్తములో మూఁడుపాళ్లు చెంబల్లలోఁ దల్లిదండ్రులు లేనిబాలురను బెంచుటకు నుపయోగింపఁబడెను. ఎడ్వర్డు ప్రదర్శనమును 1889 సం. న గావింపఁ జేసెను. ఆసంవత్సరమునసే, ఎడ్వర్డు తమ్ముఁడు ఫ్రాన్సురాజ్యమున దక్షిణభాగమునఁ గ్రుమ్మరుచుండి స్వర్గస్థుఁడాయెను. ఇందువలన నాతనికి నింకొకతడవ దుఃఖ

సంప్రాప్తమయ్యెను. ఎడ్వర్డు వెంటనే ఫ్రాన్సుదేశమునకు వెళ్లి తమ్ముని శవమును గొనివచ్చి విండురు భవనంబున సమస్త రాజ చిహ్నములతోఁ బూడ్పించెను.

ఎడ్వర్డలెగ్జాండ్రాలు అయిర్లెండునకు వెళ్లుట.

ఎడ్వర్డలెగ్జాండ్రాలు అయిర్లండునకు వెళ్లుదురని పత్రికలు చాటింపసాగెను. అయిర్లండుజనులును, అమెరికాలోని ప్రజలును, తమదొరను దొరసానిని జూచుటకుఁ బ్రముదితచిత్తులై యుండిరి.

అయిర్లండుజనులలో రెండు తెగ లున్నవి. మొదటితెగలో "నాషనలిస్టు" అనువారు చేరి యున్నారు. వీరు బలవంతులు. వీరికి దేశాభిమానము సంపూర్ణముగ నుండును. వీరు ఇంగ్లండుదొర తమ్ముఁ బాలించుట సాధారణముగ నొల్లరు. రెండవతెగవారు ఇంగ్లండుదొరయే తమ్ముఁ బాలింపవలయు నని కోరుచుండువారు. వీరెల్లప్పుడును దొరతనము వారి నాశ్రయించుచు వారివలనఁ దమ బ్రతుకు తెరువుగనుచు, వారిచ్చుబిరుదులచే నలంకృతు లగుచు, ఉండువారు. ఇట్టివారు మొదటితెగవారితోఁ గలియ రనుట నిర్వివాదాంశమే.

మొదటికక్షివారి పక్షమున నొకవార్తాపత్రిక ప్రచురమగుచుండెను. ఎడ్వర్డుప్రభృతు లైర్లండునకు వచ్చుటకు నిష్టపడమని తమపత్రికలో ప్రచురము సేసిరి. మఱికొందఱు వారిరాక విషయమై ఉదాసీనులై యుండిరి. ఇంకఁ గొందఱు ఎడ్వర్డును,

అలెగ్జాండ్రాను రావచ్చును, కాని, వారు వచ్చినారని బీదజనులు చెల్లించుపైకమును ఖర్చుచేసి వారికి విందులు మొదలగు వేడుకలు సేయఁ గూడదని వచించిరి. ఎంద ఱెన్నిరీతులఁ జెప్పినను, ఎడ్వర్డు ప్రభృతులు తమదేశమునకు వచ్చినపుడు, అల్లరి చేయఁగూడదని వారు నిశ్చయించుకొనిరి.

ఎడ్వర్డు సతీసహితుఁడై పెద్దకుమారుఁడు వెంట రా నైర్లండునకుఁ జనుదెంచెను. నేషనలిస్టుపార్టీవారు అల్లరి సేయక ఊరక ఉండిరి. కాని, రెండవకక్షివారు తమ రాజభక్తిని మేరలేక చూపినందున మొదటి కక్షివారు ఆగ్రహచిత్తులై కొంత రగడ సేయఁ బూనిరి. ఠాణాదారులు చాల మెలఁకువతో వారి నాఁపిరి. ఎడ్వర్డలెగ్జాండ్రాలు ఐర్లండు వాసి తమ దేశమునకు విచ్చేసిరి.

విక్టోరియామహారాణికి లోఁబడిన రాజ్యములలోను, హిందూదేశమునను, జేయఁబడినచిత్రవిచిత్రములైనవస్తువులను ప్రదర్శింపవలయునని ఎడ్వర్డు తలంచెను. అతఁడా యాదేశముల యందుండి వచ్చినవస్తుజాలంబుల నందంబుగ రాయల్ ఆల్బర్టు మందిరంబున నుంచి యుండె. దానికి "కలోనియల్ అండ్ ఇండియన్ ఎక్జిబిషన్" (Colonial and Indian Exhibition) అని పేరు. విక్టోరియామహారాణి ఆప్రదర్శనభవనంబును దెఱచెను. అప్పుడు ఎడ్వర్డలెగ్జాండ్రాలు విక్టోరియాను మిక్కిలి గౌరవించిరి. సమస్తవస్తువులు రమ్యములై కనుపట్టె. అన్ని

ఖర్చులు పోను 5,25,000లు. దానివలన నికరము ఆదాయము తేలెను.

విక్టోరియా మహారాణి గోల్డన్ జూబ్లి మహోత్సవము.

1886 సం. న "కలోనియల్ అండ్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్" (Colonial and Indian Institute) అను పాఠశాలను విక్టోరియామహారాణి గోల్డన్ జూబ్లి మహోత్సవసమయంబున నెలకొలుపవలయునని మేయరుప్రభువు ఎంచి, తనభావమును ఎడ్వర్డునకుఁ దెలియఁ జేసెను. ఇందులకు గాను గొప్పవారంద అును చందాలు వేసికొని పైకమును వసూలు సేసిరి. ఎడ్వర్డింతకుఁ బూర్వము "కలోనియల్ ఇండియన్ ఎక్జిబిషన్" కు గాను మిక్కిలి యక్కఱతో పాటుపడి దానిని నిర్వహించినందున, ఆయనకుఁ గొన్ని కానుకలిచ్చుటకుఁ గొంత పైకము వసూలయ్యె. అతఁడు తన కాసొమ్ము అక్కఱ లేదని చెప్పి, దానిని కలోనియల్ ఇండియన్ ఇన్‌స్టిట్యూటునకు నిమ్మని వచించెను. రాణిమంత్రులు లారొక్కమును ఆపాఠశాలకై వ్యయము సేసిరి.

ఇంజినియరుశాస్త్రము నేర్చి, ఆపనిలో నేర్పరులైన వారి నెడ్వర్డు ఆదరించుచుండెడివాఁడు. కొందఱు ఇంజినియర్లు "మర్సి" అను నదిమీఁద నొకవంతెనకట్టి, ఆవంతెన మీఁద నీటికాలువపోవునటులను, వానిక్రింద నేఱు ప్రవహించుచుండు లాగున నద్భుతకార్యమును జేసిరి. ఎడ్వర్డు ఆవంతెనపై నెల కొనిన కాలువతూమును దెఱచి నీటిని పాఱుదలఁ జేసెను.

ఆ సమయమున నాతఁడు వారిని బహుభంగుల మెచ్చుకొని యాదరించెను.

1887 సం. న విక్టోరియా మహారాణికి గోల్డన్ జూబ్లి మహోత్సవము నడిచెను. ఎడ్వర్డే అన్నిపనులను నిర్వహింప వలసి యుండెను. అతఁడు అన్ని యేర్పాటులు సేసెను. ఆమ హోత్సవము వెస్టుమినిస్టరు భవనంబున నాచరింపఁబడెను. అది విశేష వైభవముతోఁ గూడియుండెను. పరరాజు లనేకు లేతెంచి రాణిని బహు తెఱంగుల గౌరవించిరి. వారామెకు హితమతిని గానుకలను దెచ్చి యిచ్చిరి. ఎడ్వర్డు రాణికి మాఱుగ వారిని గౌరవించి వారికి విందులు సేసెను. అతఁ డన్ని సమయంబుల నారాణిప్రక్క నుండి ఆమహోత్సవము నత్యద్భుతంబుగ నడిపెను. నౌకాసేనకు నాతఁ డా సంవత్సరంబున నధిపతి యయ్యెా. అతని చిన్నకొడుకుగూడ నానౌకా సేనలో నుండె. అందే ఆతని పెద్దకుమారుఁడును ఉండెను.

ఎడ్వర్డలెగ్జాండ్రాల సిల్వరు వెడ్డింగు మహోత్సవము.

1888 సం న ఎడ్వర్డ లెగ్జాండ్రాల సిల్వరు వెడ్డింగు మహోత్సవము జరుపుటకు మంత్రులు గోరిరి. అందులకు వారనేకో యత్నములు సేసిరి. పురమును శృంగారించిరి. ఆమహోత్సవ దర్శనాగత రాజన్యనివహంబులు దిగుటకు విడుదులు సిద్ధము సేయఁబడెను. అన్నిపనులు పూర్తి యయ్యెా.

అప్పుడు జర్మనీదేశచక్రవర్తి మొదటివిల్లియము వార్ధ

కమున నవయుచుఁ గాటికిఁ గాలుచాఁచుకొని యుండెను. అతని మరణ మొకవేళ నామహోత్సవమునకు భంగము సేయునో అని రాణీప్రభృతులు చింతిల్లుచుండిరి. వారు తలంచినరీతి నా రాజ్యప్రభువు స్వర్గస్థుఁ డయ్యె. మహూర్తదినమున నందఱును శోకవేషము వేసికొనక వేడుకలు సల్పిరి. నాఁడు విక్టోరియా మహారాణియును మంత్రులును, రాజబంధువులును, పెక్కుమంది సామంతరాజ ప్రకరంబులును, మార్లబరో భవనంబున నుండిన ఎడ్వర్డలెగ్జాండ్రాలను జూడ వెళ్లిరి. అయిర్వురును వచ్చిన వారిని మిగుల గౌరవించిరి. విక్టోరియా నాఁడు తనబిడ్డలతో విందు కుడిచెను.

పెక్కుమంది శ్రీమంతులును, సామంతప్రభునిచయంబులును, పరరాజనివహంబులును, ఎడ్వర్డలెగ్జాండ్రులకు నజరులను దెచ్చి సమర్పించిరి. ఎడ్వర్డు తనభార్యామణికి నవరత్నములు పొదిగిన కంఠాభరణంబు లొసంగె. రుష్యారాజ్యపుఁ జక్రవర్తియును, చక్రవర్తినియును, అలెగ్జాండ్రాకు నవరత్నఖచితమైన కంఠాభరణంబును చదివించిరి. అలెగ్జాండ్రాయొక్క శిశువు బామెకుఁ దమకుఁ దోచినకానుకలను సమర్పించిరి. వీరుగాక ఎడ్వర్డలెగ్జాండ్రాలకు ననేకులు బహుమతులనుబంపి తమతమ రాజభక్తిని వెల్లడి సేసిరి.

ఎడ్వర్డుప్రభృతు లీవిధంబున నింగ్లండున వేడుకలు సేసికొనుచు నత్యుల్లాసంబున నుండ నాజర్మనీదేశపుఁ బ్రభువు ప్రెడ

రిక్కు అస్వస్థుఁడయ్యె. అతఁడు కాలక్రమమున రోగముచేఁ బీడింపఁబడి మిక్కిలి బలహీనుఁడయ్యె. అతఁడు మరణము నెందు నేమో అని ఎడ్వర్డు మొదలుగాఁ గలవారలు దిగులొందుచుండిరి. అయినను ఎడ్వర్డు గ్లాస్గోపురంబున సర్వవస్తుప్రదర్శనశాలను దెఱవఁ బోయెను. ఆపురవాసు లాయనను మిక్కిలి గౌరవించిరి. 1888సం. జూను నెల 14 వ తేదిని జర్మనిదేశప్రభువు తొంబది తొమ్మిదిరోజులు దేశమును బాలించి దీర్ఘనిద్రఁ జెందెను.

"లూయి" అను రాచకొమార్తె వివాహము.

1889 సం. ప్రిన్సెస్‌లూయి ఫైఫ్‌రాకొమారుని మదిఁ గోరి యుండెను. కాని ఎడ్వర్డు ఆరహస్యము నెఱుఁగఁడు. విక్టోరియామహారాణి ఉన్నట్టుండి ఒకనాఁడు సాండ్రింగుహాముభవనమునకు నేఁగి చిఱుతలజాడలు కనుఁగొనెను. అంత నాదే వేరి ఇంటికిఁ జనుదెంచి వారిరువురకుఁ బరిణయం బగు నని పత్త్రికలలోఁ బ్రకటన సేయించెను. జను లీశుభవార్తను విని, ప్రిన్సెస్‌లూయికి మంచివరుఁడు లభించె నని కుతుకంబున నుండిరి. లార్డుఫైఫ్ (Lord Fife) ఎడ్వర్డలెగ్జాండ్రాలకు నవీనుఁడు కాఁడు. అతఁడు వారియింటి కప్పుడప్పుడు వచ్చుచుఁ బోవుచు నుండును. అదియునుగాక అతఁడు వారియింటనే తఱచుగా వాసము చేయుచుండెను. కాఁబట్టి అలెగ్జాండ్రా తనకూఁతు నాఫైఫునకు నిచ్చి వివాహము సేయుటకు సమ్మతించెను.

అయిరోపాదేశములో నుండురాజకుమారులు ఎడ్వర్డు

జ్యేష్ఠపుత్త్రికను పాణిగ్రహణము సేయఁ గోరిరి. కాని ఎడ్వర్డు పరాయివానికిఁ దనపట్టి నియ్య నొల్లక ఆంగ్లేయప్రభువులలో నొకచిన్నవానికి నొసంగుటలో అధికలాభము కల దని ఆలోచించి వారిప్రార్థనల నంగీకరిపఁ డయ్యె. ప్రిన్సస్ లూయి అన్యుని వివాహ మాడెనేని, ఆమెకు నొకానొకసమయమున ఇంగ్లండు దొరతనము లభించులాగునఁ దటస్థించిన ఆమెయే రాజ్యమును బాలించుటకు ఆగ్లేయులు సమ్మతింతురు. కాని, ఆమె భర్తగాని ఆమెబిడ్డలుగాని దేశము నేలుటకు ఇష్టపడరు. ఈ కారణముచేతనే ఎడ్వర్డు తనముద్దుపట్టి నన్యదేశస్థున కియ్య నభిలషింపలేదు.

లార్డు ఫైపునకుఁ బెండ్లిరోజున "డ్యూక్ ఆఫ్ ఫైపు" (Duke of Fife) అను బిరుదు ఒసంగఁబడెను. బకింగుహాము అంతఃపురమునకుఁ జేరిన కోవెలలో నాపెండ్లి విశేషవైభవముగ నడిచెను. అప్పుడు విక్టోరియామహారాణియును, ఎడ్వర్డలెగ్జాండ్రాలును వారికొడుకులును, కడపటికూఁతును హెలనీసు రాజును, (King of The Hellenes) డెన్మార్కుయువరాజును హెన్సిప్రభువును వచ్చి వధూవరుల నాశీర్వదించిరి.

బాకార్టువ్యాజ్యమున ఎడ్వర్డు సాక్ష్యము చెప్పుట.

1890 సం. న హేమంతఋతువున ఎడ్వర్డు న్యాయస్థానమున నాయధిపతులమ్రోల నిలుచుండి సాక్ష్య మియ్యఁబోవు నని పుకారు పుట్టెను. జనులు కొంద ఱాగాలిమాటను

నన్నుక ఉండిరి. సర్ విల్లియమ్‌గార్డన్ కమ్మింగ్ (Sir William Gordon Cumming) అనునాతఁడు ఎడ్వర్డునకుఁ బ్రాణమిత్త్రి ము. కమ్మింగు తన్నుఁ గారణము లేక ఆర్తర్ విల్సనను వానిభార్యయును, లిసెట్ గ్రీనును, వాని ప్రాణమిత్త్రిము ను, బెర్క్లీ లెవెట్టనునాతఁడును, తిట్టినారని వారిపై మానసష్టపు దావా తెచ్చెను. "కాలరెడ్జు" అనునాతఁడు న్యాయాధిపతి. ఎడ్వర్డు సాక్ష్య మియ్య వలయు నని గార్డను కోరెను. ఆయ నకు న్యాయాధిపతి పిలుపు (Summons) పోయెను. ఎడ్వర్డు న్యాయాధికారి యానతిచొప్పున న్యాయస్థానమున హాజరయ్యె. న్యాయాధిపతి ఆయనకుఁ గూర్చుండుటకు నాసన మిచ్చెను. వ్యాజ్యము విచారణ చేయఁబడెను. ఎడ్వర్డు సాక్ష్య మిచ్చువారు నిలుచుతావున వచ్చి నిలిచెను. ఉభయకక్షులవారి న్యాయవాదు లాయనను లేనిపోని ప్రశ్నలువేసి తప్పుదారులకు లాఁగఁ జూచిరి. కాని ఆయన వారికుత్రులకు జేలుపోక నిజము సెప్పెను. ఆవల విచారణ ఏడుదినములు సాగెను. కడపట ప్రతివా దులు దోషు లని పంచాయతీలు చెప్పిరి. వేల్సుయువరాజు లింతకుముం దనేకు లుండిరి. వారిలో నేప్రభువును ఇంతదనుక సాక్ష్య మెచ్చుటను జెప్పినట్లు లగపడదు. మన యెడ్వర్డే సాక్ష్యము సెప్పినవారలలో మొదటివాఁడు.

1891 సం. న మేనెల 17 వ తేదిని హైపెప్‌రాణియందు "హైపు డ్యూకు" అను ప్రభువునకు నొక యాఁడుబిడ్డ పుట్టెను.

ఎడ్వర లెగ్జాండ్రాలకు మనుమరాలు జన్మించె నని అందఱును సంతసించిరి. ఆచిన్నపిల్లకు "లేడి అలెగ్జాండ్రా డఫ్" అని పెద్దలు పేరిడిరి.

డిసంబరు నెల మనయెడ్వర్డు కుటుంబమునకు నేదో ఒక కీడు వాటిల్లునట్టి చిహ్నములుకాన్పించెను. 1891 సం. న డిసంబరునెల వృథాగా ఊరక పోవునే. ఎడ్వర్డు చిన్నకొడుకు జార్జి రాకొమారుఁడు రోగపీడితుఁ డయ్యె. ఈ సమాచారము లివిడియాకు వెళ్లిన ఎడ్వర్డలెగ్జాండ్రాలకుఁ జేరెను. వారు ఎకాయెకిని లండనుపురికిఁ జనుదెంచిరి. ఇంతలో నాతనిదేహము కుదుటఁబడెను.

ఎడ్వర్డు పెద్దకొడుకు మృతుఁడగుట.

జార్జి యన్న క్లారెన్సుప్రభువు "టెక్కు" యొక్క రాజకొమార్తను వరించె నని పత్త్రికలు వెల్లడి చేసెను. వారిద్దఱకు వివాహప్రయత్నములు నడుచు చుండెను. క్లారెన్సుప్రభువు చిఱుత యైనను, బుద్ధిలో నందఱకన్న మిన్న యని సన్నుతిఁ గని యుండెను. ఆతఁడు అడఁకువయును, పెద్దలయెడభక్తియును, చిన్నలయందు ననురాగంబును, బీదలయెడఁ గరుణయును, కార్యములు సేయుటలోఁ బట్టుదలయును, నీ మొదలగు సద్గుణపుంజంబులకు నిర వై అందఱకు నల్లారుముద్దుగ నొప్పారు చుండెను. ఎట్టిదైనను మృత్యుదేవతకు ముద్దా ?

1892 సం. న జనవరినెల ఎడ్వర్డలెగ్జాండ్రాల గారాబు

పట్టి యైన క్లారెన్సు ప్రభువు రోగపీడితుఁ డయ్యె. తల్లిదండ్రులు అతని సమీపంబుననే ఉండి, రాచకార్యముల నన్నింటిని గమనింపక తమబిడ్డ సేమమే కోరుచు వైద్యులవలన దివ్యౌషధముల నిప్పించుచుండిరి. ఆయువు పరిమితి ముగియు కాలము సమీపించినపుడు, మందులు పనిచేయునే? అతనికి రోగము ముదిరెను. వైద్యులు ఆపపికూన బ్రతుకఁ డని నిశ్చయించుకొనిరి. అట్లే ఆతఁ డా నెల 14 వ తేదిని పరలోకగతుఁ డయ్యెను. అతనిదేహము సమస్త రాజచిహ్నములతో సమాధి చేయఁబడెను.

ఎడ్వర్డ లెగ్జాండ్రాల పుత్త్రశోకము నార్ప నెవరితరము? దాని యుఱవడి మొదట మొదట దీర్ఘముగను, వాడిగాను, ఉండును. క్రమముగ దాని నాడిమొన, నేలలోని పల్లము క్రమముగఁ బూడిపోవురీతిని మొద్దగు చుండును. ఇంతలో నామరణవార్త సమస్తరాజ్యములకును వాయువేగ మనోవేగములఁ జేరెను. ఆయాచోటుల నుండు గొప్పవారు విక్టోరియాకును, ఎడ్వర్డలెగ్జాండ్రాలకును, ఉపచారవార్తలను బంపిరి. ఎడ్వర్డలెగ్జాండ్రాలు తమ రాజ్యములయందలి జనులు తమకు పంపిన యూఱట పలుకులవలనఁ దమ యుమ్మలికంబు నుపశమనము నేసికొని ఊఱడిల్లిరి.

కాంటెర్బెరి అర్చిబిషప్, ఎడ్వర్డునకు నూఱటవార్త

పంపెను. ఆమహారాజకుమారుఁడు ఆమతగురువునకు నీరీతిని బదులుజాబు వ్రాసెను.

"చావు అందఱకు వచ్చుట సహజము. మా చిన్నవాఁడు మాకొక్కరికే గాక, లండనుపురిలో నందఱకు మంచివాఁడై పేరు పొందెను. అట్టివానికి మృత్యువు వచ్చుట ఆశ్చర్యముగ నున్నది. చిన్నవా రుండి పెద్దలు పోవుట సహజము, విపరీతముకాదు. అయినను దైవకార్యము నాఁప నెవరితరము? ఆతనిచావువలన మాకుఁ గలిగినదుఃఖము మమ్ముల విడిచి యెన్నఁటికిని బోఁజాలదు. అది మమ్ముల నెప్పుడు పీడించు చుండును. వానికి నిప్పుడె ఇరువదేండ్లు నిండినవి. ఈనెలలో నొకానొకదినంబున మేము ఆచిన్నవానికిఁ బెండ్లి సేయవలయు నని తలంచి యుంటిమి. అయ్యో! మాకోరిక లన్నియు నిష్ఫలము లయ్యెను. ఎంతవిపరీతకాలము! ఎంతదురదృష్టులము! వానిని బెండ్లి యాడఁ గోరినచిన్నది వానికిఁ బెండ్లము కాకముందే వైధవ్యమును జెందె. పసికూన. ఎంతదుఃఖము!

భగవంతునిమాయఁ గన్నవా రెవ్వరు? అన్ని కార్యములు భగవదధీనములు. దుఃఖించి ప్రయోజన మేమి? మాముద్దుబిడ్డఁడు చచ్చి స్వర్గలోకమున సమస్త సౌఖ్యముల ననుభవించు చున్నాఁడు. అతఁ డిహలోకమున నుండి దుఃఖములకుఁ బాల్పడుటకంటె, పరలోకముననుండి సుఖములు గనుట మేలు కాదె! మిగిలినవారిని జూచి దుఃఖమును కొంత శాంతిపఱుచుకొని ఉన్నారము."

ఎడ్వర్డు లెగ్జాండ్రాలు దుఃఖ ముపశమించువఱకు నేవ్యవహారములు సేయక ఇంటిపట్టుననే ఉండి కాలమును గడపుచుండిరి.

కూలి సేసికొని బ్రతుకుబీదలను ఎడ్వర్డు ఆదరించుట.

ఎడ్వర్డు తన పెద్దకొమరునిచావువలన దుఃఖము నొందుచుండి

రాజకార్యములలో నెంతమాత్రము ప్రవేశింపక ఉండెను. నివసించుటకు ఇండ్లను ఏర్పాటు సేయుటకు నొక కమిషను ఏర్పడెను.

"కమిషన్" అనఁగా సభ. ఇందు నలుగు రైదుగు రుందురు. అయిదు మందికి వారిలో నొకఁడు అధ్యక్షుఁడుగ నుండును. వానికి "ప్రసిడెంటు" అని పేరు. "ప్రసిడెంటు" అను నింగ్లీషుపదమునకు "అధ్యక్షుఁడు" "అధికారి" "యజమానుఁడు" "నేత" "అధిపతి" మున్నగునవి సమానపదములు.

ఆ సభకు నెడ్వర్డు సభాధ్యక్షుఁడు. అతఁడు బీదలకు మేలు సేయవలయు ననువార్తను విన్నవెంటనే ఆయనచిత్తంబు నాక్రమించుకొనినశోకము పరారిచి త్తగించెను. ధైర్యలక్ష్మి ఆయనయందుఁ జొరబడెను.అతఁ డాబీదలకై మిక్కిలి ప్రీతితోఁ బాటుపడెను. అయినను రాణిమంత్రులు ఎడ్వర్డు బీదలయెడ నధికప్రీతినిఁగనబఱచుట నొల్లక ఉండిరి. అతఁడు వారిమాటలఁ బెడచెవి నిడి తనయిష్టానుసారముగ న్యాయధర్మములమేర నతిక్రమింపక బీదలకు సౌఖ్యమొదవఁ జేయుటలో నక్కఱతోఁ గష్టపడి పనిచేసెను. ఆతఁడు కూలీలసంఘమునకును, వారు చదువు బడికినిఏఁటేఁట ద్రవ్యసాహాయ్యము సేయుచుండెడివాఁడు. అతఁడు తాను "ఇంపీరియల్ ఇన్‌స్టిట్యూట్" అను విద్యాలయమును స్థాపించి,తనతల్లిసాయంబున దానిని బెంచి,వృద్ధికిఁ దీసికొని వచ్చెను.

ప్రిన్సు జార్జి పెండ్లి.

ఎడ్వర్డు పెద్దకొమారుఁడు పెండ్లిగాక స్వర్గస్థుఁ డయ్యె.

రెండవకుమారుఁ డాతనివెనుక రాజ్యమునకు రాఁదగినవాఁడు. ఎడ్వర్డు జార్జికిఁ బెండ్లి సేయఁగోరెను. జార్జి టెక్కు-రాజ్యపు రాజపుత్రికయగు మేరిని వరియింప నెంచెను. ఎడ్వర్డీరహస్యంబు గ్రహించి వారిరువురకును వివాహము సేయవలయు నని పత్రికలలోఁ బ్రచురము సేయించెను. అతఁడు తల్లియగు విక్టోరియాతోఁ నాలోచించి 1894సం. న జూలైనెల 6వ తారీఖున పెండ్లిమూరుతం బిడెను. వివాహము సెయింట్ జేమ్సు చేపలున నడిచెను. ఆసమయంబున రుష్యాచక్రవర్తియును, డెన్మార్కు-రాజును, రాణియును, ఇంకను పెక్కు-మంది శ్రీమంతులును, సామంతప్రభువులును వచ్చి వధూవరులకుఁ గానుకల నొసంగిరి. జను లావివాహమువలనఁ దమకు దొడ్డమేలు కలుగు నని కోరిరి. ఎడ్వర్డు తనకుమారరత్నమునకు వివాహము సేసి, ఆయనను రాచపనులలోఁ బ్రవేశింపఁ జేయఁ బ్రయత్నించు చుండెను.

1894సం. న ఏప్రిలునెలలో స్వర్గస్థురాలైనప్రిన్సస్ అలిసుయొక్క-కుమారునకు ఎడ్వర్డుతండ్రివంశస్థులలోఁ జేరిన "విక్టోరియామెలిటా" అను రాకొమార్తను ఇచ్చి కోబర్గున నడుచు వివాహమునకు ఎడ్వర్డు వెళ్లెను. ఆవివాహమహోత్సవతరుణంబున విక్టోరియామహారాణి, జర్మనీచక్రవర్తి యను నగుగొప్ప ప్రభువులు వచ్చియుండి వధూవరుల నాశీర్వదించి తమతమ రాష్ట్రములకు నేఁగిరి. ఎడ్వర్డావల భార్యాసహితుఁడై ఆగస్టు

నెలలో రుష్యారాజధాని యగు సెంటుపీటర్స్బర్గులో రుష్యా దేశచక్రవర్తికిని, గ్రాండ్ డచెస్ క్రిశ్చియానాకును, జరిగిన పెండ్లి వేడుకులను గాంచుటకు వెళ్లి తనదేశమునకు మరల విచ్చేసెను.

రుష్యాచక్రవర్తి వివాహసమయంబున నారోగ్యదశ నుండలేదు. ఎడ్వర్డిలు సేరినతోడ్తో నాతఁడు మిగులరోగ పీడితుఁడయ్యె. ఈయశుభవార్త ఎడ్వర్డలెగ్జాండ్రలనుఁ జేరెను. వారు అక్టోబరునెలలోఁ బయనమై ఆస్ట్రియాకుఁ జేరునప్పటికి నారుష్యాజారు స్వర్గస్థుఁడయ్యె ననువార్త వారిచెవిని బడెను. వారంతట సెంటుపీటర్సు బర్గునకు వెళ్లిరి. రుష్యాదేశచక్ర వర్తిపరలోకక్రియలు సమస్తరాజచిహ్నములతో జరుగుచుం డెను. ఇంగ్లండునుంచి జార్జిరాకుమారుఁడు సెంటుపీటర్సుబర్గు న నుండిన తల్లిదండ్రులఁ జేరెను. అవలఁ గొన్నాళ్లలోనే రుష్యాదేశచక్రవర్తిచిన్నకుమారునకును, 'హిస్సి' అనుచిన్నరాజకూఁతురైనఅలెగ్జాండ్రాకును వివాహము జరిగెను. ఆపెండ్లి ముగిసినవెంటనే ఎడ్వర్డలెగ్జాండ్రాలు తనయుఁడు వెంటఁ జనుదేర నింగ్లండుఁ జేరిరి. ఎడ్వర్డీరీతి నాయారాజ్యములకుఁ బలుమాఱు వచ్చుచుఁ బోవుచునుండుటచే నాయారాష్ట్రములకును, ఇంగ్లండునకును, గల మైత్రి చెలంగ కలహము లేనైన నుండిన నవి రూపుమాయుచుండెను.

ఎడ్వర్డలెగ్జాండ్రులు వేల్సురాజ్యమునకు వెళ్లిరి. అచ్చట

నుండు వెల్సుజనులు ఆరాజదంపతులను మిగుల గౌరవించిరి. అప్పుడు ... ... ఎడ్వర్డు వేల్సు రాజ్యముయొక్క రాజకుమారుఁ డనుబిరుదు "వేల్సు" అనురాజ్యమువలన వచ్చిన దని తలంచి అందు సర్వకళాశాలను స్థాపించుటకు నుద్యమించి సఫలీకృతయత్నుఁ డయ్యె. అచ్చట సర్వకళాశాల యొకటిస్థాపింపఁబడెను. "ఆబిరిస్ట్విత్" (Aberystwith) అను పట్టణంబున అతఁడు దానికి అధ్యక్షుఁడై 1896 సం. జూనునెలలో ఆ హోదాను వహించి, గ్లాడ్స్టను మున్నగు దొడ్డవారి సమక్షమునఁ దనయిల్లాలికి నొకబిరుదు నొసంగెను. డెన్మార్కు రాకొమారునకు ప్రిన్సెస్ మాదును ఇచ్చి అతఁడు జూలై నెలలో బకింగుహాముభవనంబునఁ బెండ్లి చేసెను. విక్టోరియామహారాణి ప్రభృతు లాపరిణయమును జూచి సంతోషించిరి.

### విక్టోరియా డైమెండుజూబిలి మహోత్సవము.

విక్టోరియామహారాణి ఇగ్లండుసింహాసనము నలంకరించి పెక్కేండ్లయిన దని మంత్రు లాదేవేరికి డైమెండుజూబిలి మహోత్సవము సేయవలయు నని నిశ్చయించుకొనిరి. ఎడ్వర్డుప్రభృతు లీయాలోచన సమంజసం బై ఉన్న దని అంగీకరించి, 1897సం.న విక్టోరియాజూబిలిమహోత్సవమును అత్యద్భుతంబుగ కావించిరి. పెక్కుమంది పరదేశరాజులు విచ్చేసి, రాణికి బహుమతులను సమర్పించిరి. ఎడ్వర్డు, మహోత్సవమును

వీక్షింప నేతెంచిన ప్రభు ప్రకరంబుల ననేకభంగులఁ దృప్తిపఱిచి, వారిని వారివారి రాజ్యంబులకుఁ బంపెను.

ఇంగ్లండు దీవినుండు "స్పిట్టుహెడ్డు" అనురేవుపట్టణంబున నాంగ్లేయులయుద్ధనావలు సముద్రంబునఁ గూడెను. అవి చూపరుల కనులపండువై యొప్పారుచుండెను. ఎడ్వర్డు రాణికిమాఱుగ నాతావునకు వెళ్లి, ఆయోడలయందలి సైనిక నికాయంబులఁ గాంచి మహాసంతోషమునుబొందెను. అన్యదేశరాజులును తమ తమ యుద్ధనావలను ఇంగ్లండునకును తమకును గల మైత్రిని వృద్ధిపఱుచు నిమిత్తము పంపిరి. ఆంగ్లేయుల యుద్ధనావలఁ గాంచి పరరాజుల గుండెలు బ్రద్దలగుచుండెను.

విక్టోరియా డైమెండుజూబ్లిమహోత్సవసమయంబున నారాణి అనేకులకుఁ బెక్కుబిరుదుల నొసంగెను. అప్పుడా రాణి వేల్సుయువరాజునకు "గ్రేట్ మాస్టర్ అండ్ ప్రిన్సిపల్ నైట్ గ్రాండ్ క్రాస్ ఆదిఫ్ మోస్ట్ ఆనరబిల్ ఆర్డర్ ఆఫ్ దిబాత్" (Great Master and Principal Knight Grand Cross of the Most Honourable order of the Bath) అను బిరుదునలంకరింపఁ జేసెను. లండనుపురంబుననుండు "రాయల్ కాలేజి ఆఫ్ ఫిజిషన్స్" (Royal College of Physicians) అధికారులు ఆవైద్యాలయసభలో నొకసభ్యునిగ నాయెడ్వర్డును గైకొనిరి. అతఁడు తనకీపదవి లబ్బినందులకు మిక్కిలి సంతసించి, ఆవైద్యా

లయమును మే లైనస్థితికిఁ దెచ్చుటకు సర్వకాలంబుల నుద్యమించు చుండెను.

1897సం. అక్టోబరు నెల 27 వ తేదిని ప్రిన్సుజార్జి అత్తగారును, టెక్కు-రాజ్యము నేలికసానియును, అయిన ముసలియిల్లాలు కాలధర్మము నొందెను. దానివలన నారాజకుటుంబమున కంతయు దుఃఖ మావహిల్లెను. కాని అది దీర్ఘకాల ముండక కడువడిగ సమసి పోయెను.

ఎడ్వర్డు మోకాలు బెణుకుట.

1898సం. న ఎడ్వర్డు ఫ్రాన్సురాజ్యమున మధ్యధరా సముద్రతీరంబున నుండు కాన్సు (Cannes) అను పురంబునకు వెళ్లెను. అతఁడా నెల10వతారీఖున నొకభవనంబు నిర్మించుటకు న స్తిభారమును వేసి వా రిచ్చిన నాతిథ్యంబు వడసి,తనరాజ్యమునకు నేతెంచునపుడు బాటలోనుండు పారిసువీటఁ గొంతకాలము విశ్రమించి, అచ్చట ప్రజాపరిపాలనాధికారిని (President of the French Republic) దర్శించి తనవీటికిఁ బుత్తెంచెను.

ఫ్రాన్సురాజ్యమునకు రాజధాని యైనపారిసునగరంబున నొకప్రదర్శనము 1900సం. న జరుగునటుల నిశ్చయింపఁబడెను. ఇంగ్లండులోని వస్తుశాలాప్రదర్శనమునఁ జక్కఁగఁ గనఁబఱుప వలయు నని రాణిపుత్రు లాలోచించి "రాయల్ కమిషన్" అను నొకసభను ఏర్పాటునేసి దానికి ఎడ్వర్డును ఒడయునిగ నియమించిరి. ఎడ్వర్డు తన ధర్మమును న్యాయముగ నొనర్చి మంచిపేరు వడసెను.

మే నెలలో గ్లాడ్‌స్టను నను దొడ్డమంత్రి పరలోకగతుం డయ్యె. రాణికిం గుడిభుజ మని చెప్పం దగునాతఁడు పోవుట ఆంగ్లేయుల రాజ్యమునకు గొప్పనష్ట మని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. ఎడ్వర్డును ఆయనచావునకు మిగులఁ గుంది, ఆతని పెండ్లమును ఊఱడించెను.

జూలై నెల 18వ తేదిని ఎడ్వర్డు "వాడ్‌స్‌డెన్" అను చోట నుండు "బారన్‌ఫర్డినాండ్‌డిరోత్‌స్‌చైల్డ్" (Baron Ferdinand de Roths child) అనునాతనిఁ జూడవెళ్లి మిద్దె క్రిందికి దిగునపుడు కాలు జారి పడెను. మోకాలిచిప్ప ఊడెను. నుండిఅందుచే బైటికి రాక ఉండెను. అతఁడా నొప్పిని సహించుకొని నాఁటిమధ్యాహ్నంబున మార్ల్బరోభవనంబునకు నేతెంచెను. గాయము వలని బాధ రానురాను వృద్ధినొందెను. అనేకులెడ్వర్డు కుంటివాఁ డగు నని భీతిల్లిరి. మఱికొందఱు కొయ్యనూతగాఁ గైకొని దానిసాయంబున నడుచునేమో కాని, ఇఁక నడువఁ డని గొణుగుచుండిరి. దైవాజ్ఞ ఎటు లున్నదో ఎవరెఱుంగుదురు.

లండను నగరంబున నుండు గొప్పగొప్ప శస్త్రవైద్యులెల్లరును వచ్చిరి. వారివలన నాగాయము కుదురునటులఁ గనఁబడలేదు. ఒక్కదొరసానికి ప్రాణమునుపోసిక చాల కాలము వఱకు నాపిన సర్‌థామస్‌స్మిత్తు (Sir Thomas Smith) అనువతనిని రాణిమంత్రులు పిలిపించిరి. అతఁడు వచ్చి ఎడ్వర్డు

మోకాలు పరీక్షించి శీఘ్రముననే కుదిర్చెద నని చెప్పెను. రాణిప్రభృతులకుఁ గొంత ధైర్యము వచ్చెను.

ఇంతలో 21వ తేదిని లార్డులిస్టరనునాతఁడు ఎడ్వర్డు గాయమును పరిశీలించెను. ఎడ్వర్డు అతనితోఁ దనకు గాలు బెణికినవిధము నంతయును బూసగ్రుచ్చినరీతిని జెప్పెను. వైద్యులందఱును చేరి, సముద్రయానము చేసి, ఆస్బోరున నుండిన రోగము శీఘ్రముగఁ గుదురు నని తీర్పు చేసిరి. ఎడ్వర్డు వారి యిష్టము చొప్పున నాస్బోరులో నుండుటకు సమ్మతించెను. విక్టోరియాకూడ నాచోట నే ఉండెను. ఆమె తనకుమారుని రోగము కుదుటఁ బడువఱకు నతనియొద్ద నుండుటకు మిక్కిలి సంతోషించెను. ఎడ్వర్డు తనతల్లికడ కేగుటకు ముందు, మేడమెట్లపైఁ బడినపుడు తనచెంగట నుండి శస్త్రము సేసి మందు మాకు లిచ్చిన డాక్టర్ షా అను వైద్యునకుఁ బచ్చలుతాపిన బంగారుపతకంబును బహుమతి నిచ్చెను. ఆవైద్యుఁడు దానిం గైకొని రాకొమారునెడఁ గృతజ్ఞత కలవాఁడై ప్రముదితహృదయుం డయ్యె. జూలై నెల 30 వ తేదిన నే అలెగ్జాండ్రాను, ప్రిన్సస్ విక్టోరియాను, గ్రీసుదేశపురాజును, ఎడ్వర్డువెంట నాస్బోరునకు వెళ్లిరి.

ఎడ్వర్డు రోగము అభిముఖమునకు వచ్చుచుండెను. అందఱును కొంత ధైర్యము వహింప సాగిరి. ఎడ్వర్డుప్రభృతులు నావపై సముద్రయానము సేయఁ గడంగిరి. వారాయా రేవులలో

నిలుచుచు, భూమిమీఁదఁ గొన్ని గడియలకాలము బండ్లపై సికారి సేయుచుఁ దిరిగి ఓడ నెక్కి కడలిపై దారి సాగఁజేయుచుఁ బరిపరివిధముల నెడ్వర్డుమనస్సున కెక్కురీతిని తిన్నగఁ బయనము సేయుచుండిరి. ట్రిప్పనునాతఁడు ఎడ్వర్డు సమీపంబున నుండి ఆరుచుండుగాయమునకు మందులు వేయుచుండెను.

ఎడ్వర్డీరీతిని గాయమువలన బాధపడుచుండినను, కేపుటౌనున నుండుజనులు ఓకుమ్రాని స్తంభ మొకటి కావలయు నని కోరి యుండిరి. ఎడ్వర్డు వారికోరిక చెల్లించుటకుఁ దాను వ్యాధిగ్రస్థుఁ డయ్యును, ఎంతమాత్రమును ప్రాలుమాలక దానిని సంపాదించి, వారికి పంపి, వారికృతజ్ఞతకుఁ బాత్రుఁ డయ్యె. ఎడ్వర్డొరులకు నుపకారము సేయుటలో స్వసౌఖ్య లాభముల నంతగఁ బాటింపఁడు. కేపుటౌనున నుండుజను లాతనియెడఁ దమకుఁగల రాజభక్తివిశ్వాసముల ననేకభంగులఁ దెలియఁ బఱిచిరి.

ఎడ్వర్డు గాయము కుదిరెను. అంద అనుకొన్న విధంబున నాతఁడు కుంటివాఁడు కాఁడయ్యె. జనులందఱును తమచేని ప్రబలమైనవ్యాధి కుదిరి నెమ్మదిగ నుండుటకు సంతోషించిరి. ఎడ్వర్డే స్కాట్లండనకుఁ జనుదెంచి, ఆచోట నుండి లండనుపురికి నేతెంచెను. అచ్చట "లీగ్ ఆఫ్‌మర్సి" (League of Mercy) నాతఁడు ప్రసగించి, ఆనగరంబున నమరిన వైద్యశాలకు ద్రవ్య మియ్యవలయు నని నొక్కి వక్కాణించెను.

1899 సం. న జర్మనిదేశముయొక్క రాజును, రాణియును, లండనుపురికి నేతెంచిరి. ప్రజలు వారి రాకను గుఱించి పరి పరి విధంబుల డెందంబులలోఁ దలపోసికొనిరి. అప్పు డాఫ్రి కాలో బోయరులకును, ఆంగ్లేయులకును గొప్పయుద్ధము నడు చు చుండెను. అందుఁ దొలుదొల్త నాంగ్లేయులు పరాభవ మొందుచుండిరి. జర్మనిచక్రవర్తి ఆయుద్ధవిషయమై ఇంగ్లండు ప్రభుత్వమువారితో మాటలాడి పోవుటకు వచ్చె నని కొందఱు తలంచిరి. కాని ఆతఁ డాసంగతిలోఁ దా నెంతమాత్రమును ప్రవేశింపక తన యవ్వ విక్టోరియామహారాణిని గాంచి తనరా జ్యమునకు వెళ్లెను.

అనామధేయుఁ డొకఁడు ఎడ్వర్డును దుపాకితోఁ గాల్ప నుద్యమించి విఫలప్రయత్నుఁ డగుట.

1900 సం. ఏప్రెలునెలలో నెడ్వర్డలెగ్జాండ్రులు డెన్మా ర్కు రాజధాని యగుకోపను హేగనుకు వెళ్లవలయు నని లండను వదలి రైలుమార్గమునఁ బయనము సేయు చుండిరి. వారు బ్రసల్సుపురంబున "నార్డు" అనురైలుస్టేషనులో బండి నెక్కిరి. అప్పుడు "స్పీడో" అనువాఁడు కేలఁ దుపాకిఁ గొని ఎక్కు పెట్టి ఎడ్వర్డు పయిని కాల్చెను. కాని భగవత్కృపాకటాక్ష మహిమచే నాదెబ్బ నెడ్వర్డు తప్పించుకొని ప్రాణమును కాపాడు కొనెను. అతఁడు ధీరసత్త్వుఁడై తోడ్తోఁ దన తల్లికి నా సమాచారమును బంపి, ప్రయాణమును సాగించెను. "స్పీడో"

అను వానిని ఠాణాదారులు పట్టుకొని ఖైదీ చేసిరి. వాఁడు 'బోయరు యుద్ధమున ననేకులు అన్యాయముగ ప్రాణములను గోల్పోవు చున్నారు. ఇది న్యాయయుద్ధము కాదు. ఎడ్వర్డిట్టి యుద్ధము సలుపుటకు సమ్మతించెను. ఈ రాజు రణమునకు సమ్మతింపకున్న యుద్ధ మే పొసఁగి యుండదు. ఇప్పు డాయుద్ధ మున నెందఱు మడియు చున్నారు. వారి ప్రాణము ఇతనివంటి ప్రాణము కాదా? విక్టోరియా ఆతనిని గన్న రీతిని వారి తల్లులు వారిని గన లేదా? ఇతనివలె వారు మనుష్యులు కారా? వారి నెత్తురు ఇంగ్లండునకై సమర్పింపఁ గోరిన యీ యెడ్వర్డు తన నెత్తు రీదేశమున కై ఇచ్చుటకు నియ్యకొన్నాఁడా? నే నొకఁడును, మీరు పదుగురు. పదుగు రన్యాయము చెప్పినను, న్యాయమే అగును. ఒకఁడు న్యాయము చెప్పినను అన్యాయ మగును.' అని మందలించెను. అయిరోపాఖండములో వార్తా పత్త్రికలు ఈ యుద్ధవిషయ మై పెక్కువ్రాఁతలు వ్రాసి యుండినవి. ఈ స్వీడో వానిని జూచి కలతఁ బాఱినహృదయము కలవాఁడై రాజద్రోహులతోఁ జెలిమిసేసి ఎడ్వర్డుప్రాణము గొన నుద్యమించి విఫలప్రయత్నుఁ డయ్యె.

ఎడ్వర్డ లెగ్జాండ్రులు దైవాధీనమున మృత్యువువాతనుండి బైటికి ప్రాణముతో వచ్చినందునఁ బునర్జీవితు లైరని ఇంగ్లం డులోని ప్రజలును, అయిరోపాలోని పరరాజనికరంబులును, తమ యానందంబును పెక్కుతెఱంగులఁ దెల్పిరి. ఎడ్వర్డలె

గ్జాండ్రులు డెన్మార్కునుండి ఏప్రెలునెల 20 తేదిని ఇంగ్లండు నకు జనుదెంచిరి. ఎడ్వర్డు, తనయెడల జనులకుఁ గల రాజ భక్తిని దెలుపుచు వ్రాసినందులకై, అతఁడును వారియందు గల కూర్మిని నెఱుక పఱుచు సమాచారంబులఁ బంపి వారిని సంతోష పఱిచెను.



## తొమ్మిదవ అధ్యాయము.



### ఎడ్వర్డు రాజ్యమునకు వచ్చి పట్టాభిషిక్తుఁ డగుట.

విక్టోరియా మహారాణి ముసలితనంబున మేనువడంక రాజ్యమును లెస్సగఁ బాలించు చుండెను. ముసలి పండు చెట్టునుండి ఊడిపడ సిద్ధముగ నుండెను. ఇంతలో మృత్యుదేవత అను ఫలాభిలాషి తన గడ అనురోగముతో నాపండునుగోయఁ బూనెను. ఆగడ ఆఫలమును తాఁకితాఁకక ముందే నేలమీఁదఁ బడున ట్లుండె. విక్టోరియా మహారాణి వ్యాధిచేఁ బీడింపఁబడు చుండినను, మరణావస్థను సహించుకొని 1901 స. జనవరి నెల తే 22 వ దిని స్వర్గస్థురాలయ్యె. అప్పు డాదేవేరి పుత్రు లును, పుత్త్రికలును, పౌత్త్రులును, ప్రపౌత్త్రులును, ఆమె సమీ పంబున నుండిరి. ఎడ్వర్డు తల్లిచావునకై దుఃఖించు చుండెను. మంత్రులేతెంచి ఆయన శోకము శాంతింపఁ జేసి రాజ్యభార మును వహింపఁ బ్రోత్సాహపఱిచిరి.

ఎడ్వర్డు తన యమ్మలికంబు నుపశమింపఁ జేసికొని, తల్లికిఁ బరలోకక్రియలు నిర్వర్తించి రాచకార్యములు సేయఁ బూనుకొనెను. మఱునటిదినంబున నాతఁడు సెంట్ జేమ్సు నగరున ఇంగ్లండుదేశ రాజకార్య ధురంధరుల మ్రోల నిట్లు ప్రసంగించెను:—

"మాతల్లిగారు చనినతోడ్తో రాజ్యభారమంతయును మేము వహింపవలసినవారమై యున్నారము. మేము మనదేశచట్టములను లోఁబడి క్రమము తప్పక రాజ్యముఁ బాలింపవలయు ననియు, మాప్రాణ మున్నంతవఱకు ప్రాణ ముండుపర్యంతము మాజనులను క్రమమార్గమునఁ బాలించి వారు మంచిదశకు వచ్చుటకుఁ బాటుపడు చుందు వారము.

మాకుఁ బూర్వము మావంశస్థులలో నార్గురు రాజులకు నెడ్వర్డని ఉండినపేరుతో నేను ఏడవయెడ్వర్డని వ్యవహరింపవలయు నని నిశ్చయించుకొని ఉన్నాను. సత్యమార్గమున నడిచి, లోకులకు మేలుసేసి, జగద్విఖ్యాతయశులును, కీర్తిశేషులును, ఆయిన మాతండ్రిపేరను 'ఎడ్వర్డు' అను నామము నకు ముందుఁ జేర్చి, 'ఆల్బర్టు ఎడ్వర్డు' అని జనులు నన్నుఁ బిలుచుటకుఁ గోరుచున్నాను."

ఎడ్వర్డు తల్లిమరణమునకై మిగుల దుఃఖితుఁ డయ్యెను మంత్రులును, ఆయన రాజ్యముల యందలి జనులు చెప్పిన యూఱటపలుకుల వలనను, హృదయరంగము నాక్రమించుకొనిన చింతను దుడిచి వైచి రాజ్యభారమును వహింపఁ బూనెను. విక్టోరియామహారాణికిఁ బరలోకక్రియలు సమస్తరాజచిహ్నములతోఁ జక్కఁగ నడిచెను. ఆయమ చుట్టాలందఱును విచ్చేసి యుండిరి. కాని ఆదేవేరి మనుమఁడు జర్మని దేశము

యొక్క యువరాజు తట్టమ్మవారిచే బీడితుఁడై ఉండినందున అవ్వ మరణ సమయంబున నింగ్లండునకు రాజాలక ఉండెను. ఎడ్వర్డు రాజ్యమునకు వచ్చిన రెండవయేఁట నాయన కుమారుఁడు ఇంగ్లండు విడిచి తొమ్మిదినెలలు బైటఁ దిరిగి యావలఁ దనదేశమునకు నేతెంచెను.

1901స. న. విక్టోరియా స్వర్గస్థురాలయ్యెను. ఆఫ్రికా ఖండంబున బోయర్లతోడి యుద్ధము పరిసమాప్తి కాక యుండెను. అందు ననేకులు రాజునకై ప్రాణములను గోలుపోవు చుండిరి. ఆగస్టునెలలో నెడ్వర్డుతోఁబుట్టువు వ్యాధిచేఁ బీడితురాలై కాలధర్మము నొందెను. అతఁడు ఆయమ చావు కాలమునఁ జెంగట నుండుటకు వీలు లేక పోయెను గాని, ఆయమకుఁ బరలోకక్రియలు జరుగునపుడు భార్యాసహితుఁడైవచ్చి, ఆచోటఁ గొన్నిదినము లుండి, పిదప డెన్మార్కు రాజ్యమునకు నేఁగి, అట నేతెంచిన రుష్యాచక్రవర్తులు మున్నగువారికి దర్శనం బొసంగి, ఇంగ్లండునకుఁ బున్రాగెంచెను.

1902సం. న ఎడ్వర్డునకుఁ బట్టాభిషేకమహోత్సవము నడుచుటకు మంత్రు లుద్యమములు సేయసాగిరి. ఎడ్వర్డు పార్లమెంటును రాజై తెఱచెను. ఆతఁడు గొప్పవారికి విందు చేసెను.

ఎడ్వర్డలెగ్జాండ్రుల పట్టాభిషేకమహోత్సవ మతివైభవంబున జరుగు నని జనులు అనేక దేశములనుండి లండను పురికి రావలయు నని కోరు చుండిరి. మంత్రులు ఆపురవరము

నన్ని విధముల నలంకరించిరి. పరరాజ సమూహంబులకును, సామంతప్రభుప్రకరంబులకును, ఎడ్వర్డు పట్టాభిషేకమహోత్సవమును వీక్షించుటకు రావలయు నని కమ్మలు వ్రాయెను. ప్రతి మనుష్యుఁడును, ఎడ్వర్డు పట్టాభిషేకపు సంబరమును గుఱించి యేవేళఁ బలుకుచుండెను.

దక్షిణాఫ్రికాఖండంబున బోయరులతోడి కలహావైశ్వానరుఁడు చల్లారెను. ఎడ్వర్డుచింత కొంతవఱకు నుపశమించె. జూనునెలలోఁ బట్టాభిషేకము నడుచుటకుఁ బ్రయత్నములు అత్యుత్సాహమునఁ గొనసాగు చుండెను. ఆల్డెరుషాటనుచోట నాంగ్లేయుల సేనాసమూహముల సొంపు నెడ్వర్డు వీక్షింపఁ బోవు నని తెలియఁ జేయఁ బడెను. కాని అతఁడు రోగపీడితుఁడైనందున నచ్చోటికిఁ బోలేఁ డయ్యె.

అతఁ డట్లున్నను, భార్యాసహితుఁడై వింజరునకు నేతెంచి, ఆచోట రెండుమూఁడురోజు లుండి, లండనుపురికి నేతెంచెను. ఆతని నాశ్రయించినవ్యాధి యెంతమాత్రము తగ్గినటులఁ గాన్పింపలేదు. అది రానురాను పెరుఁగుచునే ఉండెను. అయినను బట్టాభిషేకము గాంచుటకు నువ్విళ్లూరుచుండు జనుల యభిలాష సిద్ధింపదేమో అని ఎడ్వర్డు చింతించుచుండెను. రానున్న రాకపోవు నా? ప్రభవు లైనను తమకుఁ గలుగు నాపదలు రానీక తొలఁగింపఁ జేసికొనఁ గలరా? ఇదేమిమాట! ఎడ్వర్డు రోగపీడితుఁడైనందున జూనునెలలో

నడువవలసిన పట్టాభిషేకము ఆగస్టునెలలో జరుగు నని మంత్రులు తెలియఁ జేసిరి.

ఎడ్వర్డువ్యాధి క్రమముగఁ గుదుటఁ బడఁ జొచ్చెను. సర్ ఫ్రెడరిక్ ట్రీవ్సు (Sir Fredrick Treves) అను వైద్యుఁడు ఆయనకుఁ జికిత్స సేయుచుండెను. ఆయువు బటువుగ నుండె నేని, ఏమందైనను రోగమును కుదుర్చును. కొన్ని వేళలలో బీదలరోగములు మందులు లేక కుదిరి పోవు చుండును. ఎడ్వర్డు రాజాధిరాజు. అతనికి రోగము వచ్చినపుడు అనేకులావ్యాధిని మాన్పుటకు వచ్చి రనుటలో నాశ్చర్య మేమి? ఎడ్వర్డువ్యాధి నెమ్మది పడెను. జూనునెలలోఁ బట్టాభిషేకము నడువక పోయినను, రాజ్యము నభివృద్ధికిఁ దీసికొని రావలయు నని పాటుపడినవారికి నాప్రభువు ప్రాలుమాలక బిరుదుల నంపించెను. సాలిస్బెరిప్రభువు తన మంత్రిపదమునుండి తొలఁగి విశ్రాంతిఁజెందెను. అతనిపదమునకు బాల్ఫరుప్రభువు వచ్చెను.

ఎడ్వర్డువ్యాధి బాగుగ నుపశమించెను. ఆగస్టునెల 9 వ తేది శనివారమునాఁడు ఆతనిపట్టాభిషేకము వెస్టుమినిస్టరు భవనంబున నడిచెను. పరరాజులును, సామంతప్రభువులును, శ్రీమంతులైనవర్తకులును లెక్కకుమిక్కిలి యై వచ్చి, పట్టాభిషేకపుసంబరములం గాంచి పరితృప్తులై ఆయనకుఁ గానుకలను సమర్పించి, ఆయనవలన మన్ననలువడసి, తమతమ దేశములకు నేఁగిరి. ఎడ్వర్డు తన పట్టాభిషేక మహోత్సవ

వేళ లండనుపురిలో నుండు వైద్యాలయమునకు ధర్మార్థము రూ 17, 25,000 లను ఇచ్చెను. అతఁడాస్బోర్నభవనమును తనజనుల యుపయోగార్థము విడిచెను. తదాదిగ నామందిరంబున రణశూరులు నివసించుచుందురు. ఎడ్వర్డు పట్టమును గట్టుకొని తనవశమునఁ దనతల్లి విడిచిన ప్రజలను సాఁకుటకుఁ బ్రారంభించెను.



## పదియవ అధ్యాయము.



### ఎడ్వర్డు ప్రభుత్వము.

ఎడ్వర్డు ప్రభుత్వమునకు వచ్చినతోడ్తోఁ బరరాజులతో మైత్రిని మెలఁగఁ గోరెను. అతఁడందులకై సదా అన్యదేశంబులయందుఁ గ్రుమ్మరుచుండువాఁడు.

1903 సం. న ఏప్రెలునెల నాతఁడు పోర్చుగీసురాజ్యమునకు రాజధాని యైన లిస్బను, జిబ్రాల్టరు, మాల్టా, నేపిల్సు, రోము, పారిసు, మొదలగుపుటభేదనంబులకు వెళ్లెను. లిస్బనుపురంబున నారాజు ఎడ్వర్డు ననేకభంగుల గౌరవించెను. రోముపురివాసులాయనకు సంప్రీతిని విందులు సల్పిరి. పారిస్‌పురంబున ఫ్రెంచివారితో నాతఁడు నిండుమచ్చికఁ గొంతకాల ముండి రగులువిరోధాగ్ని నార్పి తనకొంపకిఁ జనెను.

ఫ్రాన్సుదేశమును ముందు రాజులు పాలించుచుండిరి.

ఫ్రెంచిజనులు తమదొరలు తమ్ముఁ జక్కఁగఁ బాలించుట లే దని వారిమీఁద దాడివెడలి వారిని రాజ్యచ్యుతులుగఁ జేసి, తామే తమదేశమును బాలింపఁ గడంగిరి. వారందఱును ఏఁడేఁటనో రెండేండ్లకు నొకతడవనో తమలో నొక తెలివి కలమెకనిని తమకుఁ బాలనలో సాయము సేయుటకు నియమించుకొను చుందురు. అతనికి "ప్రెసిడెంటు" అని పేరు. మనము వాని నే అధిపతి అని చెప్ప నొప్పును. ఇతఁడు తన యావజ్జీవపర్యంతము రాజ్యము నేలఁడు. ఇతని వంతుకాలము ముగిసినవెంట నే ఇతనిస్థానమునకు నింకొకఁడు వచ్చును. ఇతని సంతతివారే రాజ్యమునకు హావలయు నని చట్టము లేదు. ఇతని చేఁ జేయఁబడు ప్రభుత్వము జనులప్రభుత్వ మని చెప్పఁబడును. దాని నే ఆంగ్లేయభాషలో రిపబ్లిక్ ( Republic ) అని చెప్పుదురు. "రాజు" అనువాతఁడు తనయావజ్జీవము రాజ్యము నేలును. ఇతనివెనుక ఇతనికిఁ బుట్టినవాఁడు రాజ్యమునకు వత్తురు. ఆదేశప్రభుత్వ మీతని పై యుండును. దీనికి ఏకరాజ్యాధిపత్య మని పేరు.

జూలై నెలయందుఁ బరాసుదేశ ప్రజాప్రభుత్వమునకు మేటియైన లూబెట్టు(Loubet)అనువాతఁ డింగ్లండునకు నేతెంచెను. ఎడ్వర్డును, ఆతనిమంత్రులును, ఆఫ్రెంచిదేశాధీశునకు సకలమర్యాదలు సల్పి, సెంటుజేమ్సునగరంబున విందు లొనర్చిరి. ఇందువలన నాంగ్లేయులకును, ఫ్రెంచివారికిని, కలమైత్రి వృద్ధి

యయ్యెను. నవంబరునెలలో ఇటలీదేశాధీశుం డింగ్లండునకు విచ్చేసి ఎడ్వర్డునింట నతిథియై కొన్నిదినము లుండి తిరిగి తన రాజ్యమునకుఁ జనెను.

ఎడ్వర్డు భార్యాసహితుఁడై స్కాట్లాండు ద్వీపమునకు వెళ్లెను. అచ్చట నాప్రజలు ఆరాజదంపతుల ననేకరీతుల సత్కరించి తమరాజభక్తిని దెలియఁ బఱిచిరి. అతఁ డాచోటు వాసి, జూలై నెలలో నైర్లండులంకకుఁ జనెను. అతనివెంట నాత నిపత్నియును వెళ్లెను. అయిరిషుజను లా రాజదంపతులకు స్వాగతంబు నొసంగుట లేదని తిరుగఁబడినను, వారిలో రాజ భక్తిసంపన్ను లనేకులు వారియెడ ననురాగము కలవారై పెక్కు తెఱఁగుల వారిని గౌరవించిరి. అయిరిషుజనులు క్రైస్త వమతమున రోమను కాథలిక్కుమతస్థులు. వారికి రోముపురిలో నుండుగురువు మతాచార్యుఁడు. అతనిపేరు పదమూఁడవ పోపులియో. ఆమతాచార్యుఁ డప్పుడే సిద్ధి చెందెను. అయిరిష్ జనులు తమమతాచార్యుఁడు స్వర్గస్థుఁ డయ్యె నని కుందు చుం డిరి. ఎడ్వర్డట్టివారిని అనునయించి, వారిశోకాగ్నిఁ దనవాక్సు ధావర్షముచే నార్పి, మేనూత్ నగరంబునకు నేతెంచి, అయి రిష్ జనులలో మతగురువులబాలురు విద్య నభ్యసించునాలయ మును బరీక్షించి, అయిరిషుజనుల యుదారబుద్ధి సంపదలను మెచ్చుకొని, అయిర్లండులో బీదలు వసించుపల్లెలకు వెళ్లి, అందలి రిక్తజనులం గాంచి వారిస్థితిని జూచి వారికై దుఃఖించి

వారికిఁ గొంతద్రవ్యసాహాయ్యము సేసి, అయిరిషుజనులప్రీతి వడసి తనరాజ్యమునకు వేంచేసెను.

ఎడ్వర్డులెగ్జాండ్రులు "విక్టోరియా" అను కుమార్తె వెంటఁ జనుదేర నైర్లండులంకకు వెళ్లిరి. ఆదీవికి రాజధాని యైన డబ్లి ననుపురంబున నాతఁ డొకకళాశాలకు నస్తిభార మును వేసెను. కిల్కాని, లిస్మోరు, మున్నగుతావులలో నారాజదంపతులకు సకలమర్యాదలు నడిచెను. వార లాతా వును వదలి తమదేశమునకు మరలిరి.

ఎడ్వర్డనేకపర్యాయములు ఖండమందలి గొప్పగొప్ప పట్టణంబులకు వెళ్లి ఆరాజులమైత్రిని బొంది వచ్చుచుఁ బోవు చుండెడివాఁడు. కాని అతఁడు జర్మనిదేశములో బెర్లి ననునగ రంబునకుఁగాని అందలి మఱే పట్టణంబునకుఁగాని వెళ్లి యుండ లేదు. జర్మని రాజ్యమునకును, ఇంగ్లండునకును, గల రాజకీ యవ్యవహారములు శుభసూచకము లైనవిగఁ గన్పట్టలేదు. ఎడ్వర్డు జర్మనిదేశములో నుండు కీలనుతావునకుఁ జనెను. జర్మనిరాజు ఆచోట నాయింగ్లండునెడయని మిక్కిలి గౌర వించి ఆయన నభినందించెను. ఎడ్వర్డావల హాంబర్గునకు నేతెంచి, అందలిజను లొసంగువిందుఁ గుడిచి, కీలునకుఁ జను దెంచి, ప్రష్యారాకొమారుఁ డొసంగిన నాతిథ్యంబుఁ బొంది, రుష్యాదేశచక్రవర్తి కుమార్తె నామకరణమహోత్సవమును గన నారాజ్యమునకు వెళ్లి, క్రమ్మఱఁ దసయిరవునకు నరుదెం

చెను. ఇందువలన నాంగ్లేయులకును జర్మనివారికిని, గలచుట్ట
టికము బాగుగ వర్ధిల్లసాగెను.

1905 సం. న ఎడ్వర్డు విశేషఘనకార్యము లొనర్చిన
టులఁ గాన్పింప లేదు. కాని అతఁడు అయిరోపాఖండమందలి
పరరాజులతోఁ జెలిమిని బలపఱుచుచు నుండెను.

ఎడ్వర్డు మధ్యధరాసముద్రమున నుండులంకలను గాంచి
వచ్చుటకుఁ బయనము సేసెను. అతఁడు తనకంటె ముందుగ
వెళ్లిన అలెగ్జాండ్రాను మార్సేల్సులోఁ గలిసికొనెను. అతఁడు
ఫ్రాన్సురాజ్యపు టొడయనిఁ జూచి మధ్యధరాసముద్రమందలి
సర్డినియా ము న్నగులంకలకుఁ జనుదెంచి, ఆయాతావులలో
నుండుజను లొసంగు సపర్యలను గైకొని భార్యాసహితుఁడై
తన గీమునకు నేతెంచెను.

జూలై నెలలో సముద్రమునఁ బోరుసలుపు నాంగ్లేయ
నౌకావీరులు ఫ్రెంచివారిదేశమునకు నేఁగి వారిచే విందులు
గొని క్రమ్మఱ నింగ్లండునకు వచ్చిరి. ఆగస్టునెలలో ఫ్రెంచివారి
యుద్ధనావ లింగ్లండునకు వచ్చెను. ఎడ్వర్డుప్రభృతులు వానిని
గని ప్రమోదభరితాంతరంగు లైరి. ఫ్రెంచివారి యుద్ధవీరులకు
లండనుపట్టణంబున విందులు నడిచెను. పార్లమెంటుసభా
సభ్యులు వారిని మిక్కిలి అభినందించిరి.

నవంబరునెలలో నెడ్వర్డుజన్మదినమహోత్సవము జరి
గెను. ఇంగ్లండురాజ్యమునకు మేలు సేసినవారికి బిరుదావ

ళులు సేరెను. ఎడ్వర్డు జ్యేష్ఠపుత్త్రిక "ప్రిన్సస్ రాయల్ (Princess Royal) అనియును, ఆయమబిడ్డలు రాజవంశం బునఁ జేరినవా రనియును, చాటింపఁబడెను.

నార్వే రాజ్యమును, స్వీడును, ఏకమై ఉండెను కాని, ఆరెంటిలో నార్వేరాష్ట్రము వేఱుపోయెను. దానికి డెన్మార్కు-రాకొమారుఁడు చార్ల్స్ అను నాతఁడును, ఆయనభార్యయును, ఎడ్వర్డుకూఁతును అయిన మా డ్డనురాచపట్టియును, రాజును, రాణియును, అయిరి. ఈరాజదంపతు లిరువురు నార్వే రాజ్యలక్ష్మిని బొరసి దాని పాలింపసాగిరి.

షెఫీల్డులోఁ గట్టిన సర్వకళాశాలాభవనంబులను, మాంచెస్టరునుండి సముద్రమువఱకుఁ ద్రవ్విన కాలువను, లండను నగరంబునఁ గ్రొత్తగ నేర్పఱిచిన కింగ్సువే, ఆల్డ్విచ్ అను రాజవీథులను, ఎడ్వర్డు తెఱచెను. అతఁడు రణశాస్త్రము నభ్యసించెడి బాలురను గొందఱను బరీక్షించి, సెంటుమార్టిన్ స్లిగ్రాండులో (St Martin's - le - Grand) తపాలాశాలకు నస్తిభారమును వేసెను.

1906 సం. న లిబరలును, లేబరుపార్టీవారలును జయప్రదులై ప్రభుత్వమును వహించిరి. సర్ హెన్రికాంబల్ బానర్మా ననునాతఁడు మంత్రిపదంబున నెలకొనెను. ఎడ్వర్డు సమస్త దేశరాజులతో లేనిపోనికలహాలములలోఁ బ్రవేశింపక నెమ్మదిగఁ బృథ్విని బాలించువాఁ డని చిరకీర్తి సంపాదించెను.

కాఁబట్టి బానర్లాను ము న్నగు ప్రధానులు ఎడ్వర్డుమాట చొప్పున రాజ్యమున రాచకార్యముల నడుపు చుండిరి.

ఫ్రాన్సు రాజ్యమున అట్లాంటిక్కు మహాసముద్రము నోర నుండు బియారిట్ జ్ అను పట్టణమునకు నెడ్వర్డు వెళ్లెను. అతఁ డావీటికి నేఁగునపుడును, మరలునపుడును, ఫ్రెంచిరాజ్యాధికారిని గాంచెను. అతనికిఁ బారి స్సనువీట నాఫ్రెంచి ప్రభువు విందు సేసెను. దీనిచే నింగ్లండునకును, ఫ్రాన్సురాజ్యమునకును గలచెలిమి బాగుగ స్థిరపడెను.

ఫ్రాన్సురాజ్యమున నుండు సర్వకళాశాలాధికారులు లండనుపురి సర్వకళాశాలఁ జూడ నేతెంచిరి. వారందఱును గొప్ప విద్వాంసులు. వారి నెడ్వర్డలెగ్జాండ్రులు మిగుల గౌరవించి, అనేకభంగుల నాదరించిరి. ఆవలఁ గొన్నాళ్లకు జర్మను రాజ్యమునుండి నగరపరిపాలకులు (Municipal Bodies) ఇంగ్లండునకు నేతెంచిరి. ఎడ్వర్డు వారలను మిగులగౌరవించెను జర్మని చక్రవర్తి "క్రోంబర్గు, ఫ్రెడ్రిచ్చుహాపు" అనుతావులకు నేఁగెను. ఎడ్వర్డును ఆచోటులకుఁ జనుదెంచెను. ఆచక్రవర్తి లిద్దఱకు పోసి యొడయఁడు విందులు సేసి వారినిమిగుల సంభావించెను.

నార్వేరాజ్యమునుండి ఎడ్వర్డుఅల్లుఁడును, కొమార్తెయును, ఇంగ్లండునకు నేతెంచిరి. లండనునగరంబున గిల్డుహాలునఁ విందు నడిచెను. ఎడ్వర్డలెగ్జాండ్రులు వారిరాకకు మిగుల

సంతోషించి, తమ మనుముని నెత్తి ముద్దాడి చిఱుతకు చిత్ర విచిత్రము లైనవస్తువుల నొసంగిరి.

ఎడ్వర్డు పెద్దకుమారుఁ డైనజార్జియువరాజును, ఆతని యేలికసానియును, హిందూదేశమునకు వెళ్లి, క్రమ్మఱఁ దమ పురికి విచ్చేసిరి. ఎడ్వర్డు వారలకు సగౌరవంబున స్వాగత మిచ్చెను.

న్యూకాజ లనుపురంబున నైననునదిపై వంతెన కట్టఁబడెను. ఎడ్వర్డు దానిని దెఱచెను. అది నాతనిపేరఁ బ్రసిద్ధిఁ గాంచెను. అతఁడు అబర్డీ ననుసర్వకళాశాలలో మారిష్కల్ కాలేజిని తెఱచెను.

1907 సం. న ఎడ్వర్డు తన భార్యామణి వెంటరా మధ్యధరాసముద్రయానము సేయ నారంభించెను. త్రోవలో నుండు స్పైనుదేశాధీశ్వరుఁడు ఎడ్వర్డు నెదుర్కొని మిక్కిలి గౌరవించెను. ఎడ్వర్డావల నిటలీఱేనిని దర్శించి, ఆయనతోఁ జాలకాలము సంభాషించి, జర్మనిరాజ్యమునకు నేఁగి, ఆచక్రవర్తితోఁ గొంతకాలము ప్రొద్దుపుచ్చి తనయింటికిఁ జనుదెంచెను. ఈసమయమున డెన్మార్కునొడయఁడును, ఆయన దొరసానియును, ఇంగ్లండునకు వచ్చి ఎడ్వర్డునింట నతిథు లై ఉండి, తమ రాజ్యమునకు వెళ్లిరి.

ట్రాన్సువాలు దక్షిణాఫ్రికాలో నొకరాజ్యము. ఆయది కెంపులు రవలు కలగనులకుఁ బేరు వడసి యుండును. అందలి

జనులు తమకు నెడ్వర్డునెడ కలరాజభక్తి విశ్వాసములు నెల కొల్పుచు, అపూర్వమైనరత్నాభరణమును చేసి ఎడ్వర్డునకుఁ గానుకగ సమర్పించిరి. అతఁడు దానిజిగికి మదిని మెచ్చుకొని, దానిని రెండుగఁ జేసి, కిరీటంబుల బొందికపఱిచెను. ఆరత్నము వారికిరీటంబుల నెలకొని ఎడ్వర్డుఱెగ్జాండ్రులలో లేనికాంతిని గల్పించెను.

ఎడ్వర్డింతకుమున్ను జర్మనిదేశమునకు వెళ్లి ఆరాజ్యపు టొడయనిఁ గాంచి తనదేశమునకు మరలెను. జర్మనిరాష్ట్రపు రాజు అమాత్యసహితుండై పరిజనులు తన్నుఁ బరివేష్టించికొలువ నింగ్లండునకు విచ్చేసెను. ఆయనకును, ఆయనధర్మపత్నికిని, ఆతనివెంటఁ జనుదెంచిన పరిజనములకును, విండురుభవనంబున నెడ్వర్డు విందులు సలిపెను. ఆక్సుఫోర్డు సర్వకళాశాలాధికారులు జర్మనిప్రభువునకును "డి. సి. యల్. (D .C. L.) అనుపట్టమొసంగిరి. ఆరాజును, ఆతని పరివారమును, ఇంగ్లండునఁ గర్నల్ స్టూవర్టువోర్ట్లి (Colonel Stuart-Wortley) అను నాతనియునికిపట్టయిన హైక్లిఫ్ కాజిలునఁ (High Cliff Castle) బెక్కురోజు లుండి తనదేశమునకుఁ జనెను. ఈతని రాకచే నాంగ్లేయులకును, జర్మనివారికిని, అంతరంగమున నుండువిరోధము పరిసమాప్తి నొందెను.

ఇంగ్లండునకు లోఁబడిన యన్యరాజ్యము లనేకము లున్నవి. ఎడ్వర్డునకు మాఱుగ నాయనప్రతినిధు లారాజ్యం

బులఁ బాలించుచుందురు. వార లింగ్లండున నొకసభ గావిం చిరి. ఎడ్వర్డు వారిని సగౌరవమున నాహ్వానము సేసి, వారిని మిగులఁ గొండాడెను. నేరస్థులను విచారించుటకు న్యాయ స్థాన మొకటి ఏర్పడెను. ఎడ్వర్డు దానిఁ దెఱచి అందు న్యాయాధికారులు న్యాయాన్యాయములఁ జక్కఁగఁ బరిశీలించి అసత్యవిరోధు లై ఉండవలయునని వక్కాణించెను. కార్డిఫ్ అను పురంబున నోడలు నిర్మించుటకు దొరుపువంటి దొకటి త్రవ్వ బడెను. దానికి " అలెగ్జాండ్రా డాక్ " అని పేరు పెట్టబడెను. ఎడ్వర్డు దానితూము దెఱచినపుడు గనులలోఁ బని సేయు కూలివాండ్ర ప్రాణములఁ గాపాడువారికిఁ దనపేర నొక పతక మిచ్చునటుల మాట చెప్పెను.

1908 సం. న ఎడ్వర్డలెగ్జాండ్రులు, తమ రాజ్యమును వదలి డెన్మార్కునకును, స్వీడను, నార్వే, మున్నగురాజ్యము లకును వెళ్లి, ఆయారాజులం గని వారు సేయుసపర్యలను బొరసి తమనీటికిఁ జనుదెంచిరి. ఈయేటఁ బోర్చుగలు దేశాధీశ్వరుని నాతనిరాణి నాదేశమున నుండు నేకరాజ్యాధిపత్యము నొల్లని వారు మృత్యువువాతఁ బెట్టిరి. అనేకప్రభువు లాతుంటరుల చెడు చేష్టుంబులం దలంచి తమప్రాణముల నరచేతులయం దిడు కొని భయాక్రాంత స్వాంతులై ఉండిరి. అయిన నెడ్వర్డును, ఆతని రాణియును, ఆయనకుమారుఁ డైనయువరాజును, కోడ లును, సెంటు జేమ్సుస్పానిషు దేవాలయమునను, సెంటుపాలు

గుడియందునను దేవతారాధనల నడపించి, పోర్చుగలు రాజు నాత్మ సదయహృదయుఁడై నదేవునిలో లీన మగుఁ గాక అని భగవన్నామ స్మరణ సల్పిరి.

జూను నెలలో ఎడ్వర్డు ధర్మపత్నిసహితుఁడై రీవాలు నగరంబున విడిసి యున్న రుష్యాచక్రవర్తి కుటుంబమును జూడ వెళ్లెను. అనేకు లాయనను రుష్యాచక్రవర్తిని జూచుటఁ దూల నాడిరి. కాని ఎడ్వర్డు వారినుడువుల నొప్పరికించి తనయిచ్ఛమై నచ్చట నాతేనితోఁ గొంతముచ్చటలాడి తన పురంబునకు విచ్చేసెను. అతఁడు తనయింట దొడ్డ సర్దారులకు విందు నొన ర్చెను. ప్రజల సభామందిరంబున నుండు సభ్యులలో రాజదూషణ గావించిన వారికి నాతఁ డాహ్వానపత్రికను బనుపలేదు. లీడ్సులోఁ గట్టిన సర్వకళాశాలా భవనంబును ఎడ్వర్డు దెఱిచి ఇట్టి సర్వకళాశాలలు తనరాజ్యములలో నెల్లచోటులం దల్లు కొనవలయు నని మందలించెను.

సర్ హెన్రికాంబెల్ బానర్మా నను ప్రధానశ్రేష్ఠుఁడు తన పదవిని విడిచి విశ్రాంతిని జెందెను. అప్పుడు ఎడ్వర్డు ఫ్రాన్సు రాజ్యమున నుండు బియారిట్జ్ అనుపురంబున నుండి, తన కడకు ఆస్క్విత్తును రమ్మని ఆజ్ఞ సేసెను. అనేకు లెడ్వర్డు నాక్షేపించిరి. అతఁడు వారిమాటల నాలకింపక ఆస్క్విత్తును మంత్రి పదంబునఁ దాను ఫ్రాన్సున నుండినపుడే నియమించెను.

ఇంగ్లండు రాజును, రాణియును, స్వీడనురాజును, ఆత

నిరాణియును, ఇంగ్లండును జూడ నేతెంచిరి. వారివెంట నార్వే దేశాధీశ్వరుఁడు పత్నీ సహితుండై ఇంగ్లండునకు విచ్చేసి తమరాజ్యమునకు మఱలెను.

1909 సం. న ఇంగ్లండు పృథ్వీరమణుండు పరిజన పరివృతుండై సమస్తరాజచిహ్నములతో జర్మనిదేశమునకు నేఁగెను. ఈతని రాకవలన నంతకు మున్ను రాజుపగ అనునగ్గి చల్లారెను. జర్మనిప్రభువు ఇంగ్లండునేలికకు సకల మర్యాదలు సల్పెను. బెర్లినుపురవాసులు ఎడ్వర్డు రాజమార్గంబున నూరేఁగునపు డాతనిపైఁ బూలవానలు కురియించిరి. అనేకు లనేక భంగులఁ దమకు నింగ్లండునెడ కల ప్రీతి విశ్వాసములను దెల్పిరి.

ఎడ్వర్డు జర్మని వదలి ఇంటికి నేతెంచిన పిదప నప్పుడప్పుడు రోగపీడితుఁ డగుచుండు వాఁడు. అతఁడు ఫ్రాన్సులో నుండు బియారిట్జునకు నారోగ్యప్రాప్తికై వెళ్లుచుండును. అతఁ డీయేఁట నాపురికి వెళ్లెను. బియారిట్జునకుఁ జేరువనుండు "పా" అనునూరిలో విల్బరురై టను పండితుఁడు భూమ్యంతరిక్షముల నడుమ నడుచు నాకాశయానమును నిర్మించి పరిపరి విధముల దాని నడుపు చుండెను. ఎడ్వర్డాచోటికి వెళ్లి ఆపండితుఁ డాయాకాశవిమానంబునఁ గూర్చుండి బుర్రున నేలనుండి పైకి నెగురునపుడు గని విస్మయానంద చేతస్కుఁడై ఆవిద్వాంసునివలన నావిమానము నిర్మించు రహస్యంబులను గ్రహించి తనవీటికిఁ బుత్తెంచెను.

రుష్యాదేశ చక్రవర్తి జాయోనహితుం డై కౌసులో నుండు నెడ్వర్డు కడకు విచ్చేసెను. ఎడ్వర్డాయనను మిక్కిలి గౌరవించెను. కాని పార్లమెంటు సభ్యులలోఁ గొందఱు మన యెడ్వర్డు రుష్యాచక్రవర్తిని గౌరవించుట నానావిధంబుల నాక్షేపించిరి. అతఁడు వారిమాటల నాలకించిన వాఁడు కాఁడు. ఇందువలన నింతకు ముందు రుష్యాలో నడిచిన వివాదాగ్ని మొదలంట నారిపోయెను.

ఎడ్వర్డు ఆగస్టునెలలో నాస్ట్రియాకు వెళ్లి బొహిమియా నగరమునకు సమీపంబున నుండు "మెరైన్‌బాడు" అనుపల్లెకు వెళ్లెను. ఆగ్రామ మనారోగ్యదశచేఁ బీడింపఁబడు వారికి సంజీవి వంటిది. అతఁడాచోటఁ గొన్నాళ్లుండి దానినిఁ గొప్ప పట్టణముగఁ జేసెను. ఆస్ట్రియాదేశవైద్యుఁడైనడాక్టర్ ఆ ట్టను వాఁడు ఎడ్వర్డునకు దివ్యౌషధముల నిచ్చుచుండెను. ఎడ్వర్డా వైద్యుని మందులవలన మంచి యారోగ్యదశకు వచ్చిన పిమ్మట నింగ్లండునకుఁ జనుదెంచెను.

నవంబరు నెలలోఁ బోర్చుగలురాకొమారుఁ డింగ్లండునకు నేతెంచెను. ఆతని తల్లిదండ్రులు క్రూరులచే నక్రమముగ నకాలమరణము నొందియుండిరి. ఆరాచపసివాఁడు ఎడ్వర్డుకూఁతు న్వరియింప నేషించె నని ఒకమాట పుట్టియుండెను, కాని ఆమాట ఎంతమాత్రము సత్యము కాదు. ఎడ్వర్డాపసివానిని గౌరవించెను.

1910 సం. న వచ్చు వచ్చుబడి సెలవుల లెక్క తయారు సేయవలయునని ఎడ్వర్డుమంత్రులు పార్లమెంటులోఁ జర్చించిరి. ఎడ్వర్డు కోరికకు విరోధముగ నాలెక్కల పట్టి తయా రగు నటులఁ గన్పట్టెను. అందుచే ఎడ్వర్డు వారికి విరోధముగఁ బ్రవర్తింపవలసి యుండెను. కాని మంత్రులలో నెక్కువవారు ఎడ్వర్డుపక్షమున నుండి ఎడ్వర్డుకోరికప్రకారమున నాపట్టిని తయారు చేయించిరి.

1910 సం. వ ఫిబవరినెలలో నెడ్వర్డు పార్లమెంటు సభలను దెఱచెను. అతఁడు మార్చినెలాఖరువఱకు నూపిరివిడుచుటకుఁ గూడ విడుమర లేక రాచకార్యములు నిర్వర్తించుచుండెను. బీదలకష్టముల నంతమొందఁ జేయుటకు నొకసభ యేర్పడి యుండెను. ఆసభాసభ్యులు బీదలకై మిక్కిలి కష్టపడిరి. ఎడ్వర్డు వారిని బహుభంగులఁ బ్రశంసించెను.

మార్చినెల 5-వ తేదిని ఎడ్వర్డు కడపటితడవఁ గొలువు తీరెను. మంత్రులును, పార్లమెంటు సభాసభ్యులును, వెండియు ననేక రాజులును, కొలువుకూటంబున నాయా తావులలో న్నమరి యుండిరి. ఎడ్వర్డు రాజకీయ వ్యవహారంబుల విచారించి నాఁటి సాయంకాలంబున నందఱకు విందు నొనర్చెను. అప్పు డనేకులు వచ్చి సంప్రీతిమై నావిందుఁ గుడిచి తమతమ పొందుపట్లకు నేఁగిరి.

మఱునాఁ డాదివారము. నాఁడు ఎడ్వర్డుప్రభువు భగ

వంతుని స్మరించి, స్వపుత్త్రబంధువర్గములతో భోజనము సేసి వారితోఁ గొంతకాలము ప్రొద్దు పుచ్చి డోవరనుతావునకు వెళ్లెను. ఎడ్వర్డు ఇంగ్లండు వదలి పరరాష్ట్రములకు నేఁగునపుడు మంత్రి వెంటఁ జనుదెంచి దారి సాగనంపు చుండువాఁడుక. ఆవాడుక మేరకు ప్రధానమంత్రి యైనఆస్క్విత్తు వచ్చుటకు వీలు లేనందున నెడ్వర్డాతని క్షమించెను.

ఎడ్వర్డు ఫ్రాన్సురాజ్యమునకు వెళ్లి, అచ్చటఁ బారిస్సు నగరంబున నాదేశాధిపతితోఁ గొన్నిముచ్చట లాడి "బియారిట్జ్" అనుపురికిఁబయనము సేసెను. దారిలో నాతనికి పడిసెము పట్టెను. కాని అతఁడు దాని నంతగ గమనింపక బియారిట్జులో నావ్యాధి ఉపశమించు నని నమ్మి యుండెను. మనుష్యులకోరిక లెల్లకాలంబుల జయప్రదము లగు చుండు నే? ఇప్పు డాతనికి సంప్రాప్త మైనరోగము బల మైనది. అతఁడు తల్లిమాడ్కిఁ బడకపైఁ బండి యుండువాఁడు కాఁడు. అతఁడు తన్ను రోగము మూలముగఁ బీడించు చుండినను, మోటారు బండ్లలో సికారిపోవు చుండును. అందువలన జను లాతనిరోగ మంతబల మైనది కా దని తలంచి యుండిరి.

లాడనులో వెలువడుదినపత్త్రిక ఎడ్వర్డువ్యాధి బలమైనదని చాటెను. ఆతనికిఁ బరిచర్యలు సలుప నమ్మక మైనదాది నాచోటికిఁ బనుపవలయు నని మంత్రు లాలోచించి, పూర్వ మాయనకు రోగము వచ్చినపుడు శుశ్రూష సలిపినదాదిని

బియారిట్జనుతావునకుఁ బంపిరి. ఎడ్వర్డు ఎప్పటిరీతిని వ్యాధి లేనివానిపగిది నుదయముసాయంకాలంబుల సికారి పోవుచు, వారివారికి వ్రాసినజాబులఁ జదివి వానికి దస్కతు చేయుచు, తన్నుఁ జూడ నేతెంచినవారిని గౌరవించుచు, విడుమరదినముల యందును రాచపనులఁ గావించుచు, మిత్త్రులతో సరససల్లాప ములు సేయుచు, నియమితకాలంబుల భగవదారాధనల నొన ర్చుచు, రోగమని శయ్యపైఁ బరుండక సర్వదా ఏదో ఒక పని సేయుచుండువాఁడు.

ఎడ్వర్డు తనపురికి విచ్చేయుత్రోవలోఁ బారిస్సునగరం బున బడిపిల్లకాయలకు విందు నడిచెను. ఎడ్వర్డాచోటికివెళ్లిన కాలంబున నాతనికి నొకదొడ్డవాఁడు వ్రాసినకమ్మ జారి క్రిందఁ బడెను. కాని అతఁడు దాని గమనింప లేదు. అవల నాతఁడు దానిపోకను గని దానిఁ గైకొన్నవారి నారయుచుండెను బడి పిల్లలకు నధిపతులలో నొకతె తనకు నాజాబుదొరికినదనియుఁ, దాను దానిని విప్పి చదివితి ననియు, వచించెను. అంత దాని యధికారులు గొప్పరాజునుత్తరము నాయనయనుమతిలేక చూపినందులకు నాగ్రహచిత్తులై దానిఁ బనినుండి తొలగింప నుద్యమించుచుండిరి. ఈవార్త ఎడ్వర్డుచెవినిఁ బడెను. వెంట నే అతఁ డాబడివిచారణాధ్యక్షులకు "ఆముసలిది తెలియక అజ్ఞానముచే నాజాబుఁ దీసికొనినందులకై దానిని జీవనాధారము నుండి తొలగింపకుఁడు. ఇదియ నామనవి." అని వ్రాయఁగా,

వారు దానిని క్షమించిరి. పిమ్మట నెడ్వర్డు తనయిరవునను నరు దెంచెను.

ఎడ్వర్డు లండనుపురికిఁ జనుదెంచినతోడ్తో ననేకులు ఆయ నను జూడ వచ్చిరి. ఆయన వారి నందఱను గౌరవించెను. ఆయనపెద్దకూఁతును, ఆయమబిడ్డలును, ఇంకననేకపరరాజ నికరంబులును, ఆతనిఁ జూడ నేతెంచి యుండిరి. ఎడ్వర్డు రోగ మంచే నెంతమాత్రము బ్రాలుమాలక తాను సేయవలసినకార్యం బుల నెల్ల మంత్రులయధీనంబున విడువక వానిఁ దానే చేయుచు, వచ్చినప్రభువుల సంభావించుచు నుండెను.

ఎడ్వర్డు సాండ్రింగుహాముభవనంబునకు వెళ్లెను. అతఁ డీచోట ననేకకాలంబుల నుండి ప్రొద్దుఁగడుపు చుండెడివాఁడు. ఆభవనమునకు నలుగడల నాయనభూము లుండును. అతఁ డాభూముల వ్యవసాయము సేయుటకుఁ గాపులను విడుచు చుండును. అతఁ డాచోట నుండునపుడు వారిసౌఖ్యములకు నావంతయేనియు భంగము లేకుండనుండు నుపాయంబుల వెదకి వారికి నెల్లసుఖంబులు గలుగఁ జేయు చుండెడివాఁడు. అతఁడు వారికి నిండ్లను గట్టించి యిచ్చెను. వారికిఁ గృషికి వలయు పరి కరములఁ గొని యిచ్చెను. అతఁడు సేద్యమునకు వలయు సౌ ఖ్యంబుల నన్నింటిని వారికిఁ గూర్చి వారి నెనరు వడయుటకుఁ బాత్రుఁ డయ్యె.



## పదునెకండవ యధ్యాయము.



### ఎడ్వర్డు అవసానదశ. మరణము.

1910 సం. న మేనెల 5 తేదిని ఎడ్వర్డు మిక్కిలి జబ్బుపడి నాఁడనియును, పరదేశమునకు వెళ్లి ఇంటికి నేతెంచుతనభార్య నెదుర్కొనఁబో నశక్తుఁడై యుండెననియును, వైద్యులు తెలియఁజేసిరి. ఫ్రాన్సులో నుండు కలేలో నుండిన అలెగ్జాండ్రా తన భర్త వ్యాధిపీడితుఁడై నాఁడని విన్నదై యెకాయెకినిదారిలో కుంభద్రోణవర్షము కురియు చుండినను, ఆవాసలో నే లండను పురికి విచ్చేసెను. వైద్యులు "అమ్మా! మీభర్తగారి శ్వాసకోశములు కొంచెము చెడి యున్నవి. శీఘ్రముననే భగవంతుఁడాయనశ్రమను నివారణ సేయఁ గలఁడు." అని మందలించిరి. ఆయిల్లాలు ఇంతకుముందు నాతఁడు వ్యాధిగ్రస్తుఁడైనపుడు దేవుని నమ్మినందున నాతఁడు స్వస్థచిత్తుఁడయ్యెనని తలఁచి భగవంతుఁడే తననాథునిమేనఁ బ్రాణముల నిలుపు నని మిక్కిలి విశ్వసించి యుండెను. కాలము సమీపించినపుడు, దేవుఁడేమి చేయఁగలఁడు? నాఁటి రాత్రి రోగము ముదురు చుండెను. వైద్యులు దాని నాఁప సర్వవిధంబులఁ బ్రయత్నించు చుండిరి.

ఎడ్వర్డింత జబ్బుస్థితిలో నుండినను, పడక నుండి లేచి భగవంతుని స్మరించి, రాచకార్యములు నిర్వర్తింపు చుండెను. ఆతని ప్రాణమిత్త్రుఁడైననాలిస్సుప్రభు వాతనిఁ జూడ నేతెం

చెను. ఎడ్వర్డు లేచి తనమిత్త్రుని గాఢాలింగనము గావించు కొని, యతనియోగక్షేమముల నారసి కూర్చుండ నియమించి యతనితో ముచ్చటలాడుచుఁ బ్రొద్దు పుచ్చుచుండెను. కాని వైద్యులు "రాత్రి రాజు బాగుగ నిదుర పోయెను. అయినను రోగముమాత్రము ముపశమింప లేదు". అని వక్కాణించు చుండిరి.

ఎడ్వర్డు ధైర్యలక్ష్మిని వదలక తన్నుఁ గన వచ్చిన మిత్త్రామాత్యులను గారవించి, వారితో దూరమున నుండుచెలికాండ్రకును, బంధువులకును, జాబులు వ్రాయవలయు నని చెప్పి, తాను బ్రదుకుట దుర్లభం బని కొన్ని యేర్పాటులు సేయఁ దలంచెను. ఆయనకుమారుఁడును, పుత్త్రికలును, మనుమలును, మనుమరాండ్రును, ఆయనను జుట్టియుండిరి. కాని ఆతని కడపటి ముద్దుకూఁతురు మాత్రము నార్వేకు వెళ్లియుండెను. ఆచిన్నది తండ్రిజబ్బుస్థితిని విన్న దై బిరబిర వచ్చినను, ఆమె తండ్రిని జూడ నే లేదు. వైద్యులు మేనెల 7 వ తేది ఉదయమున 7 ఘంటలప్పుడు, "రాజు బ్రతుకుజాడలు కాన్పింపలేదు; అతఁడిప్పుడు నదే స్థితిలో ఉన్నాఁడు." అని చెప్పిరి.

బకింగుహాముభవనంబునకు నలుగడల ననేకులు గుంపులు గూడి పైవార్తను విని దిగు లొందినహృదయము కలవారై నిర్వ్యేరపడి యుండిరి.

ఎడ్వర్డుభాస్కరుఁ డస్తమించు నని చెప్పురీతిని నాఁడు సూర్యుఁ డపరదిక్కున నొరిగెను. సంధ్యారాగము మిన్ను నఁ

బర్వెను. ఎడ్వర్డు స్వర్గమునకు నేఁగు చున్నాఁ డనిచాటించు రీతిని నుద్యానవనంబుల నుండుపక్షిగణంబులు కిలకల మని కూయఁదొడంగెను. మూలల దాఁగినచీఁకటులు సన్నసన్నగ రాజొచ్చెను. చోరులును, విటులును, సంతసంబున సందుగొందుల విహరింపసాగిరి. చుక్కలు మిన్నున మినుకుమినుకని రా జిల్లగడంగెను. లండనుపురవాసు లన్నము తినియుఁ దినక ఎడ్వర్డు దేహస్థితి నరయుటకు బకింగుహాముభవనంబును సమీపించి గుమి గూడి యుండిరి.

బకింగుహాములోపల నెడ్వర్డుమోమువన్నె డస్సె; నోట మాట నిలిచె; కన్నులు మూతవడె; ఊపిరివిడుచుట మానె; దంతములకాంతి డీలువడె; దేహావయవము లన్నియుఁ జల్ల నయ్యె; మేనెల 6 వ తేది శుక్రవారము నాఁటిరేయి నడిజాముననెడ్వర్డు మృతి నొందె; నని ఆయనచెంగట నుండున లెగ్జాండ్రా, ఆతని పెద్దకొమారుఁడు జార్జి, మున్నగు వారు తెలిసికొని గొల్లున నేడువసాగిరి. కాంటెర్బరి ఆర్చిబిషపు, ఎడ్వర్డు సమీపంబున నుండి రాజునాత్మ యేసునాథుని యనుమతిని బొంది స్వర్గముఁ జేర, భగవంతుని స్తోత్రము సేయుచుండెను. వెస్టుమినిస్టరు కోవెలగంట, ఎడ్వర్డు నాకంబునకు నేఁగె, నని జనులకు దెల్పు చుండె, ననుతెఱంగున శబ్దించెను. ఇంతలో నెడ్వర్డుమంత్రులు లేతెంచి తండ్రిచావునకై వగచు చుండు జార్జి నూఱడించి, అలెగ్జాండ్రా దుఃఖమును శాంత

పఱచి, సమస్తరాజచిహ్నములతో నారాజశవమును సమాధి చేయించిరి.

విక్టోరియా కాలధర్మము పెందినపుడు జనులు ముసలి దొరసాని పోయె నని చింతింపక ఉండిరి. ఎడ్వర్డు తల్లిమాడ్కి బెక్కేండ్లు రాజ్యము నేలలేదు. అందఱును అలెగ్జాండ్రా వైధవ్యదశను బొందవలసి వచ్చెఁగదా అని కుందు చుండిరి. "అయ్యో! పాపము! అలెగ్జాండ్రా నలువదేండ్లు మగని దగ్గఱఁ గాపురము సేసినది. ఎన్నఁడైన నాయన మనస్సు నొచ్చు లాగున నాయిల్లాలు వర్తించి యుండు నే? ఆగృహిణి పోయి, ఎడ్వర్డుండకూడదా?" అని పెక్కుమంది పల్కు చుండిరి.

ఎడ్వర్డు, ప్రభుత్వమునకు వచ్చి తొమ్మిది సంవత్సరములు రాజ్యము నేలెను. అతని ప్రభుత్వ మారంభంబున నాయా చోటులలో గలహము లుద్భవిల్లినను, అవన్నియు క్షీణించి, అన్నిచోటుల జనులు సుఖంబుగ నుండఁ జాలిరి. హిందూదేశ స్థులు విక్టోరియా పరిపాలనలో సుఖంబుగ మనిరి. ఎడ్వర్డు దొర తనమున వారియుల్లంబుల నవశక్తి నెలకొనెను. అది భగవం తునికృపచే నభివృద్ధి బొందులాగున నాయెడ్వర్డు హిందూదేశ స్థులకు లేనిహక్కులఁ గల్పించి అల్లరుల నాపి, దేశమును నెమ్మదిస్థితిని జార్జికి నప్పగించి తాను దీర్ఘకాలము విశ్రాంతిఁ జెంద నేగె.

జార్జి, తండ్రియనంతరము ఇంగ్లండు, స్కాట్లండు, ఐర్లండు, హిందూదేశము, కన్నడా, ఆస్ట్రేలియా మొదలగురాజ్యము లను నేలిక యయ్యె. ఇతని దొరతనమున జనులందఱును సుఖం బు పడయుదురు గాత!



శ్రీ.

# వేదము వేంకటరాయశాస్త్రి,

## జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందు

4, మల్లికేశ్వరవీథి, ముత్యాలపేట, మదరాసు.

## సంస్కృత గ్రంథములు.

| | |
|---|---|
| కుమారసంభవము.—సం. వ్యాఖ్య, తె. పూర్ణటీక. | 2 రు. |
| అమరుకావ్యము—సం. వ్యాఖ్య, తె. పూర్ణటీక. | 1 రు. |
| పంచతంత్రము.— | రు.1-4అ. |
| హితోపదేశము.— | 12 అ. |
| దశకుమార చరిత్రము. | 1 రు. |
| మేఘసందేశము—సం. వ్యాఖ్య. తె. పూర్ణటీక. 264 పు. | 2 రు. |
| విక్రమార్కచరిత్ర.—తె. విపులటిప్పణము. | 12 అ. |
| బిల్హణచరిత్ర. తె. పూర్ణటీక. | 6 అ. |
| భోజచరిత్ర—తె. టిప్పణము. 8 అ. ☞ ఇదే టిప్పణము విపులతరము. | 12 అ. |
| పుష్పబాణవిలాసము— సం. వ్యాఖ్య, తె. పూర్ణటీక. | 8 అ. |
| రసమంజరి—భానుకృతి. శృంగార విస్తరము. తె. పూర్ణటీక. | 12 అ. |
| ప్రియదర్శికానాటిక— శ్రీహర్షకృతి. సం. టిప్పణము. తె. పూర్ణటీక. పద్యములును గద్యములునుం గా ఆంధ్రీకరణము సయితము. | 1 రు. |
| శబ్దమంజరీ— సమాసకుసుమావళీ తిజంతమంజరులు— తెనుఁగునవివరణము సయితము. | 4 అ. |
| భర్తృహరిసుభాషితము—సం. వ్యాఖ్య, తె. సంపూర్ణటీక, పద్యములును. | 2 రు. |

## ఆంధ్రగ్రంథములు.

విజయవిలాసము.—పద్యకావ్యము సవ్యాఖ్యానము. రు. 1-8 అ.

సారంగధరచరిత్రము—పద్యకావ్యము, సవ్యాఖ్యానము. 1 రు.

ప్రియదర్శికానాటిక.— వత్సరాజాంతఃపుర రసవత్తర చరిత్రము, సతాత్పర్యము. 6 అ.

ప్రతాపరుద్రీయనాటకము—సటిప్పణము. 1 రు.

ఉషానాటకము. 8 అ.

శాకుంతలనాటకము—కాళిదాస కృతికి సరియైన తెనుఁగు. 12 అ.

నాగానందనాటకము—శ్రీహర్ష కృతికి సరియైన తెనుఁగు. సటిప్పణము. 8 అ.

(నాటక) గ్రామ్యభాషాప్రయోగనిబంధనము.—. 8 అ.

కావ్యాలంకారచూడామణి అలంకారము. విన్నకోట పెద్దనకృతి. 1 రు.

ఆంధ్రప్రసన్నరాఘవనాటక విమర్శ. 2 రు.

పారిజాతాపహరణము— అ. 4. ఇదే పెద్దయక్షరములది. 8 అ.

కథాసరిత్సాగరము—అత్యద్భుత నీతి వ్యవహార కథలు. 1092 పు.4 రు.

☞ ఇదే పూర్వభాగము రు. 2-2 అ. ఉత్తరభాగము రు. 2-2అ.

జ్ఞానవాసిష్ఠరామాయణము.— పద్యకావ్యము. 1 రు.